ఓం

శ్రీ గురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాస మంజరి

(ప్రథమ సంపుటము)




రచయిత

కీ॥శే॥ శ్రీమతి యిలపకుర్తి సీతామహాలక్ష్మి

నర్సాపురం, ప॥గో॥జిల్లా

ఓం

శ్రీ గురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాస మంజరి

(ప్రథమ సంపుటము)




రచయిత

కీ॥శే॥ శ్రీమతి ఉపకుర్తి సీతామహాలక్ష్మి

నర్సాపురం, ప॥గో॥జిల్లా

ఓం

శ్రీ గురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాస మంజరి

(ప్రథమ సంపుటము)



రచయిత

కీ॥శే॥ శ్రీమతి ఉపకుర్తి సీతామహాలక్ష్మి

నర్సాపురం, ప॥గో॥జిల్లా



వెల
రూ. 15-00

శ్రీ గురుభ్యోనమః

# పీఠిక

ఈ రచయిత్రి ( నా సహధర్మచారిణి) 1973 డిసెంబరు నెలలో బ్రహ్మైండైక్యము చెందినది. నేను సంపాదకునిగా నడిపిన "రాజయోగి" వేదాంత మాసపత్రిక యందు, మా యిర్వురి పేర్లతో ప్రకటింపబడిన వ్యాసములన్నియూ పుస్తక రూపంలో ప్రకటించినవి.

శ్వాశత రూపంలో నిలచి పరిపూర్ణ బోధయందు కృషిచేయు వారికెంతయో సహాయకారి గా నుండుననీ, గ్రంధ ముద్రణకు వలయు ధనము విరాళ రూపముగా తాము భరింతుమనియు భక్తులు వాగ్దానము జేసియుండుటచే వసూలు అయిన ద్రవ్యముతో ముందుగా ఈ గ్రంధము వెలువరించి నాము. నేను వ్రాసిన వ్యాసములు రెండవ సంపుటముగా ప్రకటింతుము. శ్రీ గురు పరమాత్మ కృపచే వారికి సమస్త శుభము లు కలుగుగాక!

అందముగా, సకాలములో, ఈ గ్రంధమును ముద్రించి యిచ్చిన వారికి మేమెంతయో కృతజ్ఞులము.

మా దంపతుల కిరువురకు గురుదేవులైన శ్రీ మదచల ఋషి పొన్నాల రాజయోగీంద్రుల వారి దివ్యశ్రీ చరణ సరోజములకు ఈ గ్రంధమును మరియొక పూజా పుష్పముగా సమర్పించుకొనుచున్నాము.

ఇట్లు

**యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు**

**నర్సాపురం**

# ముందుమాట

పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు గారు, శ్రీ అచల ఋషి దయానంద పొన్నాల రాజ యోగీంద్రుల వారి అనుగ్రహముచే వారి దివ్యాశీస్సులతో శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయమును తమ గ్రంథ రచనల ద్వారా బహుళ ప్రాచుర్యము చేసి పాఠక లోకమును ఉత్తేజితులుగా జాగృతమొనరించి నారు. వారి శిష్య ప్రశిష్యులు వలయు ఆర్థిక సంపత్తిని సమకూర్చి వారి గురుభక్తిని వ్యక్తపరచుకొనుచునే ఉన్నారు.

అంతేకాక గురు ధర్మ నిర్వహణలో శ్రీరామచంద్రరావు గారు దంపతులు జరిపిన కృషిని, గడిపిన ఆదర్శవంతమగు జీవితమును లోకములో ప్రచారం చేయుటకై గురుదేవుల ఆశయ సంసిద్ధి కొరకు "శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థ" ను గుంటూరు జిల్లా, మంగళగిరి మండలం, యర్రబాలెం గ్రామంలో ఏర్పాటు చేసి శ్రీ గురుదేవుల ఆదర్శమును లోక కళ్యాణార్థము వివరించడంలో వారికి గల సహాయ సంపత్తిని అందించు చున్నారు. ఇది సహృదయులు సంతసించి ప్రోత్సహించవలసిన అంశము.

శ్రీ రామచంద్రరావు గారి రచనలన్నియు వారి గురుదేవులు శ్రీ శివరామ దీక్షితీయ పీఠాధిపతులైన దయానంద పొన్నాల రాజ యోగీంద్రుల వారి దివ్యశ్రీ చరణములకు పూజాపుష్పములుగా సమర్పింపబడియున్నవి. అట్లే యీ భాగం కూడా యొక పూజాపుష్పంగా వారి చరణ సన్నిధి చేరాలని భక్తమండలి వారి తరపున శ్రీ గురుపరమాత్మను ప్రార్థించుచున్నాము.

ఇట్లు

*భక్తమండలి తరపున*

**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

# విషయ సూచిక

శ్రీ గురుభ్యోనమః

ఈ గ్రంథమునకు ద్రవ్యదాతలు



## శ్రీ శాంతానంద బెజుగామ నరసింహారావు,
## ధర్మపత్ని మాతృశ్రీ శాంతాదేవి

భూంపల్లి

ఓం
శ్రీ గురుభ్యోనమః

శ్లో॥ గురుబ్రహ్మ గురు విష్ణు: గురుదేవో మహేశ్వర:
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః

శ్లో॥ శ్రీరామచంద్ర గురోరిష్యం శాంతానంద దీక్షితం।
ద్వయ దోషరహితం పూర్ణం శ్రీ నరసింహాచార్య గురుంభజే॥

ఈ గ్రంథముద్రణ కొరకు కావలసిన ద్రవ్య సహాయం చేసిన ముద్గురు దేవులైన శ్రీ శాంతానంద బెజుగామ నర్సింహారావుగారి జీవిత చరిత్రలోని ముఖ్యాంశములు.

శ్రీ శాంతానంద బెజుగామ నర్సింహారావు గారు స్వస్తిశ్రీ దుర్మతినామ సంవత్సర మాఘ బ॥పంచమి రోజున దాదాపు క్రీ.శ.1922వ సంవత్సరములో పుణ్యదంపతులైన శ్రీ బెజుగామ కిషన్‌రావు, రాధాబాయి గర్భవాసమున మధ్యముడుగా జన్మించిరి.

అప్పటి పరిస్థితులను బట్టి వీరి యొక్క విద్యాభ్యాసము ఆనాటి ఐదవ(5వ) తరగతి చదివి ఆర్థిక ఇబ్బందుల వలన చదువు మానివేసిరి. 12వ యేట శ్రీవారికి ఉపనయన సంస్కారము జరిగెను. 18వ యేట వీరి తండ్రిగారైన శ్రీకిషన్‌రావుగారు బ్రహ్మైక్యము చెందిరి. తండ్రి మరణానంతరం కుటుంబ భారం పడటం వలన ఆనాటి నైజాం సర్కారు కాలములో వికారాబాద్ లో దస్తావేజులు వ్రాయుటకు గాను గుమాస్తాగా చేరిరి. అప్పటి వారి వేతనం నెలకు రూ.30-00లు మాత్రమే. ఈ వేతనంతో కుటుంబం చక్కదిద్దుకునే పరిస్థితి లేక వారి స్వగ్రామమైన భూంపల్లికి వచ్చి కొంత మంది పిల్లలతో ప్రయివేట్ పాఠశాల నడుపుచూ కాలం గడిపిరి.

అప్పట్లో ఆ ప్రాంతములో క్రైస్తవబోధ ఎక్కువ ప్రచారంలో ఉండెడిది. శ్రీవారికి ముందే భగవంతుడు, భక్తి అంటే ఎక్కువ ప్రేమ కాబట్టి కాబోలు క్రైస్తవ బోధలో చేరి మెదక్ సీమలో మత ప్రచారకుడిగా ప్రధాన పాస్టరుగా నియమితుడై రాత్రింభవళ్ళు అదే పనిగా తిరిగేవారు. ఈ విధానము గ్రహించిన వారి మిత్రుడు శ్రీ నారాయణ రెడ్డి (బిక్నూర్) గారు ఇది కులాచార పద్ధతికి అనుగుణంగా ఉండదని చెప్పి ఆర్య సమాజంలో చేర్పించిరి. ఈ విధముగా పైన చెప్పిన క్రైస్తవ బోధనుండి తప్పకొని ఆర్యసమాజమందు కృషిచేస్తూ వచ్చిరి అప్పటికి గురువుగారి వయసు25 సంవత్సరాలు.

ఈ పద్ధతిని గ్రహించిన వారి పెద్దలు ఇతనికి పెళ్ళి చేయడం మంచిదని ఆలోచించి అక్కడి సమీప గ్రామమైన పెద్దగుండెవెల్లి వాస్తవ్యులైన దానరాజు, కిషన్‌రావు, యశోదమ్మ అనే పుణ్యదంపతుల గర్భవాసమున పంచమ సంతానంగా జన్మించిన శ్రీమతి శాంతాదేవి గారితో వైభవంగా పెళ్లి జరిపించిరి. అమ్మగారికి కూడా చిన్ననాటి నుండి భాగవతం, హరికథలు, పురాణములు అంటే చాలా ఇష్టపడేవారు. వీరికి నాగేశ్వరరావు, కుటుంబరావు అను ఇద్దరు కుమారులు. గీత, జ్యోతి అనే ఇరువురు కుమార్తెలు జన్మించిరి.

శ్రీవారు భగవద్గీత ఉపదేశము పొందిరి. ఈ ధర్మాన్ని అక్కడి సమీప గ్రామాలైన ఖాజీపూర్, వెంటాపూర్, రుద్రారం, అల్వాల్, చెప్యాల, బేగంపేట్, భూంపల్లి, నిజాంపేట మున్నగు గ్రామాలలో ముమ్మరంగా ప్రచారం చేసిరి. కొన్నాళ్ళు ఈ విధంగా గడుస్తూరాగా, జన్మరహిత విధానమందు శ్రీ శివరామ దీక్షితీయం గొప్ప మార్గమని, శ్రేష్ఠమైనదని తెలుసుకుని ఆ పరంపర గురువులైన శ్రీ ద్వైత లక్ష్మణార్యుల వద్ద ధర్మోపదేశం పొంది, ఆయన మెప్పను పడసి గురువుగా అధికారం పొంది ప్రచార బాధ్యతను స్వీకరించిరి.

అప్పట్లో దీక్షితీయ సాంప్రదాయంలో శ్రీ పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియ శిష్యుడైన శ్రీ యిలపకుర్తి వీర వెంకట శ్రీరామచంద్రరావుగారి సంపాదకీయంతో 'రాజయోగి', వేదాంత మాసపత్రిక ఈ సాంప్రదాయాన్ని ఎక్కువ ప్రచారంలోకి తెచ్చినవి. ఈ మాసపత్రికల ద్వారా గురువు గారిని (శ్రీరామచంద్రరావు) పరిచయం చేసుకున్న శ్రీ ఆర్గొండ విశ్వనాథము గారు (పరిపూర్ణ దర్శనము) అనే గ్రంథము చదివి నిజ సాంప్రదాయమంటూ ఉంటే అది శ్రీ రామచంద్రరావు ప్రభువుల వద్దనే ఉందని గ్రహించి శ్రీ ఆర్గొండ విశ్వనాథం గారు అప్పటికే వారి గురువైన శ్రీ నర్సింహ్మారావు గారిని, అమ్మగారిని మెప్పించి పశ్చిమగోదావరి జిల్లా నర్సాపురంకు గురువుగారి సమేతంగా వెళ్ళి మళ్ళీ నిజసాంప్రదాయ పద్ధతిగా 1981లో శ్రీ యిలపకుర్తి రామచంద్రరావు గారి వద్ద ధర్మోపదేశం పొందిరి.

ఈ విధంగా గురుసేవకు పాత్రులై ఆయన మెప్పను పడసి సాంప్రదాయమందలి ముఖ్యాంశములు ఎరుక పరిపూర్ణముల వస్తు నిశ్చయ విధానము ద్వాదశి షోడశి మంత్రార్థ వివరణ కందార్థ కంద పద్యముల నిర్మిత విధానము సమగ్రంగా గ్రహించి, తెలంగాణ ప్రాంతములో జిజ్ఞాసులకు ధర్మపద్ధతిగా, ఈ

ధర్మాన్ని ఉపదేశించాల్సిందిగా గురువాజ్ఞ పొందిరి. కొద్ది కాలంలోనే శ్రీరామచంద్ర రావు గారు బ్రహ్మైండైక్య ము చెందటంతో ఈ ధర్మాన్ని ప్రతి సంవత్సరం "రథ సప్తమి" రోజున వారి గురువుగారి జన్మదినం వారి స్వగ్రామము భూంపల్లిలో జరుపుచూ, వారి శిష్యులైన శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి ద్వారా ఈ బోధ మర్మాలు సాకల్యము గా గ్రహించిరి.

ఇక పాఠ్యక్రమాల విషయానికి వస్తే ప్రతి భక్తునికి తాను స్వయంగా పాఠ్య పుస్తకాలు వ్రాసి అందజేసిన పుణ్యమూర్తి. అంతేగాక వాటిని నేర్చేవరకు వెనువెంటనే ఉండి నేర్పించెడివారు ఆచరణ, అనుష్ఠానం, విచారణల యందే తప్ప ఇంకా ఏ ఇతరమైన ఆలోచనలు వారికి ఉండేవి కావు. తరువాత వారికి వృద్ధాప్యము రావడం తో మాట్లాడే శక్తి క్షీణించి ఈ ధర్మాన్ని ప్రతి శిష్యునికి వివరంగా అందించాలని శ్రీ అర్గొండ విశ్వనాథము నిజామాబాద్‌గారిని కోరగా అట్టి లోటును శ్రీ విశ్వనాథము గారు తీర్చిదిద్దుచూ వచ్చిరి.

శ్రీవారి అనారోగ్యముతో రెండు, మూడు సంవత్సరములు బాధపడి చివరకు శ్రీ ప్రమాథి నామ సంవత్సర ఆశ్వీయుజ బహుళ అష్టమి రోజున తేది 31-10-1999 ఆదివారం రాత్రి గం. 2-45 లకు వారి స్వగృహమందు బ్రహ్మైండైక్యము జెందిరి. భౌతికంగా శ్రీ నరసింహారావు గారు లేని లోటు వారి శిష్యులకు తీరని లోటు. కృషి చేయు విధానంలో సాంప్రదాయకమందలి భోదనాంశములు శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి, ఆరుగొండ విశ్వనాథం గార్ల ద్వారా గ్రహించి ఆరూఢత చెంది కృతకృత్యులు కావలసి ఉన్నది. అందుకు వలయు శక్తి సామర్థ్యములు శ్రీ గురు పరమాత్మ కృపచే సిద్ధించుగాక.

వీరి యొక్క మండలాభిషేకము భక్తులందరి సహకారముతో 11-12-1999వ తేదీన వారి స్వగృహమందు ఘనంగా జరుపుకోవడం అయింది.

ఇట్లు

**శ్రీవారి భక్తమండలి**

# శ్రీమతి ఇలపకుర్తి సీతామహాలక్ష్మమ్మగారి సంగ్రహ జీవిత చరిత్ర

శ్లో॥ శ్రీమద్గౌరీ సమా, సీతామహాలక్ష్మీం స్మరామ్యహం!

వీర వెంకట శ్రీరామచంద్ర ధర్మపత్నీం కులోత్తమా॥

విరోధికృతన్నామ సంవత్సర పుష్య బహుళ ద్వాదశి నాడు శ్రీ అయ్యగారి వీరరాఘవయ్య కామేశ్వరమ్మ అను పుణ్య దంపతుల గర్భవానమున ఏకైక పుత్రికగా శ్రీమతి సీతామహాలక్ష్మమ్మగారు జన్మించిరి. పుట్టిన 10వ మాసములోనే తండ్రి గతించుటచే మాతామహుల ఇంట పెరిగి 1918వ సం॥లో శ్రీ ఇలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు గారికిచ్చి వివాహము గావింపబడెను. అప్పటికి ఈమెకు 7 సం॥లు. వరునకు 13 సం॥లు మాత్రమే వయస్సు. మూడవ తరగతి వరకు మాత్రమే ఈమె చదివెను. 1924 సం॥లోనే అత్తవారింటికి పంపబడి అప్పటినుండియు భర్త సాన్నిధ్యము వదలక జీవితమంతయు గడిపిరి. ఈమె తల్లిగారింట నున్నప్పుడు ఈమె నోములు, వ్రతములు ఎన్నియోచేసెను. ఈమెతల్లిగారు ఎందరినో పెద్దలను స్వగృహమునకు రావించి వారి వలన వేదాంత ప్రబోధము వింటూ కాలక్షేపము చేస్తూఉండగా ఆయా విషయములందు ఈమెకు ఎంతయో కుతూహలము కలిగి చక్కగా శ్రవణము చేసెడివారు. పెద్దలను సేవించుట సత్కరించుట ఆ చిన్న వయస్సునుండియే ఈమెకు అలవడినది. అత్తవారింట కేగుసరికి అచ్చటకూడ ఆమెకు అనుకూల వాతావరణమే ఏర్పడియుండెను. ఈమె మామగారగు వెంకటశివరామయ్యగారు మంత్రవేత్తలు, తపోధనులు. మాటిమాటికి బ్రాహ్మణ సమారాధన గావించెడివారు. 1929వ సం॥లో ఈమె భర్త న్యాయవాది వృత్తియందు ప్రవేశించి నర్సాపురంలో వేరేకాపురం పెట్టుట తటస్థించెను. నాటినుండి గృహమునకు యజమానురాలై మహిళా భక్తసమాజము నేర్పాటుచేసి వారమునకు రెండుసార్లు భజనకాలక్షేపము ఇంటియందు ఏర్పాటుచేసి మహాభక్త విజయము నందలి భక్తుల దివ్యగాధలు చదివి ఉత్తేజము పొందుచుండిరి. హరికథలు, పురాణ కాలక్షేపములు, వేదాంత ఉపన్యాసములు మొదలగు గ్రామములో జరుగు పుణ్యకాలక్షేపములకు భర్తతో కలసి ఈమె పోయి శ్రవణము చేయుచుండెడివారు. తల్లివలెనో ఈమెయు పెద్దలను ఇంటికి రావించుట సన్యాసులకు ఇంట భిక్ష చేయుట మామగారివలె బ్రాహ్మణ సమారాధన చేయుట మొదలగు కార్యములందు శ్రద్ధ వహించెడివారు. రామకృష్ణ పరమహంస, వివేకానంద, రామతీర్థ, రమణమహర్షి, మొదలగువారి జీవిత విశేషములను భర్తను అడిగి తెలుసుకొని ఆనందించెడివారు. ప్రతి ఏకాదశినాడు ఉపవశించి ఇష్టదైవము ఆరాధించుచు కాలము గడిపెడివారు. 1937వ సం॥లో శ్రీ శివరామ దీక్షిత పరిపూర్ణ బోధయందు ప్రవేశించవలెనని భర్తను హెచ్చుగా ప్రోత్సహించి శ్రీశ్రీశ్రీ పాలూరి జగన్నాధరావు గురుదేవులచే భర్తకు ఉపదేశము ఇప్పించి, తానుకూడా భర్తతోపాటు ఉపదేశము పొందెను. నాటినుండియు ప్రతినిత్యము అష్టోత్తర శతనామములతో గురుపూజ, గురుగీత పారాయణ వీరింట జరుగుచుండెను. స్థానిక భక్తులతో కలసి ప్రతి

సాయంత్రము కందార్థ విచారణ, వేదాంత గోష్ఠి జరుగుచుండెను. 1942వ సం॥ భీమవరంలో పీఠాధిపతులగు శ్రీ మద్దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారిని ప్రప్రథమముగా దర్శించి వారి ప్రబోధలను వినుట తటస్థించెను. గురుగోప్య విషయము లెన్నియో ఉన్నవని శ్రీవారిని ఆశ్రయించిన వారికి గాక అన్యులకు అవి దురవగాహములని ఈమె మున్ముందుగానే గుర్తించగలిగెను. భర్తగారిని ప్రోత్సహించి ఆయా సభలకు భర్తతో హాజరై తమ్ము శిష్యులుగా పరిగ్రహించమని శ్రీవారిని ప్రాధేయపడుచుండెడివారు. 1947 సం॥వరకు కారణాంతరములవల్ల శ్రీవారి నిజ ప్రబోధ లభ్యము కాలేదు. అయిననూ శ్రీవారి ఆజ్ఞమేరకు పూర్వపు గురువుగారిచే నిజ ప్రబోధలో ధర్మోపదేశముగొని శ్రీవారు రజాకార్ల ఉద్యమ సందర్భమున తాడేపల్లిగూడెంలో నివాసమేర్పరుచుకొన్న కాలంలో శ్రీవారి సన్నిధికి పదే పదే భర్తతో సహా పోవుచు శ్రీవారి వలన సాంగోపాంగముగా పరిపూర్ణము, ఎరుకల వస్తు నిశ్చయము తెలుసుకొని, మూలగ్రంథములను శ్రీవారి ముఖతః శ్రవణం చేసి కృతార్థురాలయ్యెను. ప్రధాన పీఠస్థానమగు సికింద్రాబాద్ పీఠమునకే గాక దాదాపు అన్ని ఉపపీఠములలో వార్షికోత్సవ సభలకు భర్తతో సహా పోయి పాల్గొని మహిళా సభలకు అధ్యక్షత వహిస్తూ శ్రీవారి వలన సర్వ సంశయ నివృత్తి గావించుకొనిన ధన్యజీవి. ఆమె లేకుండా ఏ సభకున్నూ భర్తపోయి ఉండలేదు. గత 5,6 మాసములలో తీవ్ర అస్వస్థతకు గురిఅయి రెండుమాసములు గుంటూరు జనరల్ హాస్పటల్ యందు చికిత్స పొందియు, పూర్ణారోగ్యము పొందజాలక పోవుటవలన నవంబరు నెలలో జరిగిన అసిఫాబాద్ సభలకు మాత్రము భర్తతో పోజాలకపోయెను. ఆమె అస్వస్థతను గురించి టెలిగ్రాము అందుకొని ఒక్క ఉపన్యాసము మాత్రమే సభలో ఇచ్చి మిగిలిన కార్యక్రమములలో పాల్గొనకయే భర్తగారు నర్సాపురం తిరిగి రావలసివచ్చెను. చికిత్సలన్నియు విఫలమై పోగా ప్రారబ్ధ కర్మానుభవము పూర్తి అయిన వెంటనే ది. 5-12-73 తేదీ బుధవారం ఉదయం గం. 6-45 ని॥లకు ఈమె కర్మ శరీరము భర్త చేతులలో బ్రహ్మైక్యము చెందెను.

మాతృశ్రీ, శ్రీమతి సీతామహలక్ష్మి తల్లి సార్థక నామ ధేయవతి, పుట్టు భోగి. ఐతే ఈ సీత దుఃఖమెరుగదు. ఈ మహలక్ష్మి ఆ మహలక్ష్మిలవలె చంచలగాదు. యింటి కరుదెంచిన గురుపుత్రులకేగాక అతిథి అభ్యాగతలను కూడ ఆదరించి విసుగు విరామములు లేక అన్నదానము చేసిన అన్నపూర్ణ. మా గురుదేవలగు శ్రీరామచంద్రుల సహధర్మచారిణియై మా కందరికీ జ్ఞానభిక్ష ప్రసాదించుచూ బ్రహ్మసత్రము నడిపిన మహాసాధ్వి.

జోహారు తల్లీ జోహారు. సీతామహలక్ష్మి తల్లీ జోహారు.

ఇట్లు
భక్తమండలి తరపున
**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

# స్త్రీలు - బ్రహ్మ విద్యాధికారము

స్త్రీలకు బ్రహ్మ విద్యాధికారం లేదని తెలియనివారు కొందరంటూ వుంటారు. ఈ అభిప్రాయము సరిగాదని ఇది వరకే పలువురు ఋజువు చేశారు. ఐననూ స్త్రీ లోకం యీ విషయం పూర్తిగా తెలిసికొనుట మంచిదని తోచి ఈ వ్యాసం రచించడమైనది.

స్త్రీ పురుషులకుండే తారతమ్యమేమో మొదట గుర్తించినచో ఉభయులకూ, ఎందెందు అధికార తారతమ్యంగలదో కూడ తెలియును. శరీర పరిగ్రహణ పొందిన జంగమ జీవులలో స్త్రీ పురుష రూపములలో మాత్రమే తారతమ్యము ప్రత్యక్షముగా గానవచ్చుచున్నది. స్థూలాతి స్థూలమగు స్థూల శరీరమునందు బాహ్యరూప అవయవ నిర్మాణములోను అంతరమున గర్భాశయమునందుగల కొన్ని మార్పులలోను తప్ప భేదమేమిన్ని గానరాదు. పరమాత్మ సృష్టి విధానమునందు సంతానమున గని, ఆ సంతానమును పోషించుచూ మాతృస్థానమాక్రమించ వలసినదగుటచే స్త్రీ దేహమునందు ఈ మార్పులవసరమయ్యెను. స్త్రీ క్షేత్ర రూపముగా నుండి పురుషుని వలన, సంతాన బీజం గ్రహించి, గర్భము ధరించి, పిండమును నవమాసములు తన గర్భమున భరించవలెను. మరిన్నీ స్తన్యమిచ్చి శిశువును పోషించవలెను. కనుక స్త్రీ పుంలింగ భేధము ఒండొరుల స్థూల దేహమునందు మాత్రమే గలదు. కాని సూక్ష్మ, కారణ, మహాకారణ, శరీరములందు యిసుమంత భేదమును లేదు. స్థూల శరీర స్తములగు అవయవ భేదముచే కాయికముగ స్త్రీ బలహీనమైయున్నది. అబలయని పేరొందినది. మరియు శిశువు 1 సంవత్సరమైనా యెదుగు వరకూ శిశు పోషణ యందు ఏమరక, శిశు క్షేమమునకై తన సర్వస్వము ధారబోయు త్యాగశీలము, శిశుపోషణకై కష్టములనుభవించుటలో సహన బుద్ధి, దయార్ద్ర హృదయము స్త్రీలకు పెంపొందుచున్నవి.

కాని పురుషులకు వలె, స్త్రీలకున్నూ, కోరికలు, ఆశలు సుఖదుఃఖాదికములు, ఈషణత్రయములు, జ్ఞానాజ్ఞానములు, రాగవిరాగములు, పాపపుణ్యములు, బంధమోక్షములు, జనన మరణములు వుండియే యున్నవి.

ప్రాణమయ కోశము ధర్మములైన ఆకలిదప్పులు, మనోమయ కోశము యొక్క ధర్మములైన శోక మోహములు స్థూల శరీరములో భేదమున్ననూ దానియొక్క ధర్మములైన వాతపిత్త శ్లేష్మములు, షడ్భావ వికారములు అనగా అస్తితే (తల్లి గర్భమందు ప్రవేశించుట) జాయదే (పుట్టుట) వర్ధతే (వృద్ధిచెందుట) పరిణమితే (బాల్య యౌవన, కౌమార వార్థక్యములుగా మార్పులు జెందుట) అపక్షేయతే (శరీరము క్షీణించుట) వినశ్యతే (నశించుట) అనునవి పొందుట సమానమే కదా!

స్త్రీ పుం భేదము, పురుష ప్రకృతుల రూపంగా ఆది నుంచీ యున్నదే. ఈ భేద మీ రోజున పోవాలంటే ఎట్లా పోతుంది? అని కొందరంటారు. కానిస్థూల శరీర భేదములను కూడా కొన్ని శస్త్ర చికిత్సలచే మార్పు చెందింపవచ్చునని పాశ్చిమాత్య వైద్యులు ఋజువు చేయుచున్నారు. ఏమైనా పరమాత్మ సృష్టిలో గల భేదమున్నదేమో వున్నది. సంఘనిర్మితమగు భేదములు మాత్రము

కల్పితములు. ఈ కల్పిత భేదముల నివారణకై విశాల హృదయములు గల స్త్రీ, పురుషులందరూ ప్రయత్నించవలసి యున్నది. స్త్రీ, పురుషునికన్నా హీనమను దృష్టి మాత్రము ఎప్పటికైనా పోక తప్పదు.

తాత్వికముగా విచారిస్తే ఈ స్త్రీ పురుష భేదము ఎంత అల్పమైనదో గుర్తించ వచ్చును. "స్త్రీ" అను శబ్దము యొక్క వర్ణక్రమమును విభజించి చూడగా 'స' కార 'త'కార 'రేఫ' కార 'యీ' కారములు గూడి స్త్రీ అయ్యింది. 'స' యనగా సత్వగుణముకు, 'త' అనగా తమోగుణము. 'ర' యనగా సత్వగుణతమోగుణముల మిశ్రమంలో ఏర్పడిన రజో గుణము, 'ఈ'కారము వ్యాకరణరీత్యా స్త్రీ వాచకము, స్త్రీ అనగా గుణత్రయ అని అర్థము. యీ త్రిగుణములు పురుష స్థానమందు బీజరూపంగాయుండి ప్రకృతి స్థానమందు విజృంభించినవి.

వస్తుతః విచారిస్తే 'ఏకమేవాఽ ద్వితీయమ్" అని చెప్పబడే ఏకవస్తువే. త్రిగుణములను తనయందు బీజరూపంగా వహించి "పురుష" నామము చెందెను. బీజరూపంగానున్న త్రిగుణములు విజృంభించి సామ్యావస్థ యందున్నపుడు ఆ పరబ్రహ్మమే "ప్రకృతి" నామము చెందెను అని స్పష్ట పడుచున్నది. కనుక పురుష ప్రకృతులు రెండు భిన్నములు కావు. ఒకదాని యందొకటి ఓతప్రోతమై (అనగా వస్త్రమందలి పడుగు పేకలవలె నున్నవి) యీ విధంగా పర్యాలోచిస్తే సత్వరజస్తమో గుణములు మూడున్నూ ఏవో పాళ్ళలో చిజ్జడాత్మకమగు సమస్తమునందూ యూంటూనే వున్నవి.

పురుషులలో త్రిగుణములు లేవా? త్రిగుణములు వుంటే పురుషునిలో ప్రకృతి "స్త్రీ" యున్నట్లే. పురుషుని యొక్క స్వప్రకాశ చేతనము స్త్రీ యందు లేదా? కనుక పురుషుని యందు స్త్రీ, స్త్రీ యందు పురుషుడూ వున్నప్పుడు స్త్రీని హీనంగా చూచినచో పురుషుడు తన్నుతాను హీనంగా చూచుకొన్నవాడే అగుచున్నాడు.

స్త్రీ పురుష లిర్వురు ఏకమై ఒకటిగా కూడినపుడే సృష్టి సమర్థత కలుగుచున్నవి. స్త్రీ లేని పురుష జీవితమూ, పురుషుడు లేని స్త్రీ జీవితమూ నిరర్థకములు, నిస్సారములు. స్త్రీ పురుష లిర్వురు ఒక బటానీ గింజలోని రెండు బద్దలు వలె సృష్టింపబడినట్లు శ్రుతి తనలోని సగం శరీరము స్త్రీ రూపమై చెలువొందగా అర్థనారీశ్వరుడని పేరొందిన శంకరుడే పూర్ణ పురుషుడు.

స్త్రీ పురుష బేధము స్థూల శరీరముల యందు మాత్రమేనని తెలిసికొంటిమి. ఈ శరీర నిర్మాణ భేదమువల్ల ఎంత వరకు స్త్రీల స్థూల శరీర క్రియలయందు అసమర్థత ఏర్పడు చున్నదో అంతవరకు మాత్రమే ఆమెకధికారము లేదనదగును. శరీరబల మావశ్యకమైన గుఱ్ఱపు స్వారి, కత్తిసాము, ధనుర్విద్య మొదలగు వానియందు గూడ ప్రావీణ్యత సంపాదించిన స్త్రీలు లేకపోలేదు. వేదకాలము నుండి అట్టి వారుంటూనేవున్నారు. విశ్వల (లేక విస్పల) అనునామె భర్తతోపాటు యుద్ధమునకేగి కాలుతెగిపోగా యినుపకాలతికించు కొనెనట. ముద్గలానియను నామె రథసారథ్యము నందుకుశలత్వము గలది. త్రేతాయుగమున కైకేయి దశరథునికి రథసారథ్యమున సహాయము జేసిన వృత్తాంతమందరూ చదివినదే. ద్వాపరమున సత్యభామ సుభద్ర మొదలగువారు రణకుశలులైయుండిరి. ఈ కలియుగమున రాణి సంయుక్త,

రుద్రమదేవి, ఝాన్సీ లక్ష్మీభాయ్ మొదలగు వీర వనితల పేర్లెరుగని వారెవరు? నేడు శరీర వ్యాయామముచేసి సర్కసులందు బల ప్రదర్శనము చేయు స్త్రీలున్ను, పోలీసు శాఖలలోనూ యన్.సి.సి. యందునూ శిక్షణ పొందువారు సైనికులుగా పనిచేయు వారునూ, ఎంతో మంది గలరు. కనుక శరీర నిర్మాణమునందలి వ్యత్యాసములు సహితం స్త్రీలకు ప్రతిబంధకములుగా లేవు అని అనవలసి వస్తూవున్నది. ఈ దృష్టితో చూస్తే స్త్రీల నబలలని పేరెట్టుటకూడ అంత సమంజసముగాదేమో ననిపిస్తుంది.

ఇక ఏ విషయమందునూ స్త్రీకి అసమర్థత, అనర్హత యున్నదనుటకు ఎమీ సావుకాశం లేదు. సర్వవిద్యలు, సమస్త శాస్త్రములు, సంగీత, సాహిత్య చిత్రలేఖనాది లలితకళల యందునూ, స్త్రీలకు సమానాధికారముగలదు. లలితకళలయందు విశేషాధికారమే కలదని కూడా అనవచ్చును. కనుకనే కవి "ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్" అనవలసివచ్చింది.

స్త్రీలకు వేదాధికారం వున్నదా? ఉపనయన సంస్కారముంటే వేదాధికారమున్నూ వుంటుంది. "పురాకల్పేకుమారీణాం, మౌంజీబంధనమిష్యతే! అధ్యాపనంచ వేదానాం సావిత్రీ వచనంతథా॥" (హారీతస్మృతి) దీనిని బట్టి, మౌంజీ బంధనముతో గూడినవుపనయన సంస్కారముండెననిన్ని వేదములు వార్కి నేర్పబడెడివనన్ని స్పష్టమౌతూంది. క్రమేపీ, వేదాధ్యయనం చేయించుటపోయి (యిప్పటి పెండ్లికొడుకులకు, ముందుగా, నామకః వుపనయనం జరిగించినట్లుగానే) కన్యలకు తొలుత నామకః వుపనయనం చేసి వివాహం జరిగించెడివారు. సద్యో వధువులని అట్టివారిని పిలిచెడివారు. "సద్యోవధూనాంతు యుపస్థితే వివాహే కదాచిత్ వుపనయనం కృత్వా వివాహ కార్యతః" గృహ్య సూత్రములలోనూ, స్మృతి చంద్రిక నిర్ణయసింధు మొదలగు ధర్మశాస్త్రములలోనూ యీ వైదికాచారం పేర్కొనబడినది. కుంతీ దేవికి వుపనయనం జరిగినట్టు మహాభారతంలో కలదు. పార్శీ వారిలో (జొరాస్ట్రియను మతస్తులు) యిప్పట్కీ కన్యలకు వుపనయనం జరిగించు ఆచారమున్నది. వుపనయన సంస్కారం పొందిన బాలికలు, బాలురతోపాటు గురుకులమునందు చేరి వేదాధ్యయనం చేసేవారు.

ఋగ్వేదకాలములో కొందరు స్త్రీలు సంహితాభాగములను సంధానించిరి. ఘోసా లోపముద్ర, సూర్య మొదలగు వారు ఋగ్వేదంలోని కొన్ని ఋక్కులకు కర్తలే అయివుండిరి. వాక్కు అనునామె బ్రహ్మవాదినులలో మొదటిది. ఆమె వ్రాసిన ఋక్కులు అద్వైత సిద్ధాంతమును సమర్థించుచున్నవి. ఈరచయిత్రులకు ఋషీకలని పేరు. గార్గిమైత్రేయ మొదలగువారు బ్రహ్మవాదినులై యున్నట్లు, పండిత సభలలో వాదించినట్లు వుపనిషత్తులవల్ల తెలియుచున్నది. సులభ, చూడాల మొదలగు విదుషీమణులు ఎందరెందరి పేర్లో పురాణాదుల నుండి పేర్కొనవచ్చును.

ఈ యుగమందుకూడా విద్వాంసులై, భిక్షుకులై, బౌద్ధమతం ప్రచారం చేసిన స్త్రీలెందరోకలరు. అశోకునికుమార్తె సంఘమిత్ర సింహళంలో బౌద్ధమతం ప్రచారం చేసెను. శంకరాచార్యులవారి కాలంలో మండన మిశ్రుని భార్య వుభయ భారతి గొప్ప విద్వాంసురాలు.

17వ శతాబ్దంలో మీరాబాయ్ అనుమహాభక్తురాలుగోస్వామి మహారాజ్‌తో వాదించి గెలిచెను. ఈ శతాబ్దంలో బ్రహ్మవేత్తగా రామకృష్ణ పరమహంస భార్య శారదాదేవి ప్రసిద్ధిగాంచినది. ఆత్మ యోగ పరాయణతకు. పాపులు, స్త్రీలు, వైశ్యులు. శూద్రులు అను భేదమేమీలేదని భగవద్గీత రాజవిద్యా రాజగుహ్య యోగమునందు చెప్పబడినది. కనుక స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారము లేదను వాదము బుద్ధిమంతులెవరున్నూ అంగీకరించజాలరు.

రాజకీయము, సాంఘికములనగు అనేక కారణములచే స్త్రీకి విద్యయే పనికిరాదను పిడివాదము చేయు దౌర్భాగ్యము దాపురించి కొంతకాలము వీరవిహారము చేసినది. ఇటీవల స్త్రీ విద్య తిరిగి వ్యాపకము పొందుచున్నది. పురుషులతోపాటు స్త్రీలకున్నూ అన్ని అవకాశములు ఏర్పడియున్నవి. కనుక స్త్రీలు లౌకిక విద్యలందు మాత్రమేకాక ఆధ్యాత్మిక విద్యయందు సహితం పూర్వపు ఔన్నత్యముగాంచి ధన్యులు కావలనని ప్రతి భారత స్త్రీయునూ గుర్తించి కృషి చేయవలసి యున్నది.

# మాతృశ్రీ

మాతృ శబ్దము మహా పవిత్రమైనది. "అమ్మా" యని పిలుచటలో యెంత మాధుర్య మున్నది! "అమ్మా అమ్మా" యని యెంత హాయిగా పిలిచేదే" అని బిడ్డపిలుపు తలుచుకొని తలచుకొని తల్లియెంత మురిసిపోతుందో! మాతా శిశు సంబంధమే యట్టిది. శరీరములో శరీరము, రక్తములో రక్తము, ప్రాణములో ప్రాణము కనుక తల్లికిట్టి మమతా వాత్సల్యము లుండుటలో ఆశ్చర్యమున్నూ లేదు. ఇక బిడ్డకు తల్లిపైన గల ప్రేమయో? ఇది ప్రేమ మాత్రమే గాదు. భయభక్తి పూరితమగు నొక దివ్యానురాగం. అది అనిర్వచనీయం. ఊహాతీతం. పరమ పవిత్రం. దానికి సాటిదదేగాని అన్యముగాదు. తండ్రి కంటే గూడ తల్లియే ప్రత్యక్షదైవము. నవమాసములు మోసి జీవన్మరణ సమస్యలో తన్ను ప్రసవించి, తన సౌఖ్యమును గూద త్యాగము చేసి పెంచి పెద్దచేసిన త్యాగమూర్తి మాతృశ్రీ. "అమ్మా" యని, పిలచిన నీవిక అమ్మా! యని మరెవ్వరిని పిలువనక్కరలేదు. ఇదిగో అనన్య ప్రతిభావంతమగు మానవ శరీరమును నీకిస్తు న్నాను. దీనితో నీ జన్మ రాహిత్యమును సాధించుకొమ్మని, ఈ కర్మ శరీరమును నాకు ప్రసాదించిన పరమ కారుణ్యమూర్తి నా మాతృశ్రీ. జోహారు తల్లీ! నీకివే నా శత సహస్ర ప్రణామములు.

కాని నా నిజమగు మాతృ స్థానమేది? ఈ మానవోపాధితో ఏ మాతృ గర్భమునుండి వెలువడి ఈ లోకంలో తొలిసారిగా కన్ను దెరచి వెలుగు జూచితినో, ఆమెయేనా, నా మాతృశ్రీ? తండ్రి శుక్లము తల్లి గర్భమున మొలకెత్తవలెగదా? కనుక తల్లికంటే తండ్రి యొక్క శుక్లమే పూర్వ కారణము. దానికాతడు భుజించిన అన్నము, దానికి ఓషధులు, దానికి పృధ్వి, దానికి జలాగ్ని, వాయ్వాకాశ ఆత్మస్వరూపములే వరుసగా పూర్వ పూర్వ కారణములై యుంటున్నాయి. అందు ఆత్మయే అత్యంత మూలకారణముగానున్నది. అయితే నవమాసములు మోసి కనిపెంచిన ఈ మానవ కాంతయందు యెందుకింత భక్తియంటే, ఈ అమ్మయే మొదట్లో నున్న "అమ్మలగన్నయ్యమ్మ" గదా! ఈమెయే పరాప్రకృతి.

ఐతే స్థూల శరీరమునకు మాతృస్థానం తెలుసుకొన్నాము. మరి "నేన"ంటే నాస్థూల దేహము మాత్రమేనా? నా సంకల్ప, వికల్పములు, నా ఆశలు, ఆశయములు, శోకమోహములు, యిచ్ఛాద్వేష ప్రయత్నాదులు, యింకనూ యనంతములగు మనో సంస్కారములు గలదై, జీవేంద్రియ ప్రాణములతో గూడినదై జనన మరణాదులు జెందుచున్న నాలింగ శరీరమునకు మూలకారణము లేక మాతృశ్రీ యేది?

రస, రుధిర, మేదో, మాంస, అస్థి, రేతస్సులు వుత్త రోత్రా సూక్ష్మాతి సూక్ష్మములై యున్నవి; కాని మనస్సు వానికంటె నికంనూ సూక్ష్మముగా నున్నది. ఐతే సుషుప్తి యందువలెనే గర్భస్థ శిశువునందు గల మనస్సుతో ప్రాణమునకు గలయిక లేకపోవుట వలన తెలివి హీనమైయున్నది. 5 లగాయితు 7 మాసముల వయస్సు గర్భస్థ పిండమునకు వచ్చు సరికి, తల్లి బిడ్డలనేకము చేయు నాభీనాళము వికాసము చెంది తద్వారా తల్లిబీల్చు ప్రాణవాయువు బిడ్డలో ప్రసారమై బిడ్డమనస్సుతో సంయోగపడి శిశువునకు ప్రజ్ఞకలుగుచున్నది. కనుక లింగ శరీరమునకు లేక జీవునికి గూడా ఆత్మయే మాతృస్థానము లేక పరమ కారణమైయున్నది. మరియు ఆత్మ నుంచి బ్రహ్మాండోత్పత్తియు, బ్రహ్మాండమునుండి పిండాండోత్పత్తియునగు చున్నవి. పిండాండోపాధియగు జీవునికి బ్రహ్మాండోపాధియగు ఈశ్వరుడే మాతృస్థానము. కనుకనే "కార్యోపాధిగతోజీవః కారణోపాధీశ్వరః" అని చెప్పబడినది. ఈశ్వరుడు అనగా సగుణ రూపమగు బ్రహ్మమే.....

కనుక ప్రకృతి పురుషరూపంగాయున్న బ్రహ్మము (లేక ఆత్మ) యందు నా స్థూల శరీరమునకు ప్రకృతియున్నూ నా యందున్న జీవత్వమునకు పురుషుడున్నూ మాతృ భూతులుగా నున్నారు. కనుకనే "జీవోబ్రహ్మైవానాపరః" అని అద్వైతము బోధించుచున్నది. అధిష్ఠానచేతన బ్రహ్మమేనేను.

అదియే భూతయోని అదియే మహద్యోని. నేనే ఆ యోని స్వరూపుడను. నన్ను నేనే సృజించుకొనుచున్నాను. నాకు నేనే మూలము నాకు వేరే మూలంలేదు. నన్ను రమ్మను వారూ లేరు. పొమ్మన్నవారూ లేరు. నాకు వేరే మూలము లేక యోని స్వరూపమగునది మరొకటిలేదు. నేను అయోని సంభవుడను గాని యోని సంభవుడను గానేగాను.

ఐనను ఈ విషయమారూఢమగు వరకు నా "మాతృశ్రీ" అయిన ఆ అధిష్ఠాన చేతన బ్రహ్మము యొక్క సగుణ స్వరూపము నాకారాధ్యదైవమే. అదియే నాగురు స్వరూపము. అది ద్వయ స్వరూపంగా శివశక్త్యాత్మకముగానున్నది. అదియే గురుపద ద్వంద్వము.

**శ్లో॥ వందే గురుపద ద్వంద్వం వాఙ్మనోతీత గోచరం**
**శ్వేత రక్తప్రభాభిన్నం శివశక్త్యాత్మకం పరం॥ గురుగీత**

నా గురుదేవులు శ్రీ దయానంద రాజయోగీంద్రులవారిని "మాతృశ్రీ" శ్రీమతి అనసూయాంబికా దేవిని, రూపుదాల్చిన శివశక్తులుగా నేనుపాసింతును.

శ్లో॥ త్వంపితా, త్వంచమే మాతాత్వం బంధు స్త్వంచదేవతా
సంసారప్రీతి భంగాయ తస్మైశ్రీ గురవే నమః॥

# సహధర్మచారిణి

సహధర్మచారిణి యనగా, భార్యయని రూఢ్యర్థము. సహ యనగా తనతోగూడ (లేక తనతోకలసి) ధర్మ=ధర్మము నందు చారిణి = చరించునది (లేక నడుచునది). భార్య యనగా భరింపబడునది. కాని భరింపబడుచూ (పోషింపబడి) కోరికలను దీర్చు ప్రతి స్త్రీ పురుషునికి భార్యయని యనదగునా? ఆమె వుంపుడుకత్తె లేక, కులట, యగునే కాని భార్య యను పవిత్ర నామమున కర్హురాలు కాజాలదు. వివాహతంతు జరిగినప్పటకి, పర పురుషుని చేరక వివాహమాడిన భర్తతో మాత్రమే సంసారము చేయుచుండినను ఆమె ధర్మపత్నీ శబ్దమునకు అర్హురాలు కాదు. ధర్మ శబ్దమునకు చాల విశేషార్థము కలదు. సత్యము, శౌచము, దయ, దానము అను నాల్గు పాదములు గల్గి, సంసారము నందలి మేలునకును, మోక్షమునకును కారణమై వేదవిహితముగా నుండెడి కర్మ విశేషము మాత్రమే ధర్మమనదగును. పత్ని అనగా అగ్ని సాక్షిగా పెండ్లాడిన స్త్రీ. కనుక దర్మపత్ని యనగా, అగ్నిసాక్షిగా పెండ్లాడబడి, తన ధార్మిక జీవితమునందు సంపూర్ణముగా సహకరించుచూ, యిహపర సౌఖ్యములకు తానుచేయు సకల కార్యములందు తోడ్పడు స్త్రీయే ధర్మపత్ని. కనుకనే పురుషుడు "ధర్మపత్నీ సమేతస్య" అని సంకల్పించి "బ్రహ్మకర్మ సమారభేత్" అని బ్రహ్మార్పణంగా బ్రహ్మసంబంధమగు సకల కర్మలను చేయుచున్నాడు. అతని ధర్మపత్ని యా కర్మలయందు భర్తతో సర్వవిధముల త్రికరణశుద్ధిగా సహకరించినపుడు, భర్తచేయు కర్మలయొక్క పుణ్యఫలములయందు భాగస్వామిని కాగలుగుచున్నది. భర్తచేయు కర్మయందలి పాపఫలములు ఆమెనే మ్రాతమునంటవు. అట్టి పాపకర్మలతో ఆమె సహకరించవలసిన పనిలేదు. ఏలననగా ఆమె సహధర్మచారిణియే కాని, సహ, యధర్మచారిణికాదు. కనుక భర్త అధర్మాచరణ వలన కల్గు పాపఫలము లామెనంటజాలవు. ఆమె పరిశుద్ధాంతఃకరణము నందు ధర్మాచరణ చేసినపుణ్య సంస్కారములంటునేగాని, ఆమె తలపోయని భర్తయొక్క పాపకర్మాచరణ తలంపు లెట్టి సంస్కారమును వుత్పత్తి చేయజాలవు. భర్తచేయు ధర్మాచరణవలన కల్గు పుణ్య ఫలములలో ఆవిధముగా భాగస్వామిని అగుటయేగాక తాను స్వయంగా చేసుకొను పుణ్యకర్మాచరణ వలన కల్గు పుణ్యఫలము గూడా పొంది ధర్మపత్ని విశేషపుణ్యవతియై ధన్యజీవి యగుచున్నది. అట్టి భార్యయే పతివ్రత లేక సతీ సత్యస్వరూపిణి యనదగును. సతి యన్నను, సహధర్మణీయన్నను సహగమనమని అర్థములున్ననూ, సహధర్మచారిణియను పదమునకు ఆ అర్థములు చెప్పరాదు. భర్తతో సంసారము చేయుటలో ఎట్టి లోపములున్నా భర్త మరణించినపుడాయనతో సహగమనము (ఆయన మృతకళేబరముతో పాటు చితినెక్కి దగ్ధమగుట) చేస్తే మోక్షప్రాప్తి కల్గుననుకొనుట కేవలం మూఢనమ్మకము మాత్రమే యని తెలియదగును.

ధర్మపత్ని యెట్లుండవలెను? అను ప్రశ్నకు సర్వులకు (అనగా ప్రాపంచికులకు, పారమార్థికులకూ, కూడా) అన్వయించు విధానమును పెద్దలెట్లు నిర్ణయించిరో తెలుసుకొందము.

1. భర్త విధించు కార్యములను. దాసి(కూలిది) యెట్లు నెరవేర్చునో అట్లు భార్య నిర్వర్తించ

వలెను. ఐతే భార్య కేవలం కూలిదాని వంటిదా? భార్యకు భర్తకూ సమాన హక్కులుండ వలదా? అని వాదించరాదు. తనకు త్రికరణశుద్ధిగా సేవచేయు భార్యయందు భర్త కెంతటి ప్రేమానురాగాలు వర్ధిల్లునో చెప్పనలవికాదు. ఆమె ఋణమెట్లు తీర్చుకొందునా అని భర్త పరితపించుచుండును. భార్య కెట్టి రోగము వచ్చినా భర్త ఆమె సేవచేయుటకు వెనుదీయడు. నిత్యజీవితములో సహితం భార్య కార్యములను భర్తయెన్ని నిర్వర్తించుట లేదు?

2. కర్తవ్యమును నిర్ణయించలేక భర్త సందిగ్ధావస్థలో నున్నపుడు, మంత్రి రాజునకు తగు సలహాలిచ్చు రీతిగా భర్తకు భార్య సలహాలిచ్చుచుండవలెను. అన్నిటికన్న సులభమైనపని ఏమంటే అన్యులకు సలహాలిచ్చుట అన్నారు. అట్లుగాక పూర్వాపరములను బాగుగా యోచించి ధర్మయుతమగు మంచి సలహా మాత్రమే భార్య యీ యదగును.
3. తన శరీరమును భర్తకు అనుగుణ్యమైన రీతిగా లక్ష్మీదేవివలె చక్కగా నలంకరించుకొన వలెను. భార్య సౌందర్యమును ఆస్వాదించి ఆనందించునది భర్తయే. కదా! లోకుల పొకడలను, ఫ్యాషను లను గ్రుడ్డిగా అనుకరించరాదు. భర్త నిద్రలేచేసరికి తన అలంకరణను సంపూర్తిగావించుకొని కళకళలాడుచూ అపుడే వికసించిన పద్మమువలె భర్తకు భార్య నేత్రపర్వము గావించవలెను.
4. భర్త తనపైన విసుగుకొన్నను, కసురుకొన్నను, మందలించినను భూదేవివలె యోర్పుగలిగి యుండవలెను. మాటకు ప్రతి మాట చెప్పుట వలన భర్త ఆగ్రహమినుమడించునేగాని శాంతించదని గ్రహించవలెను.
5. బిడ్డను తల్లి యెట్లు బుజ్జగించి, కొసరికొసరి వడ్డించి ఆదరాభిమానములతో ఆకలి తీర్చి సంతృప్తి పరచునో అట్లే భార్య భర్తకు స్వయంగా వడ్డించి తీపి మాటలతో, తినిపించవలెను. వంట వారినిగాని యితరులనుగాని వడ్డనకు పురమాయించరాదు. అత్తగారైనా వడ్డించవలె. లేదా తానైన వడ్డించవలె. యితరులను దరిచేరనీయరాదు.
6. పడకగదిలో రంభవలెనుండి భర్తకు సంపూర్ణానంద మీయవలెను. రంభవేశ్య. వేశ్య (ప్రేమలేనప్పటికి) శృంగార హావభావములను ప్రదర్శించి విటుని హృదయమును ఆకర్షించును. కాని భార్యకట్టి నటన అవసరములేదు. కనుక పడకగదిలో భర్తనానందింప చేయుటకు భార్య సర్వవిధముల ప్రయత్నించవలెను. భర్తకానంద జనకమగు అలంకరణయే చేసుకోవలెను. కృత్రిమములగు వేషాడంబరములకు ప్రయత్నింపరాదు. భర్త మనసుపడిన అలంకరణమే గావించుకొనవలెను. భర్త సంతృప్తియే తన సంతృప్తి. ఆయన ఆనందమే తన ఆనందము.

పైన చెప్పబడిన ఆరు లక్షణములు, కులపతి యెరిగి ప్రవర్తింపవలెనని పెద్దలు,

శ్లో॥ కార్యేషు దాసీ, కరణేసు మంత్రీ
రూపేచ లక్ష్మీ, క్షమయా ధరిత్రీ.
భోజేషు మాతా, శయనేషు రంభా, షట్కర్మయుక్తా కుల ధర్మపత్ని

అనే శ్లోకములో సెలవిచ్చినారు. యీ లక్షణముగా భార్య ప్రవర్తించినచో భర్త అనురాగమును పూర్తిగా చూరగొని యిహమునందు సర్వసుఖములు సంపాదించుకొనగల్గుననుటలో యెట్టి సందేహములేదు.

సాధారణముగా స్త్రీలు ఐహిక సుఖములకై ప్రాకులాడుచుందురు. అందుకు అవసరమగు ద్రవ్యమును సమకూర్చగల భర్తనేవారు ప్రేమించుచుందురు. ద్రవ్యమీయజాలని భర్తను వారు చులకనచేతురు. భర్తయందలి ప్రేమను సహితము చంపుకొను చుందురు. కనుక వారు నిజముగా ప్రేమించునది భర్తనా? లేక భర్తయొక్క ద్రవ్యమునా? ద్రవ్యమునే యనవలెగదా! ఇక అమెకును, వెలయాలికి గల బేధమేమి? ఇక ధనమునకై శరీరమును అమ్ముకొను వేశ్యకున్ను ఆమెకున్ను తారతమ్యమేమి? ఆమెను ధర్మపత్ని యనదగునా? వేశ్య విటుని ధనమును హరించి దరిద్రుని చేసి పిమ్మట విసర్జించును. కులసతి యట్లుగాదు. భర్త ఐశ్వర్యమే తన ఐశ్వర్యము. అతని దరిద్రమే తన దరిద్రము. తన్నగ్ని సాక్షిగా వివాహమాడి, లాలించి ప్రేమించి చేతనైనంతలో సర్వ సౌఖ్యములను తనకు చేకూర్చుచు, తన శరీరములో శరీరముగా ప్రాణంలో ప్రాణంగా కాపాడువాడు గదా భర్త! అతడే పతి (లేక పాలించువాడు) ప్రభువు. తన యావజ్జీవమూ సర్వ సౌఖ్యములు తనకొసగు దాత. తన వలన సత్సంతానమును గాంచి వంశాభివృద్ధి గావించుకొని పితృఋణము తీర్చుకొనగోరు పుణ్యపురుషుడు. జనక కుటుంబమునుండి అన్య కుటుంబములోనికి దత్తత పోయిన బాలునివలె, ఏనాడు బాలిక వరునికి కన్యాదానము చేయబడినదో, నాటితో అత్తవారి సొత్తు అయిపోయినది. భర్తకు సర్వ విధముల అంకితమైపోయినది. నాటినుండి పుట్టింటి వారందరు, ఇతర బంధువర్గముతో సమానమైపోయిరి. భర్త కుటంబమునకే ఆమె చెందిపోయినది. తనతో సంబంధించినంత వరకు పుట్టింటి ఇంటిపేరు గోత్రము మాసిపోయినవి. అత్తవారింటిపేరు గోత్రము సంక్రమించినది. భర్తకుటుంబమే తన కుటుంబము భర్త ఆస్తియే తన ఆస్తి, తానూ, తన ఆస్తి, ఉద్యోగమూ, ఆదాయమూ సర్వస్వమూ భర్తకొరకే. భర్త శరీరములో తాను సగభాగమైపోయినది. హైందవ వివాహబంధమంతటి పవిత్రమైనది. జీవాత్మ పరమాత్మల సంబంధము వంటిది. శాశ్వతమైనది. ఛేదింపరానిది. యిట్టి ధర్మమును భార్యా భర్తలిద్దరూ ఆజన్మాంతము వైవాహిక జీవితము ధర్మపద్ధతిన నడుపుకొనవలసియున్నది. భక్తునకు భగవంతునికి గల దివ్య ప్రేమానుబంధమెట్టిదో భార్యాభర్తల ప్రేమానుబంధమట్టి మధుర భక్తిసంయుతమై అలరార వలసియున్నది. కనుకనే యొక కవి,

మ॥ ధనమున్ గల్గి సమస్త సంపదలతో దన్సంగ నున్నట్టినా
ధుని పూజించుట గొప్పగాదెపుడు రిక్తుండైన ప్రాణేశు పా
వన పాదాబ్జములన్ భజించుటకు సర్వంబర్పణన్ జేయు కా
మినియే, లోకమునందు కీర్తిగనుమ్మా బాలికారత్నమా॥

యీ విధముగా నడచుకొనుట సామాన్య స్త్రీ ధర్మమై యున్నది. ఈ సామాన్య ధర్మము ననుసరించిన స్త్రీ యిహలోకమునందు కీర్తి ప్రతిష్ఠలతో సర్వ సౌఖ్యము లనుభవించగలదనుటలో

యెట్టి సందియములేదు. భర్త దరిద్రుడైనచో తనకైహిక సుఖమెట్లు లభించునని శంకింపనవసరములేదు. శాంతి సుఖము వంటి సుఖమేదియు లేదు గదా!

పారమార్థిక సుఖము (ఆముష్మిక సుఖము) నాసించు స్త్రీలు యింకనూ విశేష ధర్మములను పాలించవలసి యుండును. భర్త యనుసరించు ధర్మమే భార్యకును ధర్మమై అవశ్యా చరణీయమై యున్నది. భర్త పాలించుచుండు ధర్మములను భర్తతోపాటు తానున్ను ఆచరించుచూ సర్వవిధముల సహకరించుచూ స్త్రీ నడచుకొన్నపుడే ఆమె సహధర్మచారిణి యగును. సత్యము, శౌచము, దయ, దానము అనునవి ధర్మమునకు నాల్గుపాదములు. పారమార్థికులందరూ వీనిని పాలించుట తప్పదు. "సత్యంవద" సత్యమును పల్కుము అని అర్థము. ప్రియమైన సత్యమునే బల్కుచూ వినువార్కి అప్రియమైన సత్యమును పలుకక మిన్నకుండుము అని దీనిని వివరించినారు. "ధర్మంచర" అనగా ధర్మమును నిర్వహించుము. "ధర్మోరక్షతి రక్షితః" ధర్మమును పాలించినచో నిన్ను ధర్మమే రక్షించును. ధర్మమును పాలింపనిచో నిన్నదియే శిక్షించును అన్నమాట. స్త్రీ పాలించవలసిన ధర్మమేది. భర్త ధర్మమే తన ధర్మము. భర్త కేది యధర్మమో అది తనకున్ను అదర్మమే. భర్త కేది విహిత కర్మయో అది తనకున్నూ విహితమే. భర్త కేది నిషిద్ధమో అది తనకును నిషిద్ధమే, చేయరానిదే యగును.

పారమార్థిక సౌఖ్య మాసించు భర్తకు విద్యుక్త ధర్మము లేవియో ముందుగా తెలిసికొందుము. "మాతృదేవోభవ" పితృదేవోభవ, ఆచార్య దేవోభవ, అతిథిదేవోభవ అని తైత్తిరీయోపనిషత్తు గృహస్తు ధర్మమును యుద్ఘాటించుచున్నది. మంచి నడవడిక గల్గి సత్కర్మలను మాత్రమే చేయుచు, దుష్కర్మలను, దుష్ప్రవర్తనములను విసర్జించుమనుచున్నది. గురువులను శాస్త్రమును గౌరవించుచూ అప్రమత్తుడవై, దేవ, పితృ కార్యములను శ్రద్ధగా నిర్వహించుమని, దానము చేయుపట్ల భయభక్తి వినయము కల్గి యుండుమనీ హెచ్చరించుచున్నది. ఈ ధర్మ నిర్వహణలో భర్తకు భార్య సహకరించినపుడే ఆమె సహ ధర్మచారిణి కాగలదు. భర్తయొక్క తల్లిదండ్రులు, గురువు. అతిథి అభ్యాగతులు, భర్తకు దైవము వలె పూజింపదగిన వారైనపుడు, వారు తనకున్ను పూజనీయులు. కనుకనే పురుషుడు తల్లిదండ్రులకు నిత్యమూ నమస్కరించవలెనని, స్త్రీ నిత్యమూముందుగా భర్తకూ పిదప అత్తమామలకు నమస్కరించుచుండవలెనని పెద్దలు విధించినారు. దైవసములై పూజనీయులైన తల్లిదండ్రులను భర్త పోషించవలె. భక్తిశ్రద్ధలతో సేవించుచూ వుండవలెనని వేరే చెప్పనవసరం లేదు. అది భర్తయొక్క విద్యుక్త ధర్మము. కనుక సహధర్మచారినియగు భార్యకూడ భర్తతోపాటు వారిని భక్తిశ్రద్ధలతో సేవించుట విధాయక ధర్మము.

ఇక జన్మరాహిత్యముగోరి పరిపూర్ణ గురువుల నాశ్రయించి కృషి చేయువారి దృక్పధమేదియో యించుక విమర్శింతము. గురుసేవ, గురుభక్తి, గురునిష్ట కల్గి వీరు త్రికరణ శుద్ధిగా గురుకృపా సంసిద్ధిగోరి గురూపాసన గావింతురు. ఏతత్ఫలితంగా వార్కి స్వస్వరూప సాక్షాత్కారము లభించును. గురుపరమాత్మ స్వరూపము ఏతద్భిన్నముకాదని ఆబ్రహ్మాస్థంభ పర్యంతము ఆ గురు పరమాత్మయేనని వారు గుర్తించి అందుకు తగినట్లు వారు ఆచరణగల్గి

ప్రవర్తింతురు. పతి భక్తి యెక్కువా? లేక గురుభక్తి యెక్కువా? అని లోకులు ప్రశ్నించుచుందురు. కాని సర్వము గురు స్వరూపమేయని ఆత్మదృష్టిగల్గి ప్రవర్తించు గురుపుత్రునికి యీ ప్రశ్న పేలవముగా తోచును. గురు భక్తురాలు తన భర్తను మరింత భక్తిశ్రద్ధలతో నారాధించగల్గును. ఏలననగా భర్తయందు యఖండ గురుస్వరూపమునే ఆమె దర్శింపగల్గుటచే ఆమె పతిభక్తి ద్విగుణీకృతమగును. పూజనీయులగు అత్తమామలు మరింత పూజనీయులు అగుదురనుట నిస్సందేహము. గురు స్వరూపమునందు తనతో సహ సర్వమును, ఆ సర్వమునందా గురు స్వరూపమునూ ఆమె గుర్తించుచునే యుండును. అట్టి గురు భక్తురాలిని సహ ధర్మచారిణిగా బడసిన పురుషుడు ధన్యుడు. భార్యాభర్తలిరువురూ అట్టి గురు భక్తులేయైనచో అంతకన్న కాంక్షింపదగినదేమి? జనన మరణ రూప ఘోర సంసార వారాశిని వారవలీలగా తరింపగలరు.

# గురుస్సాక్షాత్ పరబ్రహ్మ

"గురు" అను మాటకు పెద్ద లేక గొప్ప అని అర్థము. ఆత్మకంటె పెద్దదికాని గొప్పదికాని మరొకటిలేదు. అదే భూమాపదార్థం బ్రహ్మస్వరూపం.

గురువు అను శబ్దమునకు తనకేదైన విద్య నేర్పినవాడు అని మనం మరియొక అర్థం చెప్పుకొంటున్నాము. గురు అను మాటకువున్న నిజార్థము మామూలు విద్యనేర్పిన వానికెట్లు అన్వయించుట సంభవించినది? అట్లే విద్య నేర్పినవాడు అనే అర్థము బ్రహ్మమునకెట్లు వర్తించుచున్నది? బ్రహ్మమును గురించిన విద్య బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యను తెలిపిన వాడున్నూ గురువే అగుచున్నాడు. మొట్టమొదటిగా అట్టి బ్రహ్మ విద్యను బోధించిన గురువెవరు? అతడు మాత్రము తన రాకకు పూర్వమే వుండియున్న ఆ బ్రహ్మమును గూర్చి యెట్లు తెలిసికొనగల్గెను అని అంటే ఆ బ్రహ్మమే తన్ను గురించి తానే తెలియపర్చుకొంటేనే అది సాధ్యమగుననవలెను. జీవేశ్వర జగద్రూపంగా తన్ను తాను ప్రకటపర్చుకొనుటయే తెలియపరుచుట. స్వయంప్రకాశ రూపుడగు తాను తన ప్రకాశాంశమును విశేషముగా యిచ్చుట రీత్యా తన్ను తెలుసుకొను శక్తిని బ్రహ్మమే మానవుల కనుగ్రహించెను. కనుక బ్రహ్మమే మొట్టమొదటి బ్రహ్మవిద్యా గురువైయున్నాడు. కనుక ఆ రెండర్థములలోను గూడా బ్రహ్మమే గురుస్వరూపమై యున్నాడు.

ఇక మానవోపాధి యందున్న గురువుకూడా "గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" యనీ, "గురురేకం పరబ్రహ్మ" అని కీర్తింప బడుటకు కారణమేమి?

1. "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" అను శ్రుతి పల్కుచున్నది. అనగా బ్రహ్మమును తెలుసుకొన్న వాడు బ్రహ్మమే అగుచున్నాడని అర్థము. అంటే ముందెప్పుడో బ్రహ్మముగా మారుటకాదు. బ్రహ్మమును తెలుసుకొను సమకాలమునందే బ్రహ్మమగుచున్నాడు. ఎట్లనగా ఏది తెలియవలెనన్నను మనస్సు తద్రూపం వహించవలసియే వుంటుంది. కనుక బ్రహ్మమును తెలుసుకొనునపుడు తన చిత్తము కేవలం బ్రహ్మరూపము వహించక తప్పదు. అపుడు తాను బ్రహ్మమైనట్లే గదా!
2. నీకు మూలము ఎవరు? అని యెవరడిగినా, నాతల్లిదండ్రులే నాకు మూలము అని

తోచును. కొంచెం లోతుగా విచారిస్తే నా తల్లిదండ్రులు నాకు మూలంకాదు. వారు భుజించిన అన్నమే శుక్ల శోణిత రూపమైనా స్థూలోత్పత్తికి హేతువైనట్లున్ను, ఆ అన్నమునకు యీ పృధివి, పృధివికి జలము, దానికి అగ్ని, దానికి వాయువు, దానికి ఆకాశము, దానికి ఆత్మ కారణములుగా నున్నట్లున్ను కానవస్తూ వున్నది. కనుక ఆత్మయే అన్నిటితోపాటు నాకున్ను మూలకారణముగానున్నది అని గ్రహించిన వాడే అయోనిసంభవుడని చెప్పనగును. తల్లిదండ్రులే తనకు మూలం అనుకొన్న వారిని యోనిసంభవులనే అనాలి. కనుక నాకు కారణము ఆత్మ లేక బ్రహ్మయే, నాతో సహా యీ జీవేశ్వర జగత్తంతయు దానికార్యరూపమే కార్య కారణ రూపంగా సమస్తమూ బ్రహ్మ స్వరూపమే అని గుర్తెరిగిన అనుభవజ్ఞుడగు గురువు బ్రహ్మ స్వరూపంగాక అన్యమెట్లగును? కనుక ఏ విధంగా చూచినా బ్రహ్మమే గురువు, గురువే బ్రహ్మము అగుచున్నాడు. కనుకనే గురుస్సాక్షాత్ పరబ్రహ్మ అన్నారు.

# శిష్య లక్షణము

శిక్షణ (ట్రైనింగు) పొందువాడు శిష్యుడు. కొన్ని నియమములను పాటించి, ఏ విద్యనైననూ నేర్చుకొనవలసి యుండును. అనుభవంతో నిమిత్తంలేకుండా కేవలం వాచాజ్ఞానమార్జించుటకు నిజంగా నియమములతో పనిలేదు. అనుభవజ్ఞానము కోరువానికి మాత్రం, క్రమశిక్షణతో గూడిన నియమ ప్రవర్తనము కావలసియుండును. కనుక శిక్షణ అన్నపుడు క్రియారూపంగా చేయుపనులు అందు యిమిడి యున్నవన్నమాట. మానవుడు చేయు క్రియలు, 1) కాయికములు. 2) వాచికములు. 3) మానసికములు అని మూడు విధములు. కనుక శిక్షణ అనుటలో శరీర, వాక్, మనస్సు (త్రికరణములు) లను నియమబద్ధముచేయు సాధనా విశేషములు కొన్ని యిమిడియుండునని గ్రహించవలెను. కనుక గురువు విధించిన శిక్షణాను సారం వర్తించుటకును, వర్తించక యుల్లంఘించినచో అందుకు గురువు విధించే శిక్ష ననుభవించుటకును అంగీకరించినవాడే శిష్యుడనదగును. కనుక శిష్య శబ్దమునకు "క్రమశిక్షణతో గురు సన్నిధానమున, శ్రద్ధా, భయభక్తులతో, అనుభవరూపంగా, విద్యనార్జించుటకు వచ్చినవాడే" నని యొక నిర్వచనము చెప్పవచ్చును. ఏవిద్యనైననూ సాంగోపాంగముగ నభ్యసించగోరువాడు, తన ప్రవర్తనచే గురువును మెప్పించి, ఆయన ఆదరాభిమానములు సంపాదించిగల్గినపుడే, ఆ విద్యలోని మర్మధర్మములు సాకల్యముగ శిష్యునికి బోధించి తనయంతటి వానిగా చేయగలడు.

శిష్యశబ్దము స్త్రీ పురుషు లిర్వురకును వర్తించును. గురువును సేవించి బ్రహ్మవిద్య పొందుటకు ప్రత్యేకార్హతలేమియు శిష్యునకుండవలసిన పనిలేదు. మానవుడై పుట్టిన చాలును. కాని,1) "మదిలో నామాటనమ్మిమరివింటివేని" అనిన్ని 2) చంచలబుద్ధి మానుంటివేని" అనిన్ని గురువు విధించిన రెండు ప్రధాన షరతులకు శిష్యుడు లోబడియుండవలెను. బ్రహ్మ విద్యకుగాని పరిపూర్ణ బోధకుగాని అధికార లక్షణములు శిష్యునియందు లేనిచో, గురువు శరణాగతి చేసిన, తన శిష్యుని ముందుగా అధికారిగా తయారుచేసియే అతని ఆశయమునకు తగిన బోధ

నాతని కతుకం జేయగలడు.

బ్రహ్మవిద్య లేక పరిపూర్ణ బోధ విషయంలో యీ గురుశిష్య సంబంధమగు శ్రద్ధాభయభక్తులు పరాకాష్ఠ చెందక తప్పదు. ఏ పరమాత్మ జ్ఞానమును తాను వస్తు నిశ్చయ రూపముగా తెలుసుకొనవలెనో, ఆ పరమాత్మ శిష్యుని యొక్క భావనలో తన గురువుకంటె నన్యముగాదు. ఆ పరమాత్మయే గురురూపమున తన్నుద్ధరించ వచ్చినాడు. "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" బ్రహ్మమును తెలుసుకొన్నాడు. గనుక గురువా బ్రహ్మ స్వరూపుడే. కనుక శిష్యుని కర్చామూర్తి తన గురువే. కనుకనే అట్టి గురువును అర్చించుటలో శిష్యుడు "నరులిష్టదైవములకున్ పరిచర్య యొనర్చునట్లు" అనిన్ని.

కం॥ పతిభక్తిగల యువతివలె, సతతముగురు భక్తి గల్గి సచ్ఛిష్యుడిలన్॥

స్తితి గుదుర సేవచేయును, ప్రతి రహితాద్భుత చరిత్ర పరమపవిత్రా॥ అనిన్ని శ్రీకృష్ణ దేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు.

కనుక బ్రహ్మవిద్యా విషయకమగు గురుశిష్య న్యాయము సాటిలేనిది. మహోత్కృష్టమైనది. గురువు సాక్షాత్తు పరబ్రహ్మమే. శిష్యుడు, గురూపాసనే ప్రప్రథమ కర్తవ్యముగా భావించిన పరమభక్తుడు. వారిరువురి మధ్యగల ప్రేమ, పితాపుత్ర (లేక మాతాశిశు) సంబంధమగు దివ్య ప్రేమ. కనుకనే

కం॥ తన సంతతిపైగల దయ, తన శిష్యుని మీద నుంచదగు గురుడెపుడున్। తన ధనము, మనస్సు తనువును, తన గురునివటంచు దలచదగు శిష్యునకున్॥ అని శ్రీకృష్ణ దేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. శిష్యుడు , తను మనధనములు గురునివని, తలపో యువలె నన్నారు. అనగా మమకారము వదలి, సర్వాత్మార్పణ బుద్ధిబూని, గురుని సేవించవలెనని అర్థమేగాని, తన సర్వస్వము గురుని పరము చేసి తాను ఫకీరు కావలెనని అర్థంకాదు. తన పుత్రుడు పురోభివృద్ధి గాంచవలెనని తండ్రి యెంత ఆరాటపడునో, శిష్యుడాధ్యాత్మికాభివృద్ధి గాంచవలెనని గురువున్ను ఆరాటపడునన్నమాట. అంతేకాదు "పుత్రమిచ్ఛేత్ పరాజయం" ఎవరిచేతిలోను ఓడింపబడుటకు ఎవరున్ను యిచ్ఛయింపరు. కాని, తన కుమారుడు తన్ను జయింపవలెనని, అనగా, తనను మించినవాడు కావలెనని, ప్రతి తండ్రి ఆశించి కోరుకొనుచుండును. అట్లే తన శిష్యుడు తన్నుమించి, గురువును మించిన శిష్యుడు కావలెననియే సద్గురు వెల్లప్పుడును ఆశించుచుండును.

కం॥ గురుశిష్యుల లక్షణములు
గురుశిష్యుల బోధరీతి గురుగీతార్థం
బెరిగిన నరునకె మెప్పగు యెరుగని
యా మూఢ నరున కిష్టతయౌనే॥

గురుగీతార్థం బెరిగినగాని నిజగురు శిష్యుల లక్షణములు తెలియబడవు అని శ్రీకృష్ణదేశికేంద్రుల వాక్యము. కనుక

శ్లో॥ గురుర్దేవో, గురుర్ధర్మో గురుర్నిష్ఠా పరంతపః।
గురోః పరతరం నాస్తి త్రివారం కథయామితే॥

గురువే దైవము, ధర్మము, నిష్ఠ, అతీతమగు తపస్సు, గురువుకంటె అన్యమేమిలేదు అని శిష్యుడు గురునియందు అనన్య భక్తిగల్గి యుండవలెను. అంతేగాదు. గురుని గొప్పదనము నభివర్ణించుపట్ల గురుగీత ఎట్లు చెప్పుచున్నదో చూడుడు.

శ్లో॥ గురునామ సమం దైవం, నపితా నచబాంధవాః
గురునామసమం, స్వామిన్నేదృశం పరమం పదం"

అనగా దైవము, తండ్రి, బంధువులు, ప్రభువు చివరకు పరిపూర్ణ పరబ్రహ్మము. యివేమీ కూడా గురునామమునకు సమానం కాజాలవు అని యుద్ఘాటించుచున్నది.

కనుక గురువునకు శిష్యుడు

శ్లో॥ గురుమూర్తింస్మరేన్నిత్యం గురుర్నామ సదాజపేత్.
గురురాజ్ఞాం ప్రకుర్వీత, గురోరన్యం నభావయేత్॥

అనగా ఎల్లప్పుడు గురురూపమును ధ్యానించుకొంటూ గురునామమును జపించుకొంటూ గురుని యాజ్ఞను పాలించుకొంటూ గురువునకన్యంగా ఏమైన నున్నదని భావించక అనగా సర్వము గురు స్వరూపంగానే జీవయాత్ర సాగించవలెనని గురుగీత విధించు చున్నది. వేయేల! గురుగీతయందలి ప్రతిశ్లోకమును గురుప్రభావమును శిష్యధర్మమును వుద్ఘాటించుచున్నది.

"గురోరంఘ్రిం పద్మే మనశ్చేన్నలగ్నం. తతః కిం, తతఃకిం, తతఃకిం, తతఃకిం అని గుర్వష్టకములలో, గురుపాదములయందు మనస్సు లగ్నత కాని వానికి లక్ష్మైశ్వర్యము లెన్నియున్న అన్నీ నిరర్ధకములే, నిష్ప్రయోజనములే అని చెప్పబడియున్నది. కాని గురుపాదముల యందు మనోలగ్నత యెట్లు సిద్ధించగలదు? గురుతత్వముయొక్క రెండు రూపములే గురుపాదములు అని గుర్తించి ఆ లక్ష్యముతో తన గురువుయొక్క పాదపద్మములను త్రికరణములచే నర్చించుచుండవలెను. శరీరముచే పూజాదికము, వాక్కుచే స్తోత్రాదికము, మనస్సుచే గురుతత్వాను సంధానము చేయుచుండుటయే త్రికరణములచే గురువునర్చించుట అని తెలియదగును. అందుకే గురుగీత "కర్మణా మనసా వాచా సర్వధా రాధయేద్గురుం" అని శాసించుచున్నది. ఈ విధంగా గురువు నారాధించినపుడే శిష్యుడు బాహ్యభక్తి సోపానమును దాటి అనన్యభక్తి లక్షణమును సాధించగలుగు చున్నాడు. కందార్ధములలో గురుభక్తి యందు బాహ్యభక్తి అనన్యభక్తి, ఏకాంతభక్తి అను త్రివిధ రూపములు ఏవిధంగా నిర్ణయింపబడినవో గమనించదగును. బాహ్యభక్తి విషయములో 1) "గురుశుశ్రూషనొనర్చుట. నెరిగించెద నెట్లనిన యేర్పడవినుమీ, నరులిష్టదైవములకున్ పరిచర్య యొనర్చునట్లు ++" అనిన్ని (2) నాలుగు శుశ్రూషణములు లోలత గావించుకొనుచు అనిన్ని చెప్పబడినది. 3. ప్రొద్దున నిద్దుర మేల్కొని వద్దికియే తెంచి గురుని వక్త్రజనితమౌ సుద్దులు మ్రొక్కి వినుము అనిన్ని చెప్పబడినది. ఇందు మొదటి కందార్ధము గురుమూర్తి యొక్క అర్చన విధానము విధించినది. రెండవ కందార్ధములో

"స్థాన, ఆత్మ అంగ భావశ్రూషణములు లోలతగావించుకొను" మని శిష్యుని హెచ్చరించుచున్నది. ఈ నాలుగు శుశ్రూషలు నీ లబ్ధి కొరకేగాని గురునకు యిందేమీ లబ్ధిలేదు సుమా అని యిందలి గావించుకొనుచు అను శబ్దము సూచించుచున్నది. గురుస్థానమునకేపోయి బోధవినవలె 2) గురువుయొక్క అంతఃకరణను సంతోషపరిచే సత్ప్రవర్తన నీకుండవలె 3) శరీర వాంగ్మనస్సుల సంయమనము గల్గియుండవలె 4) నీ ఆశయసిద్ధికై గురుడెట్టి భావమును నీకు బోధించెనో ఆ భావమునకు విరుద్ధముగాని తీరుననడువవలె అని యీ నాలుగున్ను నాలుగు శుశ్రూషలుగా తెలియవలెను. పై 3వ కందార్థములో గురుబోధను శిష్యుడేరీతిగా గ్రహించవలెనో తెలియచేయబడినది. కనుక శిష్యలక్షణము 1) అర్చన 2) వర్తన 3) బోధ అను మూడు విధ ములలో యెట్లుండవలెనో యీ కందార్థములలో తెలుపబడినది. అనన్యభక్తి సోపానమందు శిష్యుడెట్లుండునంటే,

కం॥ జలము నెడబాయనొల్లని జలచరముల

రీవిబూని సచ్ఛిష్యుడు హృజ్జలజంబను

పీఠముపై నిలపి యితరముమాని గురువునే

కొల్చుసుమ్మీ తదుక్తులనే తలచునమ్మీ,

కలకాల మీ ప్రొద్దు గడపుచు

తల్లిదండ్రి దొర దాత దైవమనుచు

గురువునే కొల్చుసుమ్మీ!

తదుక్తులనే దలచునమ్మీ॥

ఈ కందార్థమందలి అర్థమును లోతుగా విచారించవలెను. చేప నీటిని యెందుకు విడచియుండజాలదు? బయటికి తీసి, అది తినే ఆహారమును తినిపించి బ్రతికించరాదా? అంటే, అది సాధ్యంకాదు. పృథివి యందలి గంధ తన్మాత్ర బీజోత్పత్తి కెట్లుఅవసరమో అట్లే జలసూక్ష్మాంశమగు ప్రాణము. పోషణాకార్యమందు శక్తివంతమై యున్నది. కనుక జలము యొక్క ఆవరణము జలచరముయొక్క విహారమున కవకాశమీయగా, దానియందలి రసతన్మాత దాని ప్రాణ వికాసమునకు ముఖ్యావసరమై యున్నది. కనుక అది, జలము నెడబాయనొల్లదు. అంతేగాదు, జలమునందుంటేనే అది త్రుళ్ళిత్రుళ్ళిగంతులు వేసియెగురుతూ స్వేచ్ఛగా రీవితో బ్రతుకగలదు. అట్లే సత్శిష్యుని అంతః కరణమనే జలచరము, గురుతత్వమనే మహా జలరాశి యందునికి గలిగి యున్నపుడే, ఆ అంతఃకరణము మహా స్తిమితము కలిగి యెట్టి భయభ్రాంతులూ, ఆందోళనలు లేక, ఆనందోత్సాహములతో, శాంతి సుఖములతో విరాజిల్లగలుగును. ఇదే రాజయోగి రీవి.

సగుణపరంగా అర్థము చెప్పునపుడు, గురువుయొక్క నామరూపముల నుండి మనస్సును యితరత్రా చెదరనీయక యుపాసించుటే అనన్య భక్తి. ఈ కందార్థమందలి "యితరము మాని" అను మాటలున్ను, "ఏ సాధనలజోలి యే నొల్లనని నీవు బాసజేసితివేని" అను మాటలున్ను, కేవలం అనన్య భక్తిసాధననే సూచించును. కనుక ఇట్టి యనన్య

భక్తియుక్తుడైన సత్శిష్యుడే పరిపూర్ణ బోధకు పూర్ణాధికారియని చెప్పనొప్పును.

దీనిని సాధించుటయెట్లు? కందార్థము :-"దేశికుని చరణతీర్థము కాశీగంగయని, గురుని కనుగొన్నను విశ్వేశ్వరుడని, యతడు తన కుపదేశంబొనరించినట్టిదే తారకమనీ, మన సందు తానీతీరునగనీ! యే సీమయందున్న, కాశీ, ప్రయాగ, రామేశునిపురమై ప్రకాశించు నాసీమదే తారకమనీ! మన సందున తానీ తీరునగనీ" అనిన్ని, మరియు

కం॥ గురుచరణ జలము గోదావరియని, గురుమూర్తి రామ భద్రుండని,

తత్పురమును భద్రాచలమని, గురుమంత్రమె తారకమని గురిగల్గి" మానసిక తపసాచరించినచో యిట్టి అనన్యభక్తి చేకూరును. అట్టిగురి గలిగినపుడే తిరిగిరాని మరుగు యెరుగునట్టి శక్తి చేకూరును. అట్టి మరుగు దెలిసిన మహాత్ముడున్న చోటె "సుందర శేషగిరి, భద్రగిరి, రంగనాయకపుర మనదగియుండు" ననిన్ని శ్రీకృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చిన్నారు.

గురుతత్వముయొక్క స్వరూపమే అఖండ యెరుక. అట్టి గురుస్వరూపముతో ఏకభావన చెందియుండుటే, యే కాంత భక్తి. అదియే భక్తి సాధనయందలి పరాకాష్ఠ. యిదే అద్వైత సిద్ధికూడా. యేకాంత భక్తి సాధించిన పుణ్యపురుషుడే యెరుకను విడచుటకు సమర్థుడు. "గురుడచలచలములను తనకెరిగించిన, శిష్యుడెరిగి యెరుకైయుండన్ ఎరుకను నిల్పకుమని నను ఎరుకను **విడనాడి XXX** " అంటూ చెప్పబడినది, అనగా యెరుకై యున్నవాడే, యెరుకను పూనగలడు, లేక మానగలడు. అట్టి అపరోక్షజ్ఞానము లేనివాడు (అనగా యెరుక వస్తునిశ్చయ మెరుగనివాడు) దేనిని విడవవలెనో, కూడా తెలియక, సూచన నాడే యెరుక పోయినదని గ్రుడ్డిగా నమ్మి, ఆత్మవంచన చేసుకొన్న వాడగుచున్నాడు.

కనుక, సచ్ఛిష్యుడైనవాడు గురువునందిట్టి అఖండ భక్తి లక్షణమును ముందుగా సాధించుకొనవలసియున్నది. అంతేగాని "యే సాధన నీ కెందుకు పీసానికి పనికిరాదు" అని చదువుకొని సంతుష్టిపడి వూరుకునేవారు వుభయ భ్రష్టత్వము చెందుదురనుటలో సందేహము లేదు.

గురుసూచననాడే మాకు "ద్వాద శాంతమైనది" యింకా గురూపాసన ఏమిటి? అని ప్రశ్నిస్తూ, అంతటితో ఆగక కందార్థమును కూడా తమవాదన కనుకూలముగా అర్థమిచ్చులాగున సవరణచేసిన వారున్నారు. ఎట్లనగా:-"పరిపూర్ణబోధ తెలిపే పరియంతము సేవజేసి, బహు నమ్మికగా. తరువాతను గురుమూర్తిని, మరి కన్నుల **గననివాని** మార్గము ఛీఛీ! తలచరాదా మార్గము ఛీఛీఛీ X X X " అని వుంటే "గనని" అనే మాటను "గనిన" అని దిద్ది, పరిపూర్ణబోధ తెలుసుకొన్న తరువాత, గురువును కళ్లతో చూస్తే మహాపాపమని అర్థము చెప్పిన ప్రబుద్ధులు కూడా వున్నారు.

సూచన పొందిన రోజుననే యెరుక పోయిందని విశ్వసించుట ఎంతటి యనర్థములకు దారితీసినదో, తీయుచున్నదో చూస్తే, ఆ అంధ విశ్వాసమును ఆయా సాంప్రదాయకులు ఎంత త్వరగా విడిస్తే అంత త్వరగా వారికి వారే మేలుచేసుకొన్న వారగుదురు. ఏలననగా అట్టి అంధ **విశ్వాసముతో "పాపములు, పుణ్యములు,** భువి ప్రాప్తించును. **యెరుకచేత భ్రమసివివారివ్.**

ప్రాప్తింప నెరుక నెడసిన తాపసులను చిత్తమందు దగ దెలుసుకొనుమీ X X X" అను కందార్థమును ముందరబెట్టుకొని "మాకు సూచనతోనే యెరుక పోయెను. గనుక మేము ఎరుక విడచిన తాపసులమే. కనుక పాపపుణ్యములు మాకు ప్రాప్తించవు" అని యధేచ్ఛా విహారము సలుపు మెట్ట వేదాంతులుగా తయారు కాగలరు. అట్టివారు యెట్టి పాపకర్మ చేయుటకును వెనుకాడక నరకమునకు రాజబాట నేర్పాటు చేసుకొంటున్నారు.

గుఱ్ఱము నెక్కుటకొక రికాబులో కాలుపెట్టి గుఱ్ఱము ఎక్కే లోపలనే అష్టవక్రముని (యాజ్ఞవల్కి అని కొందరంటారు) జనకునికి పరబ్రహ్మ సూచన చేసెనా లేదా? అని కొందరడుగవచ్చును. కాని నేడు సూచన పొందుచున్న వారందరు జనకునివంటి పూర్ణాధికారు లేనా? యోచించవలెను. కనుక గురూపాసన, సత్కర్మానుష్టానము అనునవి సాధకునికి ఆదినుంచి అంత్యమువరకు "నిదురవచ్చినదనుక, నీవు చచ్చినదనుక" ముఖ్యావసరమని గుర్తించవలెను.

మేము గురువులము కదా! సాధకులైన శిష్యుల కేమో కాని మేము సర్వాతీతులము మాకింకనూ గురూపాసనా? అని ఆత్మవంచన చేసుకొనే గురువులు వుండవచ్చును. మార్గదర్శియై, తానాచరించి, తన శిష్యులచే నాచరింపచేసినవాడే నిజమగు ఆచార్యుడు. "యద్య దాచరతి శ్రేష్ఠః తత్త దేవేతరే జనాః" అంటూంది భగవద్గీత. "యదా గురుస్తథాశిష్యః" అనే న్యాయంగా శిష్యుడు గురువు ననుసరించుట సహజము. తానే, పాపకార్యములాచరిస్తే తన్నాశ్రయించిన భక్తులు చెడిపోక నుందురా? తమ శిష్యుల శ్రేయస్సుకోరి అయిననూ గురువులు సత్పథమున నడచుట తప్పదు. "మణి యేన వలయం, వలయేన మణిః" మణిచే కంకణమును, కంకణముచే మణియున్ను ప్రకాశించునట్లుగా, గురువుచే శిష్యునకు, శిష్యునిచే గురువునకును, ఇర్వురిచే పీఠ సాంప్రదాయకమునకును సత్కీర్తి రావలెను.

గురుగీతా ధర్మమును, తు.చ. తప్పకుండా ఆచరణ యందుంచుటకు త్రికరణశుద్ధిగా ప్రయత్నించువాడే గురుపుత్రుడనజెల్లును. లేనిచో నతడు గురుశత్రువే అగును. కనుక గురుగీతయందు చెప్పబడిన విధినిషేధములను చక్కగా గమనించి తదనుగుణ్యముగా ప్రవర్తించిన వాడే గురుకృపాపాత్రుడై కృతకృత్యుడు కాగలడు.

# చతుర్విధ శుశ్రూషలు

శుశ్రూష యనగా శిష్యుడు గురువునకు చేయు సేవారూపమైన ఉపచారాదికమని సామాన్యార్థము. గురుడు నరుడనే భావనలో మాత్రమే యీ అర్థమన్వయించగలదు, కాని గురుడు నరుడుకాడు. పరుడు, అనే భావములో యీ అర్థము సమన్వయంకాదు. శరీరధారియగు గురువు నిర్గుణ పరబ్రహ్మమేగాని అన్యము కాదనుటయే యుత్తమ భావము. కనుక గురుని నామరూపములకు పూజచేయుటయేగాక శిష్యుడు అంతరంగమున పరాపూజ చేయుచుండవలెను. విశ్వ గతమును, విశ్వాతీతమును అగు పరమాత్మయే గురుతత్వము కదా! అట్టి గురుని కుపచారము లొనర్చుటయనగానేమి? తన ఆత్మస్వరూపమునకు తానే

సేవచేసుకొనుటయేగదా? అందుకే "నాలుగు శుశ్రూషణములు లోలతగావించుకొనుచుXXX" అను కందార్థములో, "గావించు కొనుచు" అనగా తనకు తానే చేసుకొనుచు, అను అర్థమును, శ్రీకృష్ణ దేశికేంద్రులు స్ఫురింపజేసినారు. ఈ అర్థములోనే చతుర్విధ శుశ్రూషల కర్థమును వివరించి చెప్పుట న్యాయమును అవసరమున్ను అయివున్నది. అట్లుగాక స్వార్థగురువులు బాహ్యరూపముగ ఏవేవో అర్థములు జెప్పి శిష్యహృత్తాపహారులగుటకు బదులు విత్తాపహారులై గురుధర్మము నెడల ప్రజానీకమునకు ఏవగింపు గలిగించునట్లు ప్రవర్తింపచేయుట చాలా శోచనీయము.

# 1. ఆత్మశుశ్రూష :

తన ఆత్మ పవిత్రతకు అనుగుణమైన నడక ఏదియో అదియే ఆత్మశుశ్రూష. "మనః ప్రాణావాచా సంఘాతం సత్తా" అనగా మనస్సు, ప్రాణము, వాక్కు అను యీ మూటి సమిష్టియే సత్పదార్థమగు ఆత్మ. సప్తాన్నములలో యీమనః ప్రాణవాక్కులే ఆత్మకు ఆహారముగా చెప్పబడినవి. కనుక ఆత్మకు పరిశుద్ధ ఆహారం లభ్యంకావలెనంటే, తన మనస్సు, ప్రాణము అనగా శరీరము, వాక్కు యీ మూడునూ పవిత్రముగా నుండులాగున జాగ్రత్త వహించి నడువవలెను. అపుడు శిష్యుడు పవిత్రాంతఃకరుణుడై గురుబోధయందు కేవలం మనోనిశ్చయము మాత్రమే గాక ఆత్మ నిశ్చయం పొందగలడు. విషయమునందెట్టి సందేహం లేకుండా అవగాహనమగుట మనోనిశ్చయము. ఇది గురు వాక్యమును శ్రద్ధగా శ్రవణంచేసి మననము చేయుటవలన సిద్ధించును. శ్రవణమననాదులచే మనస్సునకు దృఢమైన విషయమునందు మనస్సును ఏకాగ్రతచేసి నిధి ధ్యాసచేయుట వలన సిద్ధించిన అనుభవరూప మైన వస్తుసాక్షాత్కారమే ఆత్మనిశ్చయము. కనుక కాయిక, వాచిక, మానసికములయందు శుద్ధ ప్రవర్తన గల్గినపుడే వాని యంతఃకరణము పవిత్రమై ఆత్మనిశ్చయముకల్గును. ఇదే ఆత్మశుశ్రూష.

మరొకవిధంగా చూచినచో, తన గురువుగారి ఆత్మను సంతుష్టిపరచి ఆనందింప జేయడం ఆత్మశుశ్రూష. ధనకనక వస్తు వాహనాదులచే నిజగురు వెన్నడు సంప్రీతుడుగాడు. అట్లు సంప్రీతుడగుట కుక్క లక్షణము. కొంచెము బెల్లపు ముక్క పెట్టినచో తోకయాడించి యాకుక్క వెంటపడును. అట్టి నీచలక్షణము నిజగురువున కుండజాలదు. కనుకనే "కుక్కకున్న గుణము గురువునకు లేదయా, విశ్వదాభిరామ వినురవేమ" అన్నారు వేమన్నగారు. కేవలం శిష్యుని ప్రవర్తనచే సంతుష్టుడైనపుడే గురువున కానందము కల్గును. శుద్ధ ప్రవర్తన కల్గిన యీ శిష్యునికెంత త్వరగా సర్వరహస్యములు బోధించి భ్రాంతిరహితుని చేతునా అని గురుని యంతఃకరణయందా వేదన గల్గునట్లుగా శిష్యుడు ప్రవర్తించుటే ఆత్మశుశ్రూష.

# 2. స్థాన శుశ్రూష :

గురువు నివసించే గృహారామములను రక్షించుట, పరిశుద్ధంగానుంచుట, అలంకారము చేయుట, యిత్యాదులు మాత్రమే స్థానశుశ్రూషయని పలువురభిప్రాయపడుట

శోచనీయము. తానుపదేశించి ప్రబోధించు బ్రహ్మవిద్య కెట్టి ప్రతిఫల మాసించినను అతడు సద్గురువు కానేరడు. తన గృహారామములకు సేవ చేసినంత మాత్రాన యా శిష్యుని తన ప్రత్యేక ప్రేమాభిమానాలకు పాత్రుడైనవానిగా గురువు తలంచునా?

ఐతే స్థాన శుశ్రూష యనగా నిజాభిప్రాయమేమి? తన గురువెట్టి పేద కుటీరములో, యెట్టి పరిసరములలో నివసించుచుండినను, సకల భోగ భాగ్యములతో ఎంతో సుఖముగ నివసించుటకు తానలవాటు పడినవాడుగా నుండినను, గురుస్థానమున తానెన్నో యిక్కట్లు పడవలసి వుంటూ వున్నను, శిష్యుడు గురుస్థానమునందే యుండి గురు సేవాధికమునందు శ్రద్ధకల్గి ప్రబోధ బడయుచుండుటయే స్థాన శుశ్రూష యగును.

శ్లో॥ కాశీక్షేత్రం నివాసశ్చ, జాహ్నవీ చరణోదకం.

గురుర్విశ్వేశ్వర సాక్షాత్, తారకం బ్రహ్మనిశ్చియం॥

తాత్పర్యము : గురు నివాసస్థానము కాశీ, గురుపాదోదకమే కాశీగంగ, గురువే కాశీవిశ్వనాధుడు అని గురుగీత. ఈ భావమే. కందా:- దేశికుని చరణతీర్థము కాశీగంగయని, గురునిగనుగొన్నను విశ్వేశుడని యతడు తన కుపదేశించి నట్టిదే తారకమనీ, - మనసందు తానీతీరునగనీ, యేసీమ యందున్న కాశీ, ప్రయాగ, రామేశుని పురమై, ప్రకాశించు నాసీమ. **XXX** కందా:- గురుచరణ జలము గోదావరియని, గురుమూర్తి రామభద్రుండని, తత్పురమును భద్రాచలమని, గురు మంత్రమే తారకమనీ...**XXX**" అనుకందార్థములలో విపులపర్చబడినది. కనుకనే గురుస్థాన మత్యుత్తమమగు మహాపుణ్యక్షేత్రముగా భావించవలెను.

కావచ్చును. కాని గురువును తనయింటికే రప్పించుకొని ఏలబోధ వినరాదు? విచారింతము. "పాపము, గురువుగా రాయింట్లో యెట్లు కాపురం చేయుచున్నారోగదా! నాయింట నాకుండే సుఖము లేమిన్ని ఆయనకు లేకపోయనే! నాయింటనైతే వారికి సకల సౌఖ్యములు సమకూర్చి, తగు విశ్రాంతి నిచ్చి, వారివల్ల ప్రబోధ పొందవచ్చుగదా! అందుచే గురువుగారినే నా యింటికి ఎందుకు రప్పించుకొనరాదు?" అట్లా అనుకొనుటలో తన అంతఃకరణమునందు నిగూఢంగా యెంత అహంకార దర్పములు అణగి మణిగి యున్నవో వూహించదగును. మరిన్ని "కౌపీనవంతఃఖలు భాగ్యవంతః" అనగా త్యాగికున్న సుఖము విషయలంపటుడైన భోగికుండజాలదు అను సత్యమును తాను విస్మరించినాడన్నమాట. అంతేగాక, గురువుగారిని తన యింట్కి రప్పించుకొన్నచో, "తన కోరికను మన్నించకుండా వుండలేనంతటి ప్రియశిష్యు డీతడు గురువుగార్కి అని అందరూ తన్ను కీర్తించరా?" అను అహంకారము లోలోపల తిష్టవేసుకొని యుందన్న మాట. మరియు గురువుగారు తన యింటికే వచ్చినచో తనకెట్టి బాధయుండదుగదా! తనకున్న పనులా చెడిపోవు. తనకు ప్రియతములైన భార్యా బిడ్డలను వదలిపెట్టి పోవలసిన అవసరములేదు. బాగానేవున్నది. కాని మరి గురువుగారి పనులు, వారి కుటుంబ నిర్వహణాది బాధ్యతల మాటయేమి? తానాలోచించవద్దా? ఎంత స్వార్థము? పైగా తానంతటి అధికుడు కనుకనే, గురువుగారే పనులు మానుకొని, తనకై త్యాగం చేసి, వచ్చేరని తన అహంకారమును పెంచుకొనుచున్నాడు.

అట్లని, గురువును ఇంటికి తీసుకొని రారాదు. వారిని సేవించి సత్కరించి బోధ వినరాదు అని ఎవరునూ అపార్థము చేసుకొనరాదు. స్థానశుశ్రూష లేనందువలన, ఆ శిష్యునికి కలుగు ఫలప్రాప్తి అంతకంతగానే యుండును. అందుకు శ్రీరామచంద్రునియొక్కయు, శ్రీకృష్ణుని యొక్కయు గురు శుశ్రూషా విధానములయందుగల తారతమ్యమును గమనించిన చాలును.

శ్రీరామచంద్రుడు యోగవాశిష్ఠమును తన గురువైన వశిష్ఠుల వారికడ యేవిధంగా శ్రవణం చేసెను? తన కొలువు కూటమునకే వశిష్ఠుల వారిని రప్పించుకొని, వున్న తాసన మందు ఆయనను ఆసీనుని జేసినా, తానుమాత్రం సింహాసనమును దిగక బ్రహ్మవిద్యాశ్రవణం గావించెను. అందువలన శ్రీరామునికి సిద్ధించిన ఫలమంత మాత్రముగానే యుండెను. వశిష్ఠులవారి ప్రబోధచే శ్రీరామచంద్రుడ స్పర్శ యోగమును (అశరీర పద్ధతి) సాధించలేకపోయెను. జీవితమంతయు దుఃఖమయంగానే గడచిపోయెను. మరి శ్రీకృష్ణుడో? అట్లుగాదు. అతడున్ను చక్రవర్తి హోదాలోని వాడైననూ, నిరాడంబరముగ పాదచారియై ఘోరారణ్య మధ్యమున నివసించు సాందీపనీ యాశ్రమమున యెండు కట్టెలు కొట్టి తెచ్చి గురుమాత కర్పించుచూ నిరహంకారుడై సర్వ సౌఖ్యముల నుజ్జగించి, "సన్యస్యశ్రవణం కుర్యాత్" అనునట్లుగా సాందీపునియొద్ద పరిపూర్ణ బోధ సాకల్యముగా నెరిగి రాజయోగ శీవితో పూర్ణపురుషుడై విరాజిల్లెను. అందుకే సాందీపుడే గురువు, శ్రీకృష్ణుడే శిష్యుడు అన్నారు.

దేవాలయమునకేగి తన యిష్టదైవము నారాధించుటకును, ఆ యిష్టదైవమును తన యింటియందే వుంచుకొని అర్చించుటకును ఎంత వ్యత్యాసమున్నది? అనేక మంది భక్తాగ్ర గణ్యుల సంకీర్తనాదులచే ఆ దేవస్థాన వాతావరణము పవిత్రీభూతమైనది. అట్లే గురుగృహమున్నూ అని గుర్తించవలెను. గురుస్థానమందున్న కాలములో తనకు గల వ్యవహారాది బాధ్యతలన్నియు విస్మరించి, ఏకైక లక్ష్యముతో ప్రశాంతముగ గురుబోధ గ్రహించుటకున్ను సావకాశము చిక్కగలదు. గురువుగారు తనయింట వేంచేసియున్నపుడు, వారికి వారి పరివారమునకు యెట్టి లోపంరాకుండా శిష్యుడేర్పాట్లు చేయుచుండుటతోనే సరిపోవును. గురువుగారింటికే తానేగుచో, "యోగక్షేమం వహామ్యహం" అని అభయ మిచ్చిన గురుదేవుడే తనకొరకై శ్రద్ధవహించవలసి యుండును.

గురువు యింటనేనావుండాలి. వెంటనైనా వుండాలి అని ఆర్యోక్తి. తన యింటనే గురువుగారుండాలి. లేదా తన వెంటనైనా గురువుగారుండాలి అని అర్థం చెప్పుకొనవచ్చునా? గురువుగారి యింటగాని, గురువుగారి వెంటగాని తానే వుండాలి అని మాత్రమే అర్థము. అట్లుండి సక్రమంగా సేవించి బోధ పొందుటయే స్థాన శుశ్రూష.

## 3. అంగశుశ్రూష:

శుశ్రూషలన్నియు శిష్యుని పారమార్థిక కృషికీ అభివృద్ధికీ తోడ్పడేవై యున్నవి. గురువు గారి స్వార్థ ప్రయోజనములకూ గురువుగారి లబ్ధికీ వుద్దేశింపబడినవి గావనిన్ని యిది వరకే చెప్పబడినవి. ఈ దృష్టితోనే అంగ శుశ్రూషయొక్క నిజాభిప్రాయమును తెలిసికొనవలసి యున్నది

అంగములనగా అవయవములనియు, భాగములనియు అర్థము. గురువుగారి శరీరావయములకు అనగా కాళ్ళు, చేతులు, నడుము వగైరాలు పట్టుట అభ్యంగనాది క్రియలు చేయించుట, మొదలగు కార్యక్రమములే అంగశుశ్రూష అని పలువురి అభిప్రాయము. అది సరిగాదు, అందువల్ల శిష్యుని అహంకార దర్పములు రహితముకాగలవు గనుక, స్వామి భృత్యన్యాయముగా అట్టి సేవ చేయవలసినదే గాని అది అంగశుశ్రూషకు నిజార్థముకాదు.

నిజమగు అర్థములో అంగములనగా భాగములని గ్రహించుటయే యుక్తము. దేని భాగములు? తనయందలి భాగములు. లేక గురుస్వరూపమునందలి భాగములు. తన యందలి భాగములేవి? (1) ప్రత్యక్షముగా గానవచ్చు స్థూల శరీరము లేక అన్నమయకోశము (2) అవస్థాంతరములకున్ను జన్మాంతరములకున్ను, ప్రయాణముచేయు సూక్ష్మశరీరము. ఐతే సూక్ష్మ శరీరమునందు ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములున్నవి. ప్రాణమయ కోశములో కర్మేంద్రియము లైదు, ప్రాణములైదు మొత్తము పదింటిలోను వాగింద్రియము వ్యవహార రూపకమైన ముఖ్యంగముగా నున్నది. మనోమయ విజ్ఞానమయ కోశములలో మనస్సు జ్ఞానేంద్రియములతో చేరి సర్వమును గుర్తించి కల్పించుచూ "తానే బుద్ధిరూపము జెందుచూ వ్యవహరించుచున్నందున మనస్సు మరియొక ప్రధానాంగమైయున్నది. కనుక తనయందు స్థూల శరీరము, వాక్కు, మనస్సు అను మూడున్ను ప్రధానాంగములై యున్నవి. తన యందున్న మిగతా యింద్రియములన్నియు వానిలో అంతర్భూతమగునవే అయి వున్నవి.

ఇక గురు స్వరూపము (లేక పరమాత్మ స్వరూపము) నందు గల అంగము లేమి? అంటే శ్రుతి "ఆత్మాఉ ఏకస్సన్ ఏతత్రయం అనగా ఏకరూపమైన సత్పదార్థమగు ఆత్మ మూడు విధములుగా నున్నదనియు, శ్రుతి : "మనః,ప్రాణ, వాచా సంఘాతం సత్తా" అనగా సత్తనగా మనఃప్రాణ వాక్కులుగా నున్నదనియు పై రెండు శ్రుతులు చెప్పుచున్నవి గనుక అంత్యస్థానము నందు మనఃప్రాణ వాక్కులే అంగములుగా నున్నవి.

నాయందునూ గురుస్వరూపమగు ఆత్మ యందును ముఖ్యాంగములు సమానము గానే యున్నవి. నా యందు స్థూల శరీరము ఆవరణ రూపంగా యుంటే, అంత్యస్థానమందు ప్రాణమే, ఆవరణ రూపంగా నున్నది. అంతేకాక పింద బ్రహ్మాండములలో వ్యష్ట్యుపాధి పిండాడమని, సమిష్ట్యుపాధి బ్రహ్మాండమని నిర్ణయమే గదా! "పిండం కుండలినీ శక్తి అనగా పిండాండమే కుండలినీ శక్తి అనగా ప్రాణము, అని నిర్వచింపబడినది. కనుక శరీరము ప్రాణము రెండు భిన్నములు గావు. కాబట్టి నా యందునూ ఆత్మ స్థానమందునూ మనఃప్రాణ వాక్కులే ముఖ్యాంగములై యున్నవి.

అంగశుశ్రూషయనగా, పైన చెప్పబడిన మనఃప్రాణవాక్కుల చేత చేయు శుశ్రూషయా? లేక మనఃప్రాణ వాక్కులకే చేయు శుశ్రూషయా? మొదటి పక్షంలో ఆ మనఃప్రాణవాక్కుల చేత యొక్క శుశ్రూష చేయవలెను. రెండవ పక్షంలో తన మనఃప్రాణ వాక్కులకే తాను శుశ్రూష చేసుకొనవలెనా? లేక ఆత్మ స్థానమందున్న మనఃప్రాణవాక్కులకా? లేక అత్మస్థానమందున్న మనఃప్రాణ వాక్కులకా? అని వికల్పములు ఏర్పడుచున్నవి.

మొదటి పక్షంలో తన త్రికరణములచేత (అనగా తన వ్యష్టి మనఃప్రాణ వాక్కులచేత) ఆత్మ తత్వము నందలి మనఃప్రాణవాక్కుకుల (అనగా సమిష్టి మనః ప్రాణ వాక్కులకు) చేయు శుశ్రూషయే, అంగశుశ్రూష. తాత్వికంగా ఎంత విచారించినా వ్యష్టి, సమిష్టి అనే బేధము మాత్రమే కాన వస్తుంది. మనఃప్రాణవాక్కులు తప్ప ఆత్మ యందు ఆబ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం అన్న రీతిగా మరొకటి లేనేలేదు. కనుక తనకు తానే, వ్యష్టి లక్షణము పోయేటందుకే, శుశ్రూష చేసుకొనవలెను అని సిద్ధించు చున్నది. ఈ శుశ్రుషా విధానమేరీతిగా నుండును? తృణాదులు పశువులకును, దాన్యాదులు మానవులకును, హవిశ్శుల దేవతలకున్ను, శ్రాద్ధాదులు పితృదేవలకున్ను మనఃప్రాణ వాక్కులాత్మకున్ను ఆహారంగా చెప్పబడినవి. కనుక ఆత్మకు పరిశుద్ధమగు ఆహారమర్పించుట అనగా తన మనఃప్రాణవాక్కులను మహా పవిత్రముగా పరిశుద్ధంగా నుండులాగున ప్రవర్తించుచూ గురుభక్తి సల్పుటయే అంగశుశ్రూష.

ఇక రెండవ పక్షములో తన అంగములైన మనఃప్రాణ వాక్కులను చేసుకొను శుశ్రూష అనినప్పుడు కూడా తన మనఃప్రాణ వాక్కులను ప్రయత్న పూర్వకముగా పరిశుద్ధము గావించుటయే వానిని యే రూపంగా పరిశుద్ధంగా నుంచవలెను? సంయమనము తపస్సులేక నిగ్రహము వలన వానిని పరిశుద్ధంగా నుంచవలెను. కాయిక, వాచిక, మానసిక సంయమ నములు లేక తపస్సులచే త్రికరణశుద్ధి సాధించవలసియున్నది. పెద్దలను పూజించుట, అహింసా, బ్రహ్మచర్యము మొదలగునవి శారీరక తపస్సు ప్రియమైన సత్యమై లోకమునకు మేలొనర్చు మాటలే వాచిక తపస్సు. దుష్ట సంకల్పములకు దురాలోచనములకు తావివ్వక యెల్లప్పుడూ స్వార్ధబుద్ధిని విడనాడి గురుబోధయందు మనన నిధి ధ్యాసలు గల్గుట మానసిక తపస్సు. త్రికరణశుద్ధి అయిన గాని అంతఃకరణశుద్ధిగాదు. త్రికరణములగు మనఃప్రాణవాక్కులే వ్యష్టి సమిష్టి అంతఃకరణములై యున్నవి. మనఃప్రాణవాక్కులు అన్యోన్య సహకారముతో ఏ కార్యము పట్లనైననూ వర్తించుటయే త్రికరణశుద్ధి. మనస్సు సంకల్పించిన రీతినే మాట్లాడి శరీరముతో అదే విధముగా నడువవలెను. ముఖ్యముగా గురుపుత్రుడు"కర్మగా మనసావాచా సర్వమారాధయే ద్గురూ'' అని త్రికరణశుద్ధిగా గురూపాసన చేయుమని గురుగీత శాసించుచున్నది. వేమన యోగి అన్నగారు దేవతార్చన చేసుకొనుచూడగా మీ అన్నగారేమి చేయుచున్నారని వేమన యోగిని ఎవరో ప్రశ్నించిరట. మాలపల్లిలో చెప్పులు బేరమాడుచున్నారని వేమన జవాబు చెప్పెనట. ఇదేమియని విచారించగా ఆ సమాధానం చెప్పిన సమయంలో నిజంగా ఆయన అన్నగారి మనస్సు ఆవిధంగానే భావనా రూపంగా విహరించుచుండెనట. ఆవిధంగా కాక, పారమార్థిక సాధన యందునూ లౌకిక వ్యాపారము నందును గూడ త్రికరణశుద్ధి కల్గియుండ వలెను.

పైన చర్చించిన రెండు పక్షములకు భేదము లేదని గమనించదగును. ఎట్లనగా ఆత్మ స్థానమందలి మనఃప్రాణవాక్కులకు శుశ్రూష చేయుట, భౌతికముగ అసంభవము కనుక తన మనఃప్రాణవాక్కులను పరిశుద్ధముగా నుంచుకొని గురుభక్తి సల్పుటయే గురుని కంగ శుశ్రూషయని గుర్తించితిమి. త్రివిధ తపస్సులే, తన యందలి త్రికరణములకు చేయు

శుశ్రూషయని రెండవ పక్షమున గుర్తించితిమి. కనుక రెండు విధానములున్ను పర్యవసానమున నొకటి గానే యున్నవి.

చోరత్వ జారత్వాది దుష్ట ప్రవర్తనము చేయుటలో మనసునన తలంచినదే వాక్కుచే చెప్పుచూ చెప్పినట్లుగానే చేయుచూయుంటే ఆ దుష్టులను త్రికరణశుద్ధి గలవారిన యన వచ్చునా? అది అంగశుశ్రూషయని అనదగునా? ఎంతమాత్రముకాదు. త్రికరణశుద్ధిగా సత్ప్రవర్తన కల్గి సత్కార్మానుష్టానము చేసిననే అది అంగశుశ్రూష కాగలదు. కాయిక వాచికముల యందు పరిశుద్ధముగా ప్రవర్తించుచుండినను మనస్సుచే దుష్ట సంకల్పములను వదలడేనివాడు విద్యా చారియని భగవద్గీత చెప్పుచున్నది. అట్లుగాక ప్రాపంచికుని వలెనే వ్యవహారాదులను చేయు చున్నను, అంతఃకరణమందు (మనస్సు నందు) సంగము విడచి, ఆ స్పర్శయోగ మవలంభించు నేని, అతడే రాజయోగి యనజెల్లును. కనుక, అంగశుశ్రూషయందు, ముఖ్యముగా మనోప్రవర్తన విషయంలో సాధకుడు జాగరుకుడై యుండవలెను. కనుకనే "గురుపదిష్ట మార్గేన మనశ్శుద్వింతు కారయేత్" అని గురుగీత చెప్పుచున్నది.

త్రికరణశుద్ధి రూపకమైన అంగశుశ్రూష చాలా అవసరము అట్టి శుశ్రూష లేనివానికి బోధయే చెప్పరాదన్నారు. శ్రీకృష్ణదేశికేంద్రుల వారు, "మనస్సు నొకటి దల్చు, వాక్కున నొక్కటి పల్కుచుండు కుటిలుడు. మరితాతనువున నొక్కటి చేయును. విను వానికి బోధదెల్ప విహితమటోయీ॥"

ప్రాపంచిక వ్యవహారముల యందేగాక ముఖ్యముగా పారమార్థిక కృషియందు గురుభక్తిలిట్టి త్రికరణశుద్ధిని బూనియుండవలెను. ఎట్లనగా, గురుడు నరుడు గాడని మనసా తలంచి, వాక్కుచే అతడే తల్లి,తండ్రి, దొర, దాత, దైవమనుచు కీర్తించుచూ, శరీరముచే గురు పూజాదికము లొనర్చుచూ సకల భ్రాంతులకు మూలకారణమైన ఎరుకకు పరిపూర్ణ పరబ్రహ్మము నందు మూలంగాని కొనకు ప్రేవేశించుటకు స్థానంగాన లేదని క్షణమైన మనస్సున మరవక సర్వభ్రాంతి రహితుడై యుండవలెను.

**4. భావ శుశ్రూష :** గురువుగార్కి సేవచేయుటయందు జాగ్రత్త వహించి వారు నోటితో చెప్పవలసిన అగత్యము లేకుండగానే వారి భావములను గ్రహించి తదనుగుణ్యముగా వారికి యెప్పుడెప్పుడు యేమేమి కావలయునో వానిని సమకూర్చుచూ యుండుట భావశుశ్రూషయని కొందరు స్వార్ధపరులు అర్ధము చెప్పుచున్నారు. యిది సరిగాదు. యిట్లు చేయుటమంచిదే గాని యిది భావశుశ్రూషకు నిజమగు అర్ధముగాదు.

భావశుశ్రూషయనగా గురువుగారు తనకే పరిపూర్ణ భావమును తన జన్మరహితమునకు గాను బోధించుచున్నారో అట్టి భావమును మాత్రమే యేకైక మార్గముగా గ్రహించి యితర సాధనలవలన తనకు జన్మరహితం కాగలదని కలనైన తలంపక అనన్యజ్ఞాన సంపత్తితో యుండి కృషిచేయుటే భావ శుశ్రూష, ఇతర సాధనలయందు అభిమానము వదలక, వాని వల్ల యేమేమో! ఫలములనాసించి చేయుచుండుటచేత తన అంతఃకరణమందు భ్రాంతి విస్తారము చేసుకొను చున్నాడు. అందువలన తన ఆశయమునకు దూరస్తుడున్ను అగుచున్నాడు. అంతేగాక జన్మరహిత

విధానము తెలుసుకొంటూ, గురువుగారు చెప్పిన విధముగా ప్రవర్తించక యితర సాధనలలో ప్రవేశించుటవలన గురుధిక్కారమును చేసిన దోషమునకు గురిఅగుచున్నాడు. నదిలోనున్న రెండు పడవలపైన, ఒకకాలొక పడవపై, రెండవకాలు మరియొక పడవపై వేసినవాడు, పడవలు కొంచమెడముగా కదలుటవల్ల యేవిధంగా యిదీగాక అదీగాక నిలబడ స్థానములేక మధ్యనదిలో పడి మునిగిపోవునో అదే విధముగా గురుబోధ చొప్పున మాత్రమేగాక అన్యవిధముగా గూడ ప్రవర్తించినవాడు యిటు భ్రాంతిరహితమునూ బొందక, అటు కామ్యసిద్ధినీ బొందక, వుభయ భ్రష్టుడై సంసార సముద్రమున శాశ్వతముగ మునిగి పోవును.

ఐతే, భావశుశ్రూష యనగా యితర మార్గముల యందు కృషి మానుటమాత్రమేనా? కాదు యితర సాధనలు మానుకొనుట మాత్రంచేత పరిపూర్ణ భావమారూఢం కాదుకదా? పంచతన్మాత్ర రహితమైనది పరిపూర్ణ పరబ్రహ్మము అని శ్రవణం చేసిన శిష్యుడెట్లు నడువవలె? విన్న మాత్రముచేత ప్రయోజనముండదుకదా! పంచతన్మాత్ర సహితమగు లేనెరుకయే జీవేశ్వర జగత్పరిణామము చెందినది. తానున్నూ యెరుకస్వరూపుడే కనుక ఐహికాముష్మిక సుఖములను ఎంతమాత్రం కోరక యుండవలెను? "ఇచ్ఛారాహిత్యంబునెస్వచ్చంబగు బోధయనుచు సజ్జనులనిరాయిచ్ఛనె కూడనిదనిరా, స్వచ్ఛందుల మాటలన్ని సత్యము వినరా!" అనియు, "ఏయాపేక్ష జనించిన, అయా పేక్షలెల్ల మాయయని దెలియదగున్, అయాసమౌను దానను ఛీ యని యవి విడువదగును. క్షేమముకొరకై" అనిన్ని శ్రీకృష్ణదేశి కేంద్రులు సెలవిచ్చియున్నారు.

"కోరుట, కామంబు! కోరిన యర్థము కొనసాగకుండిన క్రోధమగునుX X X" యిత్యాదిగా వ్రాయబడిన భద్రాద్రి రామ శతకములోని పద్యమును విమర్శించినచో, సకలా నర్థములకును, కామ్య రూపమగు కోరికయే మూలకారణమైయున్నది. బుద్ధభగవానుడు కూడ దుఃఖమునకు మూలము తృష్ణ (ఆశ) అని నిర్ణయము చేసియున్నారు" "నిష్కామేనైవభోక్తవ్యం సదా సంతుష్టమానసః" అని గురుగీత చెప్పుచున్నది. నిష్కామమువలన అంతఃకరణ శుద్ధియు నిత్య సంతుష్టియు చేకూరగలవు. భగవద్గీతయయన్నూ నిష్కామ కర్మాచరణమే విధించుచున్నది. కనుక నిష్కామముగ మాత్రమే గురుభక్తుడు కర్మలాచరించవలెను.

"జనులవలె జరుపు పనులు" అని కృష్ణదేశికేంద్రులన్నారు. నాకు కావలెనా, నల్గురివలె చేయకపోతే, నిందిస్తారు. అని సాకు చెప్పుకుంటూ వుపవాసాదులు, నోములు వ్రతములు కొందరు గురుభక్తులు చేయుట చాలా విచారకరము. లేనివారికి సేవాధర్మముగా నెంచి ఏమి దానము చేసిననూ మంచిదే. ఐతే సాంఘిక కట్టుబాట్లు నీవున్నూ పాటించుమని చెప్పుటకై మాత్రమే జనులవలె పనులు చేయుమని కృష్ణదేశికులు చెప్పినారేగాని, వేలంవెర్రిగా పుణ్యం వస్తుందని ఏ గుంటలోపడితే ఆగుంటలో మునిగి పొట్టమాడ్చుకొని వుపవాసాదులు చేయమని ఆయన అభిప్రాయంకాదని గుర్తించవలెను. "నాకు కావాలా? అన్ని భ్రాంతులు వదలి వేసినాను. ఏదోలోకం కొరకు చేస్తున్నానని చేయువాడు, ఆత్మవంచకుడు. మిథ్యాచారి యగుచున్నాడు. తన కక్కరలేకుంటే ఎందుకు చేయవలె? ఎవరో యేదో అందురేమోనని తానేల భయపడవలె? యిట్టి లోకవాసనతో గురుభక్తుడు గురువునెట్లు సేవించగలడు? లోకమేమంటుందో అను

భీతితో ఎవర్కీ తెలియకుండా యీ గురూపదిష్ట మార్గమందు రహస్యంగా కృషిచేస్తాననడం మరీ ఘోరం. యీ మార్గమునందెట్టి వామాచార పద్ధతులైనావుంటేతాను భయపడవలెగాని నిర్దుష్టమగు ఆచార విచార ప్రచారాదులతో గూడిన సాంప్రదాయక పరిపూర్ణ భావమునందు ఎవరికీ యెటువంటి భీతియూ నుండుటకెట్టి సావుకాశములేదు.

గురుపుత్రునకు యితర సాధనలయందు ప్రవృత్తి గలుగుటయే ఆశ్చర్యము. అట్టి అన్యప్రవృత్తి యేల కలుగువలె? అంటే : అడవులలో చెంచులకు ఆణిముత్యములు దొరుకు చూవుంటే, వానిని ఉప్పుకల్లుకూ, పూరగాయకూ అర్ధణా డబ్బులకే అమ్ముకొంటారు. గురువింద చెట్లను కాచిన గురువింద రంగులకు భ్రాంతిచెంది వానిని హారములుగా గ్రుచ్చుకుని అలంక రించుకొనుటకు కారణమేమి? రెంటి విలువనూ తామెరుంగక పోవుటయే కారణము. అట్లే ఆణిముత్యములవంటి పరిశుద్ధ రూపమగు పూర్ణబోధ చిక్కిననూ దాని విలువ తెలియక పోవుటయు బోధ క్రమము చక్కగా మనస్సున కతుకకపోవుటయు కారణములని శ్రీకృష్ణ దేశికులు బోధిస్తున్నారు. కనుక గురుబోధను ఆమూలాగ్రముగా శిష్యుడు ముందుగా తెలుసుకుంటే తప్ప యితర మార్గముల కంటే పరిపూర్ణబోధ యెంత గొప్పదో తెలియరాదు. కనుక "హృదయగ్రంథి విడుటకై" గురువులు సత్శిష్యులకు సర్వ రహస్యములు చక్కగా తెలియచేయవలసి యున్నది. శిష్యులు గురూపాసన యందేమరక గురుకృపకు పాత్రులై చక్కగా బోధ గ్రహించ వలసియున్నది. అట్లుభయులు నడచిననే ఘనబోధోక్తస్థితి చెందగలరు. లేనిచో భ్రాంతిరహితం కాదు. కనుకనే "నాలుగు శుశ్రూషణములు లోలత గావించుకొనుచు లోకాతీతంబాలోకించీ గురునిచే, యీ లోకము జోలివిడువుమింతే చాలన్నా నీతోగూడ, యిది మరువకన్నా, కీలు దెలియని చదువు చాలా చదివెందుకు? చాలించి పనులు నీవిట్టి కీలు దెలిసితివేని చాలు చాలన్నా" అనగా నాల్గు శుశ్రూషలు చేస్కుంటూ గురుకృపాసంసిద్ధి పొంద వలెను. అపుడే నీ చదువు సార్ధకమై గురుబోధ నీకతుకగలదు. నీతో గూడా యీ లోకముజోలి విడువగలశక్తి సామర్ధ్యములు నీకు కలుగుటకు యిదే కీలు అని భావార్ధము గ్రహించవలెను.

# ఉపాసనాది సాధనలు

ఉపాసన యనగా సమీపమందుండుట అని (ఉప+ఆసన= ఉపాసన) అర్ధము చెప్పవచ్చును. ఎవరి సమీపమున యేమియుండుట? అంటే ఇష్టదైవముయొక్క సమీపము నకు తాను చేరుటలేదా తన సమీపమునకే యిష్టదైవమును తెచ్చుకొనుట. ఆ యిష్టదైవము ఏవేవో విగ్రహాదుల ఆకారాకృతులతో దేశకాల పరిచ్ఛిన్నుడైన వాడగుచో అట్లుచేయుట సాధ్యమగునేగాని నిరాకార నిర్గుణ స్వరూపమగు పరబ్రహ్మముపట్ల యీ అర్ధముతో గూడిన వుపాసన సాధ్యమగునా? సర్వవ్యాపకమై అంతటా నిండియున్న దానికడకు పోవడమనగా యెట్టిది? దానిని సమీపమునకు తెచ్చుకోవడమనగా యెట్టిది? యీ రెండునూ అపభ్రంశము లేయని తోచును. ఐననూ, ఆ నిర్గుణ పరబ్రహ్మమునందు తన మనస్సును వ్యాపక మొనర్చు టయు తన మనస్సును ఆ నిర్గుణ పరబ్రహ్మముచే నిండించుటయూ సాధ్యములేగదా! కనుకనే

"ఓ మిత్యుపాసిత" అనీ, "ఆత్మనే వో పాసీత" అని శ్రుతులు చెప్పగల్గుచున్నవి.

వాగింద్రియముతో స్తోత్రాదులు చేయుట, పాణీంద్రియము (కరములతో) చే నర్చించుట మొదలగు బాహ్యక్రియలు వుపాసనకాదు. కనుక బాహ్యేంద్రియములనబడే కర్మేంద్రియ వ్యవహారముగాని, దర్శనస్పర్శానాది జ్ఞానేంద్రియ వ్యవహారముగాని యుపాసన కానేరదు. ఇకపోతే, మానసిక వ్యవహారమునకు సంబంధించినదే యుపాసనయని యనవలసి యున్నది. ఐతే, యీ మనస్సే స్థానస్వరూప వ్యవహారాది భేదముచే జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనబడు నామ విశేషములనుబొంది అంతరేంద్రియములని వ్యవహరింప బడుచూ వుందిగదా. యిందే యింద్రియముచే యుపాసన జరుగుచున్నది తెలియ వలసియున్నది.

**1. మంత్రోపాసన :** ఇష్టకామ్యార్థ సిద్ధికై యేదో దేవతను ఆశ్రయించి యందుక్కు తగిన మంత్రమును జపించువారు మంత్రోపాసకులు. మంత్రమును అక్షర లక్షలు జపించి ఆ మంత్రాధిష్ఠాన దేవతను స్వాధీనము చేసికొని, స్థంభన, మోహన, మారణ, వుచ్చాటన వశీకరణాది మంత్రసిద్ధులు సంపాదించువారు కర్తృత్వము గల్గి వ్యవహరించుచున్నారు. కనుక వీరు అంతరేంద్రియములలో అహంకారమును పురస్కరించుకొని సాధనచేయు సాధకులనవలసి యున్నది.

**2. భక్తులు :** యిష్టదైవముయొక్క నామరూపాదులను చిత్తముచేచింతించువారు కనుక వీరు చిత్తేంద్రియమును పురస్కరించుకొని సాధనచేయు సాధకులు.

**3. మతవాదులు :** ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది మతములలో నొకదాని నభిమానించి అదే సత్యమార్గమని బుద్ధిచే నిశ్చయించుకొని ఆ మత సిద్ధాంతానుసారము ఆచార విచారాది సాధనలు చేయువారు బుద్ధీంద్రియమును పురస్కరించుకొన్న సాధకులై యున్నారు.

**4. యోగ సాధకులు :** తారక యోగముచే శుద్ధి గావించిన మనస్సే ఆత్మయగుననీ, లేదా అమనస్క యోగముచే మనో చంచలత్వమును అరికట్టి సమాధి నిష్ట సాధించుటయే పరమావధి అనీ కృషి చేయువారు మనస్సును పురస్కరించుకొని సాధనలు చేయువారు.

5. జ్ఞానసాధకులు : సాంఖ్యవిచారణయందు పిండ బ్రహ్మాండములయందలి సమస్తమును తత్వములుగా విభజించి, జ్ఞానముచే తెలుసుకొంటూ, పంచభూత వివేకము, నిత్యా నిత్య వివేకము, దృగ్దృశ్య వివేకములను గురు శాస్త్రాదుల సహాయముచే గుర్తెరిగి త్వంపద, తత్పదముల వాచ్యార్థ లక్ష్యార్థముల దెలసి అన్వయ వ్యతిరేక యుక్తులచే ప్రత్యగ్బ్రహ్మైకత్వమును సిద్ధాంతము చేయువారు జ్ఞానసాధకులు. వీరు జ్ఞానమును పురస్కరించుకొని సాధన జరుపుదురని వేరే చెప్పనక్కరలేదు.

ఇందే దేని సాధనలో చేరని యితర సాధనలు ఏమీ లేవు. ఈసాధనలన్నియూ శబ్దతన్మాత్రవలన కల్గిన అంతరేంద్రియములలో ఏదో దానిని పురస్కరించుకొని చేయబడినవే. పంచతన్మాత్ర స్వరూపమగు పరమాత్మ స్వరూపమును తెలుసుకొనుటకే సాధనలన్నియు యుపయుక్తములు కాగలవు.

కనుక ఆత్మస్వరూప నిశ్చయము కలుగువరకు తప్పక సాధనలు చేయవలసినదే.

అంతేగాని సాధనసంపత్తి యేమియులేని అనధికారి గూడా గురుపాదము పట్టినంతనే గురూపదేశమునాడే నాకెరుకపోయినది. నేను అచలపరిపూర్ణుడను, అశరీరుడను నేనేలేను, సాధనలేమి? యని ముదురు వేదాంతపు మాటలు చెప్పుచూ "ఏ సాధన నీకెందుకు వీసానికి పనికిరాదు" అని సాధనల యందున్న వారిని యీసడించుచు "నిక్కముగ బీరపీచుల చిక్కుసుమి విచ్చరాదు. ఛీ యీ యెరుకన్" అని వాదించుట కడు శోచనీయము. జ్ఞానసాధనయో లేక యోగ సాధనయో చేసి తద్వారా సాధనసంపత్తిని చేకూర్చుకొన్న పూర్ణాధికారికి కందార్థములలో ఏ సాధనయు నీ కవసరములేదని చెప్పబడినదేగాని పంచభూతములే యెరుగని వారికి చెప్పినమాట కాదని గుర్తెరుగవలెను. గురుమంత్రోపాసన, గురుభక్తి, గురువుచూపిన వస్తువునందు మాటిమాటికి మనస్సును లగ్నము చేయు ధ్యానపద్ధతి, తారక, సాంఖ్య, అమనస్క, మహావాక్య, వార్తికాదులకు వస్తు నిశ్చయదృష్ట్యా విచారణచేసి తెలుసుకొనుట యిత్యాదులన్నియు సాధనలు కావా? సాధన లక్కరలేదనేవాడు వుట్టి కెగురలేని తాను స్వర్గమున కెగురుదునని ప్రగల్భములాడువాడని గ్రహింపవలెను. యిట్టివారే తాము చెడినదేగాక లోకమునకు చెరుపు గలుగచేయు రాక్షసులు అని యనదగును.

# భాగవతము

## 1. భక్తి - గురుభక్తి

భాగవతము అను శబ్దములోగల ఐదు అక్షరములలో భ-భక్తిని, గ- జ్ఞానమును, వ-వైరాగ్యమును, త-తత్వమును, ము-ముముక్షత్వమును సూచించునని కొందరు సమన్వయించుచున్నారు. పరిపూర్ణ బోధయందు భక్తిజ్ఞాన వైరాగ్య తత్వముక్షత్వముల నిర్ణయమును తెలుపు సందర్భములో యిక్కడ భక్తిని గూర్చి విశదీకరింపబడినది.

భక్తి శబ్దమును అందరూ విరివిగా వాడుచున్నారు. ఐనను భక్తి శబ్దార్థములను చక్కగా వివరించి తెలుసుకొనవలసియున్నది. భగవంతుని యందలి రక్తియే (ప్రేమయే) భక్తియని కొందరందురు. గాని మాతృ పితృ ఆచార్య, అతిథి సాధు సత్పురుషులగు యితర పెద్దలు మొదలగు వారి యందును స్త్రీకి అత్త మామల యందు ముఖ్యముగా భక్తి యందును, 'భక్తి' శబ్దము వర్తింప చేయబడుచున్నది. కనుక భగవంతుని యందలి ప్రేమ మాత్రమే భక్తియని అనరాదు. భగవంతుడు అన్నపుడు సగుణ బ్రహ్మయే మనస్సునకు తట్టును. నిర్గుణ స్వరూపమని చెప్పబడు బ్రహ్మమునకు ఆస్తి - బాతి-ప్రియ (సత్,చిత్, ఆనంద) ములే స్వరూపము. ప్రియము అనగా ప్రేమ కనుక బ్రహ్మము ప్రేమ స్వరూపము "ఆత్మ వస్తు కామాయ సర్వం ప్రియం భవతిః" అను శ్రుతి పరమాత్మ యందలి ప్రేమయే, సర్వమునందు నుండి ప్రేమకు మూలమని చెప్పుచున్నది. "ప్రియమిత్యు సాసీత" బ్రహ్మమును ప్రేమ స్వరూపముగా యుపాసింపుము అని భావము. భగవంతుడు ప్రేమ స్వరూపుడని సర్వమతములవారున్నూ చెప్పుచున్నారు గనుక

భగవత్స్వరూపమున గుర్తించిన జ్ఞానియొక్క అంతఃకరణము కేవలము ప్రేమమయమై పోవును? కనుకనే "సర్వ భూత హితేరతః" సర్వ ప్రాణుల హితమును మాత్రమే అతడు కోరుచుండునని కొనియాడబడుచున్నాడు.

ప్రేమయే భక్తియా! లేక భక్తియందేమైన ప్రత్యేకత గలదా? భక్తి, ప్రేమ, వాత్సల్యాదులన్నిటయందు ప్రేమయున్నది వానికి గల అర్థ భేదము లను పరిశీలించినపుడే భక్తి శబ్దమును నిర్వచించుట సులభము కాగలదు. "భక్తి" యందు ప్రేమయే గాక, భయ, వినయ, విధేయత, గౌరవము మొదలగునవి గానవచ్చును. పెద్దలయందు మాతా పితలయందు, భర్తయందు. గురు దైవములయందునూ, ప్రేమయే గాక,భయవినయాదులు గాన వచ్చును. గనుక దానిని భక్తి యనవచ్చును. ప్రేమయనునది కొంచమించుమించుగా సమాన మనస్కులగు స్నేహితులు ప్రేయసీ ప్రియులు, మొదలగు వారి మధ్య అన్యోన్యముగల సంబంధమును సూచించును. పతి భక్తియందు ప్రేమయూనున్నది గాని భయ, వినయ, విధేయతాదులతో మిళితమయ్యే శోభించుచున్నది. భర్త తనకన్న పెద్దవాడు. తన్ను ప్రేమించి, పోషించి, సర్వవిధముల తన సౌఖ్యమునకై ప్రాకులాడుచున్నాడు గనుక అతని యెడల భయ భక్తులతో నుండుట మాత్రమే కాదు. హైందవ సంస్కృతి యందు పతి భక్తి, యొక్క విశిష్ఠత గమనించదగినది. పతిభక్తి, దైవభక్తికి సోపానము. పతిభక్తిలేని స్త్రీ నిజమగు దైవభక్తురాలెన్నడూ కాజాలదు. ప్రేయసీ ప్రియుల మధ్యగల ప్రేమకున్ను, హిందూ సమాజమున పతియందు సతికి గలభక్తికిన్ని గల తారతమ్యము గమనించవలెను. మన ఈ సంస్కృతిని విస్మరించి స్త్రీ పురుషుల సమానత్వమునకై ప్రాకులాడు నేటి సమాజమున భార్యాభర్తలయందు సహితము అన్యోన్య ప్రేమయే వుంటున్నది, గాని భర్త యెడల భార్య కుండవలసిన భయవినయాదులున్ను భర్తకు భార్య యెడల యుండవలసిన వాత్సల్యమున్ను క్షీణించుచుండుట నేటి వివాహ విచ్ఛేదక చట్టమునకు దారితీసినది. వాత్సల్యమనగా తన సంతానమునందు, వ్యాధిగ్రస్తులగు దీనులయందు పేదవారియందు, తన్నాశ్రయించి బ్రతికెడి వారియందు గల వాత్సల్యము నందు కూడా భయవినయాదులకు తావులేదు. కనుక యీ భయవినయాది లక్షణములే భక్తి యొక్క ప్రత్యేక లక్షణములుగా భావించవచ్చును. సాధారణంగా భయమున్న చోట వినయ విధేతలు తప్పక యుండును. కనుక భయముతో గూడిన ప్రేమయే భక్తియని నిర్వచించవచ్చును.

భయమనగా నెట్టి భయము? ఎవరి యందు భయ భక్తులు గలవో వారి అజ్ఞాను సారము వర్తించనిచో వారు తన్ను శిక్షింతురేమో అను భయము వారి కృపకు తాను పాత్రుడు కాజాలడేమోయను భయము, ఆకృపాసంసిద్ధి కొరకు గదా గురుదైవముల యందు భక్తి కలిగియుండుట వారి అజ్ఞానుసారముగా వర్తించు వారి యెడల మాత్రమే వారి కృప ప్రసరించును గాని యితరుల యందు ప్రసరింపజాలదు గదా! కనుక కర్మణా, మనసా, వాచా, పరమాత్మా నిర్ణయ విధానముగ, గురువు యొక్క అజ్ఞానువర్తియై విశుద్ధ ప్రవర్తన గల్గియుండవలెను. కనుక తన వర్తనయందెట్టి లోపము గల్గునోయను భయముతో సచ్ఛిష్యుడు, లేక సద్భక్తుడు సదా జాగరూకుడై యుండును. ప్రవర్తన యందే భయము లేక యధేచ్ఛగా సంచరించువాడెంత

ప్రేమ గురుదైవములు యందొలుక బోసుకొనుచున్ననూ అది నిష్ఫలమే గాగలదు. ముఖ్యముగా గురుకృపకై ప్రాకులాడు గురుభక్తుడెట్టివాడో కృష్ణదేశికేంద్రుల వారు తమ కంద పద్యములలో కం॥ మనసున వాక్కున తనువున పని యొక్కటి జరుపునట్టి భక్తునికి దయన్ వినిపించుము వినుమని యీ ఘనబోధనువాని కతుక గలదుడుగకుమీ॥ అని దెల్పియున్నారు. రాముని యిష్ట దైవముగా భావించి, నిరంతర రామనామ స్మరణ చేసిననూ రామునికి గుళ్ళు గోపురాలు కట్టించిననూ అతడు నిజమగు రామభక్తుడు కాడు. రాముని సచ్ఛీలమును పెంపొందింప జేసుకున్నవాడే నిజమగు రామ భక్తుడు కాగలడు. అట్లే గురువాచరించి చూపిన విశుద్ధ ప్రవర్తన యందున్నపుడే శిష్యుడు నిజమగు గురుభక్తుడు కాగలడు. గురువు సగుణ నిర్గుణ స్వరూపమగు పరమాత్మయే. కనుక గురు ఆజ్ఞ మీరకవర్తించుట పరమాత్మ యాజ్ఞానుసారము ప్రవర్తించుటే కాగలదు. సద్గురువాజ్ఞ యెన్నడూ అధర్మముగా నుండదు. ఒకవేళ యున్నచో భీష్మునివలె గురు ఆజ్ఞను ధిక్కరించి ప్రవర్తించినచో దోషము లేదు. ధర్మయుతమగు గురు ఆజ్ఞను మాత్రము త్రికరణ శుద్ధిగా పాలించవలెను. మనస్సు వాక్కు ప్రాణము (లేక శరీరము) లు గదా త్రికరణములు? వీని పరిశుద్ధ రూప ప్రవర్తన యేల విధింపబడెను? అనగా మనఃప్రాణవాక్కులు సమిష్టి వ్యష్టి అంతఃకరణములుగా నున్నవనీ వాని సమిష్టి రూపమే పరమాత్మ యొక్క సత్స్వరూపమని యిది వరకు వ్రాయబడిన త్రికరణశుద్ధి అను వ్యాసములో గమనించియున్నారు. అంతే గాక పశువులకు తృణాదులు మానవులకు పక్షులకు ధాన్యములు, దేవతలకు హవిర్భాగములు, పితృదేవతలకు శ్రాద్ధ రూపమగు పిండోదకములు, ఆత్మకు మన ప్రాణవాక్కులు ఆహారముగా నున్నవని సప్తాన్న విభాగములలో చెప్పబడుచున్నది. కనుక మనఃప్రాణ వాక్కులు పరిశుద్ధముగా నున్నచో ఆత్మకు పరిశుద్ధాహారమిడినట్లే. అందువల్ల ఆత్మబలము పెంచుకొనుచున్నాడు. అపరిశుద్ధముగా నున్నచో తన యాత్మ పాపాత్మకాగలదు. ఆత్మబలము క్షీణించును. కనుక భక్తుడెవడూ తన ప్రవర్తన యందెట్టి లోపము సంభవించునో యను భయముతో సదా జాగరూకుడై యుండవలెను. కనుకనే "వినయ భక్తులెదలోన విడువరాదు గురుని సేవించు పరమభక్తునికి వత్స" అని చెప్పబడినది. ప్రవర్తనలేని వేదాంతము మెట్టవేదాంతమే యగును. ఆత్మ ప్రేమలేని ప్రవర్తన బౌద్ధమతమువలె శూన్యవాదమునకు దారి తీయును. రెండునూ యుండినపుడే భక్తియగును.

శ్లో॥ మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసే
స్వస్వరూపాయ సంధానం భక్తిరిత్యభి ధీయతే॥

అనగా అన్ని సాధనలలో భక్తి గొప్పది. ఆత్మాను సంధానమే భక్తి అని అర్థము. కాని విశుద్ధ ప్రవర్తన లేనిచో ఆత్మాను సంధానము యెన్నడున్ను జరుగనే జరుగదు. "జలము నెడబాయ నొల్లని జలచరముల రీవిబూని సచ్ఛిష్యుడు హృజ్జలజంబను పీఠముపై నిలిపి యితరము మాని గురువునే కొల్చు సుమ్మీ తదూక్తులనే తలచునమ్మీ" యిదే గురు స్వరూపాను సంధానము లేక ఆత్మాను సంధానము. హృదయ పద్మమున గురుస్వరూపమును ప్రతిష్ఠించవలెనన్నా యితరమును మానవలెనన్నా హృదయ పారిశుద్ధ్య మెంత అవసరమో వేరే

చెప్పవలసిన పని లేదు.

సమాజమున తన కెంత పేరు ప్రఖ్యాతులున్నా, ధనవంతుడైనా, విద్యాధికుడైనా గురువును తనతో సమానునిగా గాని తక్కువగా గాని యెన్నడున్ను సచ్ఛిష్యుడు చూడడు.

శ్లో॥ ప్రభో, దేవ, కులేశాన, స్వామిన్, రాజన్ కులేశ్వర
యితి సంబోధ నైర్భితో గురుభావేన సర్వదా॥

గురువు యందు భయము గల్గి ప్రభో దేవ, స్వామీ యనుచూ కేవలము కింకరుని వలెనే శిష్యుడు సంభోదించవలెను. శిష్యుని ప్రజ్ఞాపాటవమునకు లేక ఆచార విచార ప్రచారాదులకు గురువు మెచ్చికొనుచుండినను శిష్యుడు గర్వించరాదు. అందుకే కం॥ గురుడు తన నెంత మెచ్చిన, వరశిష్యుడు లొంగి తిరుగవలయును. మదిలో మురసి భయభక్తిలేకను, తిరిగిన చేటవెందెదవు నిజము తెలియగదోయీ 'అనిన్ని కం॥ గురుడు తనయాజ్ఞలోపల, చరియింపగ గోరునట్టి శిష్యుని కెపుడున్ దురితంబు వృద్ధియై తానరకమున్ గూలకున్నె నరునుత చరితా'' అనిన్ని శ్రీకృష్ణ దేశికేంద్రుల వారు చేసిన హెచ్చరికను యెవరూన్నూ యెన్న డున్నూ మరువరాదు.

గురువును కొల్చిన చాలదా? గురుపత్నినియేల పూజించవలెను. అను శంక కొందరికి కలుగవచ్చును. గురు స్వరూపము శివశక్త్యాత్మకంగా లేక పురుష ప్రకృతులను రెండు రీతులుగా నున్నది. పరమాత్మ పురుష ప్రకృతులను రెండు రూపములుగా విడదీయ రాక ఏకముగా నున్న విషయమును సూచించుటకే "అర్ధనారీశ్వర" రూపకల్పన జరిగినది. కనుక గురుభక్తుడు తన గురువును "వామాంక పీఠేస్తి తదివ్య శక్తిం" అనగా ఎడమ భాగమున దివ్య శక్తినివుంచు కొన్న వానిగా భావించి అర్చించును. అపుడే పురుష ప్రకృతుల భేదమంతరించి వస్తు స్వరూపయదార్థజ్ఞానము దృఢము కాగలదు. కనుక గురుపత్నిని గూడా గురువుతో పాటు భయభక్తులతో సచ్ఛిష్యుడు సేవించుచుండును.

ఈ భయభక్తులు గురువు నెడల యెంతకాలముండవలెను? బోధవినునంత కాలము గురువు నెడల భక్తి యుంచిన చాలదా? అటుపిమ్మట కూడా గురుభక్తి అవసరమా? అంటే, తప్పక అవసరమేనని తెలియవలెను. కనుకనే "పరిపూర్ణ బోధ దెలిపే పర్యంతము సేవచేసి బహునమ్మికగా తరువాతను గురుమూర్తిని మరి కన్నుల గనని వాని మార్గము ఛీఛీ" అని శ్రీకృష్ణదేశికులట్టి వారని సంపూర్ణముగా నిరసించినారు. గురుడు నరుడనే భావన తొలగకపోవుటయే అట్టి అనర్థముల కెల్ల కారణము. గురువు కేవలం పరమాత్మయే అనే స్వరూప లక్షణము గుర్తెరిగి "సుప్తేరుద్ధాయ సుప్త్యంతం" అనగా ప్రతి నిత్యమూ నిద్రలేచినదాది తిరిగి నిద్రవచ్చేవరకు గురుపరమాత్మయందలి భక్తిని గోల్పోకుండానున్న వాడే ధన్యుడు.



# జ్ఞానము

జ్ఞానము అనగా తెలివియని సామాన్యార్థము. యిది సామాన్య జ్ఞానమనీ విశేష జ్ఞానమనీ రెండు విధములుగా జీవోపాధులయందు వ్యక్తమగు చున్నది. సామాన్య జ్ఞానమనగా మానవేతర జీవోపాధులయందు పరమాత్మ నిర్మిత విధానముగా స్వాభావికముగా నుండి శరీరావసరములను దీర్చుకొను శక్తిమాత్రము కలదై యుండును. కాష్ఠాగ్ని (కఱ్ఱ యందు నిగూఢమైయున్న అగ్ని) ఏ విధముగా దీనిని దహింపజాలక ప్రమాదరహితమై యుండునో అట్లే యితరోపాధులయందుండు జ్ఞానము స్వయంపోషకత్వమునకు, ఆత్మరక్షణకు మాత్రము వినియోగింపబడుచూ క్రొత్తగా ఆగామి పుణ్యపాప ఫలములను సృష్టింపజాలక ప్రారబ్ధ రూపకర్మమును మాత్రమనుభవించుచూ శరీరయాత్ర సాగించును. విశేష జ్ఞానమొక్క మానవోపాధియందు మాత్రమే కలదు. ఇది వివేకముగల్గి యుక్తాయుక్తములు నిత్యానిత్యములు ఆత్మానాత్మలను కేటాయించి తెలిసికొను శక్తిగల్గి మానవుని అభ్యుదయ పతనములకు హేతుర్భూతములగు కర్మల నొనరించుచు ఆగామి ఫలములను సృష్టించు కొనుచున్నది. మానవోపాధియందలి జ్ఞానము 1. యింద్రియ జ్ఞానము 2. స్వరూప జ్ఞానము 3. మోక్ష సాధనారూప జ్ఞానము అను మూడు ముఖ్య రూపములుగా నున్నది.

**యింద్రియ జ్ఞానము :** అంతరేంద్రియ పంచకమనబడు జ్ఞానమనో బుద్ధి చిత్తాహంకారముల రూపంలో పరిణామము చెందుచూ సంకల్ప నిశ్చయ చింతనాభిమానములు కలిగి వివేకముతో వ్యవహా రము చేయుచున్నది. జాగ్రదావస్థయందు యీ జ్ఞానము సకల జ్ఞానకర్మ రూప క్రియలు చేయుచున్నది. ఎట్లనగా " సీ॥ శ్రవణేంద్రియంబుల శబ్దముల్ వినుచుండు చర్మేంద్రియంబున స్పర్శనెరుగు" ఈ జ్ఞానమే జ్ఞానరూపమై మనోరూపకమై, బుద్ధి రూపకమై, చిత్తరూపకమై అహంకార రూపకమై, సమానవ్యానవు దాన ప్రాణాపానములను ప్రాణేంద్రియములను గూడి జ్ఞానేంద్రియ ముల ద్వారా శబ్దాది విషయములను గుర్తించుచూ కర్మేంద్రియముల ద్వారా వచన దానగమన ఆనంద విసర్జనములను చేయుచున్నది. ఈ జ్ఞానముతో గూడకయే యింద్రియ మున్ను ఏ వ్యవహారము చేయుటకున్నూ సమర్థముగాదు, కనుకనే ఆ మిగతా 24 యింద్రియ ములునూ జడములని చెప్పబడినవి.

స్వప్నావస్థయందు యీ జ్ఞానము కేవలము మనో రూపముగా నుండి స్వప్న ప్రపంచమును (దృశ్యములను) కల్పించుకొని అనగా తానే దృశ్య స్వరూపందాల్చి తానే ద్రష్టయై దృక్స్వరూప సాధనముగాను తానేయుండి భావనా రూపంగా తానే వ్యవహరించుచుండును. కాని తన సహజ లక్షణమగు వివేకమును మాత్రము గోల్పోయి అసంబద్ధములు అసందర్భములు విపరీతములు, ఒక్కొక్కపుడు అవినీతికరములూనగు వ్యవహారములు చేసినట్లుగా కలగను చుండును. కాని అపుడు జ్ఞానములేదు. జ్ఞానపరిణామమగు మనస్సు వివేకహీనమై యున్నది. కనుక పాపపుణ్య రూపమగు ఆగామి ఫలమునుత్పత్తి చేయజాలదు. సుషుప్తి యవస్థ యందీజ్ఞానము తన కారణ శరీర రూపమగు అజ్ఞానముచే ఆవరింపబడి స్వరూపమును మరిచి

ఏమియు గుర్తించకయుండును. ఈ విధంగా యీ జ్ఞానము జాగ్రదావస్త యందు స్థూల శరీరముతోను, స్వప్నావస్తయందు సూక్ష్మ శరీరముతోను, సుషుప్తియందు కారణ శరీరముతోను తాదాత్మ్యముచెంది వానియందభిమానము గల్గి విశ్వతైజస ప్రాజ్ఞ నామములను ధరించి యున్నది. ఈ మూడవస్థల యందు మాత్రమే "నేను నేను" అని అహంకారా భిమానములు గల్గి జీవశబ్దముతో వ్యవహరింపబడుచు యుండును. ఈ శరీరత్రయ సంబంధమును విడచి నిష్క్రియముగా నున్నపుడు అనగా తాను తానుగానే వున్నపుడు దీనికే ప్రత్యగాత్మ అని పేరు.

**స్వరూప జ్ఞానము:** జ్ఞానము కూడా నొక యింద్రియము అన్నపుడు దీని కాది భౌతికము "యెరుగుట" అని చెప్పబడినది. అపుడు యీ జ్ఞానమనే యింద్రియము ద్వారా ఎరుగుట అనేక్రియచేసే కర్త ఎవరు? వేరే ఒకరున్నారని చెప్పలేము కనుక ఈ జ్ఞానమే కర్తృ భావమునజ్ఞాత అని పేరొంది జ్ఞానమనే యింద్రియము ద్వారా సమస్తమును గుర్తించు చున్నది. యీ గుర్తింపబడినది జ్ఞేయము (తెలియబడినది లేక తెలియదగినది) స్వప్నావస్తయందు యేవిధంగా దృశ్యరూపం దాల్చిన మనస్సును, మనస్సుచేతనే, మనస్సు గుర్తించినదో అట్లే జాగ్రదవస్త యందు జ్ఞానమే జ్ఞానము ద్వారా జ్ఞేయ రూపంవహించిన తన్ను తానే తెలియుచున్నది అని దృష్టి సృష్టి వాదము చెప్పుచున్నది. అనగా జ్ఞాతృజ్ఞాన జ్ఞేయ త్రిపుటి రూపముగా నున్న దొక్క జ్ఞానము మాత్రమే అని భావము. ఇది ఎట్లు సాధ్యము? అంటే జ్ఞానమునకు పూర్వరూపమేమి? జ్ఞేయ రూపవస్తువు సృష్టికి కారణమేమి? అంటే..."జ్ఞానా దేవతు కైవల్యం" అని చెప్పబడిన పరమాత్మయే, అదృష్టితో చూచినచో సర్వమును, జ్ఞానమే చిద్రూపమే, అపుడు జ్ఞానమనే మాటకు అధిష్టాన రూపమగు చిన్మాత్రవస్తువునే అర్థముగా చెప్పాలి. అదే జ్ఞానమని చెప్పవలెను గాని యింద్రియమని చెప్పనేరాదు నిజమే. గాని అధిష్టాన మందలి జ్ఞానము తెలియచేయుట మాత్రమే గాని తాను సాక్షిమాత్రముగానే యుండును. సర్వమును తెలుసుకొనునది యింద్రియ రూపంగా నున్న జ్ఞానము మాత్రమేనని తెలియవలెను. జ్ఞానమున కాది భౌతికము యెరుగుట అని చెప్పబడినదే! అది మిగితా యింద్రియములతో జేరకుండా దేనినైనను గుర్తించుచున్నదా? అని ప్రశ్న రావచ్చును. ఆహా నిశ్చయముగా గుర్తించుచున్నది. గుర్తించులక్షణమంతయు దానిదే. ఆకలిని గుర్తించునది ఏది? సుఖదుఃఖములను గుర్తించునది ఏది? మనస్సందురేమో? అనరాదు మనస్సు ద్వారా జ్ఞానం గుర్తించింది అనాలి. స్వప్నావస్తయందు మనస్సున్నది గదా యుక్తా యుక్తములను గుర్తించినదా? కనుక గుర్తెరుగునది జ్ఞానమేగాని మరొకటి లేదు. అధోరూప పరిణామంలో ప్రాపంచిక వ్యవహారములను అతీంద్రియ దృష్టితో ఆత్మస్వరూపమును (తన స్వరూపమును) గుర్తించునదియు నీ జ్ఞానమే, తాను జ్ఞాతగా నుండి తనకు వేరుగా జ్ఞేయమును గుర్తించునపుడు యీ జ్ఞానమున్నూ ఒక యింద్రియమే యగును. వేరుగాదు. కాని జ్ఞేయము తనకంటె వేరుగా లేదు. తానే ఆ జ్ఞేయ వస్తువును అని ఆత్మరూపముతో తాదాత్మ్యము చెందునపుడు అది అతీంద్రియము. ప్రజ్ఞానమనిదానికి పేరు. ప్రజ్ఞానం బ్రహ్మయను మహా వాక్యార్థము యిచటనే సార్థక్యత గాంచుచున్నది.

శ్లో॥ జ్ఞేయం సర్వమతీతం చజ్ఞానం చమన ఉచ్యతే।
జ్ఞానం జ్ఞేయం సమంకృత్వాయథానాన్యద్వితీయకం॥ ॥గురుగీత॥

అనగా సర్వాతీతమగు జ్ఞేయ బ్రహ్మము యొక్క రూపమును జ్ఞానము ధరించగలదు. అపుడు మరొకటుండనే యుండదు అనిభావం. అదిష్టాన రూపమగు చిన్మాత్ర వస్తువు శబ్దరూప పరిణామము చెందినపుడు అది పరాపశ్యంతి మధ్యమ వైఖరి రూపము దాల్చి జీవోపాధుల యందు వివిధత్వము చెందినది. మానవులందు వైఖరి రూపవాక్కుగా, పశుపక్ష్యాదుల యందు మధ్యమ వాక్కుగా, తరులతాగుల్మాదుల యందు పశ్యంతి వాక్కుగా పరమాత్మ స్థానమందు పరావాగ్రూప మగు ప్రణవ స్వరూపంగా నున్నదీ జ్ఞానమే అనదగును.

ఆదియందు, అనగా పరమాత్మ స్థానమున ఏకమాత్ర రూపంగానున్న యీ జ్ఞానమే (తెలివే) బ్రహ్మండస్థానమున పంచాధిష్ఠాన దేవతలగు బ్రహ్మ విష్ణురుద్ర ఈశ్వర సదాశివుల యొక్క జ్ఞాన ప్రకాశమై ఐదు విధాలుగానూ యుండి, ఉత్పత్తి స్థితిలయ విస్తీర్ణ ఆకర్షణములను పంచకృత్యములు జరుపు చున్నది. పిండాండమందు యిరువదైదు యింద్రియముల ద్వారా పనిచేయుచు, యిరువదైదు తెలువులున్నవా, అనునట్లుగా సకల జాగ్రత్కార్యములు చేయు చున్నది.

ఈ జ్ఞానమే, ప్రత్యగాత్మ పరమాత్మలుగా, సమిష్టి వ్యష్ట్యాత్మకముగా, శుద్ధా శుద్ధజ్ఞానములుగా, జ్ఞానాజ్ఞానములుగా, (అనగా యెరుక మరుపులుగా) రెండు రూపములుగల ద్వంద్వరూపయేక వస్తువై ప్రకాశించు చున్నది. కనుకనే "జ్ఞానాజ్ఞానంబులు యీ జ్ఞానానివేగాని వేరుగా వెన్నటికీ" అని కృష్ణదేశిక ప్రభువు సెలవిచ్చి యున్నారు. ఎరిగే లక్షణముతో నున్నపుడు ఎరుకనీ, తననూ యితరమును గుర్తించనపుడు మరపు (అజ్ఞానము) అని దానికే పేర్లు. ఈ జ్ఞానమే కర్తయు, కారయితయూనైయున్నది. అంతే గాక యీ జ్ఞానమే క్రియా రూపము వహించి కర్మ అని పేరు వహించినది. "కం॥ ఎరుగుట జ్ఞానము దానను జరిగేపని కర్మ" అని జనులందురు ఎట్లనగా నిష్క్రియమైయున్నపుడు జ్ఞానమని, గుర్తిరిగే పనిచేయుచు క్రియారూపం వహించినపుడు కర్మయనీ ఒక జ్ఞానమునకే పేర్లు. కనుక కర్మయనగా క్రియా రూపం వహించిన జ్ఞానమేగాని వేరే భిన్న వస్తువుగాదని గుర్తించవలెను. రెండు రూపులుగా గానవచ్చు ఏకవస్తువు గనుక దీనిని ద్వంద్వ రూప ఏకము అని అనవచ్చును. ఈ ఏకమే "అనేకం భవతి" అని శ్రుతి చెప్పినది. కందపద్యము : ముడిబడికర్మము జ్ఞానమువిడవక నా రెండు వెలసె విశ్వమన' అన్నారు కృష్ణదేశికులవారు. అంటే కర్మజ్ఞానములు రెండు భిన్న వస్తువులనీ, అవియేకమై ముడిబడినపుడు విశ్వము పుట్టింది అని అర్థముకాదు. విడువక అనుటలో ఆరెండూ ఒక దానిని విడచి మరొకట్టుండవు అని తెలుచున్నది. అంటే ఆ వస్తువు కర్మజ్ఞానములను రెండు లక్షణములుగల యేక వస్తువు అన్నమాట. జ్ఞానమొక్కటి మాత్రం ప్రకటమై యున్నపుడు ఎరుక అని పేరు. క్రియాలక్షణముగూడ ప్రకటనమైనపుడు అదే జగద్రూపంవహించును. కనుకనే ఎరుక జగములు రెండూ ఏకవస్తువే అనబడు జ్ఞానకర్మములయొక్క వస్తు నిశ్చయముగల వార్కి యీ విషయము సుస్పష్టమే అయియున్నది. వస్తునిర్ణయము లేనిచో తమ గురువులవల్ల తెలియవలసియున్నది.

**సాధనారూప జ్ఞానము:** పైన వివరించిన స్వస్వరూపమును మరచి పోయి తిరిగి తెలియబడకుండుటయే అజ్ఞానము. ఈ అజ్ఞానమే బంధకారణమనీ, జ్ఞానము మోక్షకారణమనీ, కర్మభక్తి యోగాది యితర సాధనలవల్ల మోక్షము సిద్ధించదనీ, బంధకారణమగు అజ్ఞానమునకు ప్రతియోగియగు జ్ఞానముచేతగాని ఆ అజ్ఞానము తొలగదనీ, మోక్షమునకు జ్ఞానమొక్కటే సాక్షాత్సాధనమనీ, యితరేతర సాధనలన్నియు పరంపరా సాధనలు మాత్రమేనని చెప్పబడుచున్నది. కాని "మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవగరీయసీ, స్వస్వరూపాను సంధానం భక్తి రిత్య భిధీయతే" అని శంకర భగవత్పాదులన్నారు. స్వస్వరూపాను సంధానం భక్తియగుచో సాధనారూపమందు జ్ఞానముయొక్క నిర్వచనమేమి?

జ్ఞానమున కాధిభౌతికము యెరుగుట గదా! ఇక స్వస్వరూపమును యెరిగెటిదేది? జ్ఞానమేనా మరియొకటేదైననున్నదా? తన్ను తానెరిగినా యితరమును యెరిగినా యీ జ్ఞానము చేతనే. స్వస్వరూపమును యెరిగేది జ్ఞానము. స్వస్వరూపాను సంధానము భక్తియని నిర్వచింపబడినపుడు భక్తిజ్ఞానములు రెండూ ఒకటేనని చెప్పవలసియున్నది. భక్తి పరాకాష్ఠ జెంది ఉపాస్యఉపాసక భావమంతరించి ఉపాస్యము తప్ప మరొకటి లేకపోవుటయే ఏకాంతభక్తి. జ్ఞానజ్ఞేయములు రెండూ ఒకటగుటయే జ్ఞానగమ్యము. కనుక ఏకాంత భక్తియు జ్ఞానమున్ను స్వస్వరూపమునందే పర్యవసించును. ఆ రెంటికి అదియే కూడలిస్థానము. నేనే జ్ఞాతనై, నా జ్ఞానముచే నా స్వరూపమైన జ్ఞేయమును గుర్తెరుగుచున్నాను. ఆ జ్ఞేయము అఖండ జ్ఞానము లేక చిత్స్వరూపమై యున్నది. కనుకనే "జ్ఞానము నేననవొక్కటె, జ్ఞానమునే వేరటంచుగనబోకు సుమీ" అని కృష్ణదేశికేంద్రులు హెచ్చరించినారు. అంతా యీ జ్ఞానస్వరూపమే (లేక చిత్స్వరూపమే) చిత్స్వరూపంగానిదేదీ లేదంటున్నాయి యుపనిషత్తులు.

"ఏక విజ్ఞానేనిసర్వ విజ్ఞానం భవతి = ఏ ఒక్కటి తెలిసినచో అన్నియు తెలియబడ గలవో" అనిన్ని "యత్ జ్ఞాత్వా నేహభూయో న్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే = ఏది తెలిసినచో" యిక తెలియదగినదేదీ శేషించదో అనినీ శ్రుతిస్మృతులు నొక్కి చెప్పినది యీ స్వస్వరూప జ్ఞానమును గుర్చియే.

ఐతే నా స్వరూపమేది? "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యము. నేనే బ్రహ్మమును అని చెప్పుచున్నది. దేనియందు సృష్టి స్థితిలయములు జరుగు చున్నవో అది బ్రహ్మమన్నవి వుపనిషత్తులు. కనుక నేనే ఆ బ్రహ్మనైతే నాయందే ఆసృష్టిస్తితిలయములు జరుగుచున్నా యన్నమాట. మరిన్ని నేనే సర్వకారణములూనై సృష్టియందు సర్వేసర్వత్ర వ్యాపించి యున్నాను. నాకు వినా ఏమీ లేదు. అంతటా నున్నది నేనే. అన్నిటియందూ నేనే. నాయందేయీ అన్నీ సృష్టి స్తితి లయములు పొందుచున్నవి అని తెలుసుకొనుటయే జ్ఞానము. జ్ఞానమునకు యిదియే, నిర్వచనమని చెప్పవచ్చును.

ఆత్మదృష్టి తప్పయిక అపుడు యేభిన్నదృష్టికి తావేలేదు. యిక రాగద్వేషాదులుండుటకు యెట్లు సాధ్యము? వాచాడంబరముగాగాక యీ జ్ఞానమారూఢమై సహజమైపోవలె. పురుషునకు తాను పురుషుడననే జ్ఞానము స్త్రీకి తాను స్త్రీననే జ్ఞానము ఏ ప్రయత్నం చేయనక్కరలేకనే

ఆరూఢమై వారివారి ప్రవర్తనల యందాజ్ఞానం తొణికిసలాడుచుండును. నేను స్త్రీని కనుక స్త్రీకి యుచితమగు రీతిని నేను వస్త్రధారణా లంకారాదులను చేసికొనవలసియున్నదని ప్రతిసారి స్త్రీ సంకల్పించుచుండునా? తాను స్త్రీ ననే భావము ఆమె ప్రకృతిలో ఆమె వ్యక్తిత్వములో ఒక భాగమై పోయినది గదా! అట్లే ఆరూఢజ్ఞాని కూడా తన ప్రవర్తన యందు నేను అఖండ జ్ఞానస్వరూపుడగు బ్రహ్మమును అని ప్రతిసారీ అనుకొని క్రియలు చేయడు. ఆత్మదృష్టి యెరువుగా దెచ్చిపెట్టకొన్నదిగాక తన ప్రకృతిలో యొక భాగమే అయిపోవును.

ఇట్టి ఆరూఢత యెట్లు సిద్ధించును? అందుకే సాధన కావలెను. శాస్త్రపరిజ్ఞానముతో శ్రవణమనిన నిధిధ్యాసలు చేసిన సరిపోవునా? అంటే చాలదు. అందువల్ల పరోక్ష జ్ఞానమే కల్గునుగాని, వస్తుస్వరూపయదార్థ అపరోక్షజ్ఞానము కలుగదు. అట్టి అపరోక్షజ్ఞానము కల్గించువాడు గురుడే. గురుమూర్తి చూపిన ఆత్మవస్తువునవలోకించి, అట్టి స్వరూపం గల్గిన తానెట్టి యాచారవిచారములు కల్గియుండవలెనో గమనించి భయభక్తి గురుసార్వభౌముని సేవ నిశ్చయముగ జేసితె జయమందెదవు. కనుకనే గురుగీతలో

శ్లో॥ యస్యప్రసాదా దహమేవ సర్వం
మయ్యేవసర్వం పరికల్పితం చ
యిత్థం విజ్ఞానామిః సదాత్మరూపం
తస్యాంఘ్రి పద్మం ప్రణతోస్మి నిత్యం

**తాత్పర్యము** : నేనే సర్వమునై యున్నాను. నాచేతనే సర్వము కల్పించబడినది. అను అఖండ జ్ఞానముయెవని కృపావిశేషమున కలిగినదో అట్టి గురుమూర్తి పాదపద్మములకు నిత్యము నమస్కరించుచున్నాని చెప్పబడి యున్నది.

# వైరాగ్యము

వైరాగ్యము అనగా రాగము లేకుండుట. రాగమనగా యిష్ట వస్తువులయందుగాని ప్రాణులయందుగాని వుండు విపరీతముగు ప్రేమయే (లేక అనురాగమే) రాగము అనబడును. "రాగద్వేషములు" అని, మనం తరుచుగా వాడేజంట శబ్దములలోని ద్వేషమున్ను వైరాగ్యమున్ను ఒకటేనా? కాదు. ద్వేషము అనేది కూడా ఒక విధమగు రాగమేనని చెప్పాలి. ఎందుకంటే ఒక వస్తువు యందు వుండే ప్రేమయే అన్య వస్తువులయందుండు ద్వేషమునకు పునాది. మరిన్ని రాగం యొక్క అభావస్థితి ద్వేషము కాదు. ఎట్లనగా నాకు దేనియందునూ రాగము (విపరీతమగు ప్రేమ) లేకపోవచ్చును. అంతమాత్రముచే ఆ అన్నిటియందు నాకు ద్వేషముందని చెప్పవచ్చునా? చెప్పరాదు. కనుక ద్వేషమనగా ఒక దాని యందు ప్రేమలేకపోవుట మాత్రమే గాక దానియందు విపరీతమగు అయిష్టము, అసహ్యము, కోపము, పగయిత్యాదులుండుటచే ద్వేషమన వచ్చును. రాగముకంటె ద్వేషము హానికరము. ద్వేషమువలన అంతఃకరణ కూడా కలుషితమై పోవుచున్నది. ద్వేషము కూడా రాగము వలెనే అహంకారము యొక్క అది భౌతికమగు అభిమానము యొక్క వృత్తి రూపమై యున్నది. అందేది యున్ననూ అహంకారాభిమానములు పోజాలవు. కనుక

రాగద్వేషములు రెండునూ లేకుండుటయే, నిజమగు వైరాగ్యమని చెప్పవలసియున్నది.

మోక్ష సాధనకు విషయాసక్తి లేక రాగము ప్రతి బంధకముగా నున్నది. ఎట్లనగా మనస్సునే కాగ్రముచేసి మంత్రమునందో గురుదైవముల యందో నిలుపదలచి నపుడు మనస్సు తనకు ప్రేమాస్పదములై యున్న శబ్దస్పర్శాది విషయములపై కురుకుచుండును. కనుక రాగము కూడదేగాని అట్టి విషయాదులయందు ద్వేషము పెంపుచేసుకొనుట మంచిదే గదా! అని శంకింప వచ్చును. కాని ద్వేషము యింకనూహాని కరమై అంతఃకరణను కలుషిత మొనర్చును. ఉదాహరణకు : నాకొకప్పుడు సినిమాలంటే విపరీతమగు ప్రేమ(రాగము) వుండేది. ఆ రాగమును వీడుటకై నేను సినిమా తీసిన వాళ్ళను, సినిమాలకు పోయేవాళ్ళనున్నూ అందరినీ నిందించ వలెనా? వారియందు ద్వేషమును పెంపొందించవలెనా? అక్కరలేదు. "విరక్తిర్దోషదర్శనం" అనెడి న్యాయంగా సినిమాలు చూచుట వలన కలిగే అనర్థములను దుష్టపరిణామాలను గుర్తించి విచారించినచో వాని యందలి వ్యామోహము క్రమశః సన్నగిల్లిపోవును. అట్లే భార్యబిడ్డల యందును ధన కనక వస్తు వాహనాదులయందునూ వ్యామోహము కూడదేగాని వానియందు ద్వేషము పెంచుకొనవలసినపనీ లేదు. అంతఃకరణమునందు ద్వేషమున కెంత మాత్రమూ తావివ్వరాదు. ప్రేమయే భగత్స్వరూపమని అందరూ పల్కు చున్నారు గదా! ఆ కల్పంలో ప్రేమతత్వమును అవగతము చేసుకొని భేదభావమునందలి సర్వులనుప్రేమించగల ప్రేమాంతఃకరణమును సంపాదించుకొనుటకు బదులు అంతఃకరణ యందు ద్వేషబీజములను నాటినచో అవి మొలకెత్తి యొక మహా విషవృక్షమై అంతఃకరణమందు భగవంతునికి స్థానముకూడ లేకుండచేయును. కనుక రాగద్వేషముల రెంటిలో దేనికి అంతఃకరణయందు తావీయ రాదు. వైరాగ్యముకలుగ వలెనన్నచో దేనిని వదలవలయును? అన్నది ముఖ్యముగా విచారింపదగియున్నది. రాగద్వేషములను పురికొల్పు భార్యపుత్రాదులను వస్తువులను విడచి వేయవలయునా? లేక వాని యందలి వ్యామోహమును విడచిన చాలునా? భార్యాపుత్రాదులను, ధనకనక వస్తువాహన గృహారామాదులను సర్వమును విడుచుట సన్యాస పద్ధతి, వ్యామోహమును మాత్రము విడుచుట రాజయోగ పద్ధతి, శబ్దాదులకు కారణమైన సర్వమును వదలివేయుడని ఒకరి అభిప్రాయము, శబ్దాదుల యందలి విపరీత కామక్రోధాదులను (అనగా వ్యామోహమును) వదలిన చాలునని ఒకరి అభిప్రాయము. సరస సంగీత సాహిత్యాది శ్రవణమే పనికి రాదు. భార్యా పుత్రాది సుఖ స్పర్శయే పనికిరాదు. సౌందర్య దర్శనమే పనికిరాదు. రసాస్వాదనమే పనికిరాదు. పుష్ప సౌరభాది సుగంధాదులున్నూ పనికారావని వదులుట సన్యాసము. మరికొందరు విషయానందము అనర్థదాయకమని వానిని వదలుటతో మాత్రము తృప్తిపడక శబ్దస్పర్శాదుల వలన కలిగే దుఃఖమును ఆహ్వానించు కొందురు. వేసవిలో అగ్నిహోత్రసాన్నిధ్యము నందుండుట శీతాకాలములో దిగంబరులుగా నుండుట, శిలాకంటకావృత మార్గములయందు మాత్రమే నడచుట మేకులు కొట్టిన పాదుకలను ధరించుట కటికనేలనే కావాలని పవ్వళించుట, రసహీన పదార్థములను వేపాకువంటి చేదు పదార్థములను దినుట రాగద్వేషములకు మూలకారణమైన అభిమానమును వదలి పెట్టవలనెను యుద్దేశ్యముతో దిగంబరులై సంఘములో దిరుగుట

యిత్యాదిపనులు గావింతురు. యిది మరీ ఘోరము, వీరినే వైరాగ్యపాషండులన్నారు.

ఏలననగా, శబ్దస్పర్శ రూపరస గంధములు సుఖదుఃఖముల రెంటినీ కల్గించుటకు సమర్థకములై యున్నవి. కనుక విషయానుభవంలో మంచి శబ్దము, మంచి స్పర్శ, మంచి రూపము మొదలగు వానివలన అంతఃకరణమందు అనుకూల వేదన కలిగి సుఖాను భూతి కల్గును. లేదా దుశ్శబ్దాదుల వలన అంతఃకరణయందు ప్రతికూల వేదనకల్గి దుఃఖానుభూతి కల్గును. ఎవరైనను సుఖాను భూతినే కోరుదురుగాని దుఃఖానుభూతిని ఎవరున్నూ కోరరు. విషయానందము బంధకారణమని దానిని ఆశించక పోవుట మంచిదేగాని దుశ్శబ్దాదులను అందువలన కలిగే దుఃఖానుభూతిని కోరి తెచ్చుకొనుట మౌఢ్యముకాదా?

కనుకనే వారు వైరాగ్య పాషండులుగా నిందింపబడినారు. సుశబ్దాది విషయములవల్ల కలిగే విషయానందమెట్లు బంధకారణ మగుచున్నదో అట్లే దుర్విషయ పరిగ్రహమువల్ల కలిగే దుఃఖమున్ను బంధకారణమే యగుననుటలో సందేహములేదు. ఏలననగా ఆనందము కొరకు విషయముల యందలి మంచిని అనుభవించవలెనని ఒకడు కోరుచున్నాడు. విషయానందము తుచ్ఛమని మరియొకడు దానిని ఆశించుట మానినాడు. మరియొకడు యింకనూ తీవ్ర వైరాగ్య పరుడను కావాలనే ఆశతో తుచ్ఛమని విషయానందమును దూరీకృత మొనర్చుట యేగాక-దుఃఖప్రదములగు శబ్దాదులయందు ప్రేమ కనబరుచుచున్నాడు. ఆ విధముగా శబ్దాది విషయములందలి మంచిని ప్రేమించు వాడొకడు చెడ్డను ప్రేమించువాడొకడు. యీ ప్రేమ విపరీతమైనచో రాగము. యిందు మొదటివాడు విషయాదుల దుష్టత్వమును ద్వేషించితే రెండవవాడు ఆ విషయానంద ప్రదమగు మంచినే ద్వేషించుచున్నాడు. కనుకనే ద్వేషించుట కూడా యొక విధమగు రాగమే యనియనవలసివచ్చును. కనుక రాగద్వేషములను రెండునూ త్యాజ్యములే. రెండునూ వదలినవాడే నిజమగు విరాగి.

శబ్దాది విషయానందమును కల్గించు వస్తువులను భార్యాపుత్ర బంధుమిత్రాదులను వదలుటయే సన్యాసము. విషయానందము కూడ ఆనందమేకదా? "రసోవైసః" బ్రహ్మానంద స్వరూపుడని చెప్పబడుచున్నాడు కదా! కనుకనే విషయానందముకూడ బ్రహ్మానందములో భాగమేనన్నారు గదా! మరియు ఆనంద కారకమగు వస్తువులయందు వైరాగ్యమెందుకు పూనాలి వానినెందుకు త్యజించాలి అను ప్రశ్నకు ఏవస్తువుకున్ను పారమార్థిక సత్యత్వములేదు. సర్వమునశ్వరమే అయివున్నది. నాశన శీలమైన ఆయావస్తువులవల్ల కల్గు యానందమున్నూ క్షణికమే. శాశ్వతానంద స్వరూపమగు బ్రహ్మానందము కోరువాడు అశాశ్వత పదార్థములయందు వైరాగ్యం పూనాలి అని జవాబు చెబుతున్నారు.

కార్యరూపమగు జగత్తు అనిత్యము అని అంటే, జగత్తునకు కారణస్వరూపమగు బ్రహ్మము కూడా అనిత్యమే ననవలసి వుంటుంది. ఏలనంటే పుట్టుకకు ఏది కారణంగా నుంటుందో దానికిన్ని ఒక పుట్టుక నంగీకరించక తప్పదు. పుట్టిన దానికి నాశనమూ తప్పదుకనుక కారణ స్వరూపుడైన బ్రహ్మపదార్థమునకు కూడా నాశనముండవలసినదే, కనుక నే "నామరూప క్రియాస్పదమగు అంతర్బాహ్య ప్రపంచము అనిత్యమని తెలియుట కంటె, దానిని తెలియచేయు

చేతన బ్రహ్మమే అనిత్యమని దాని యందు యిచ్ఛలేకుండుటే వైరాగ్యము" అని శ్రీ దయానంద రాజయోగీంద్రులవారు రాజయోగీయ గ్రంథమందు నిర్వచించినారు. "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియంభవతి" ఆత్మయందలి ప్రేమ చేతనే సర్వము ప్రేమ కలుగుచున్నది. కనుక ఆత్మ యందు వైరాగ్యము కలిగినపుడు రాగద్వేషములు నశించును.

ఇతర సాంప్రదాయకుల కిది చాలా విరుద్ధముగా దోచును. ఇందేమియూ విరుద్ధము లేదు. ఎట్లనగా, రాగద్వేషములు అభిమాన జన్యములు, అభిమానము అహంకారమున కాది భౌతికము. అహంకారము శబ్దతన్మాత్ర వలన కల్గిన అంతరేంద్రియ పంచకములోనిది, పంచతన్మాత్రలన్నియు బ్రహ్మము (ఆత్మ) యొక్క స్థూల పరిణామములే, మూలకారణము నశించినగాని ఏదిన్ని నశింపజాలదనుట నిస్సంశయము. లేనిచో "తీసివేసిన కొద్దీ మొలుచుచునే యుండు" నని శ్రీ శివరామ దీక్షిత వాక్యము. కనుక మూల కారణమగు ఆత్మయందు ప్రేమ నశించనిచో, రాగద్వేషములు సమూలముగ నశించజాలవు. కనుకనే "రోసితి మోక్షాద్యపేక్ష రూఢిగవినుమినీవిట్టియా రూఢ తగనుమి" అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చి యున్నారు.

తాత్కాలికముగ, ఏ సంఘటన వల్లనో వైరాగ్యబుద్ధి యుదయించినను, అది స్థిరముగా నుండదు. అట్టివే 1. పురాణ వైరాగ్యము 2. ప్రసూతి వైరాగ్యము 3. స్మశాన వైరాగ్యము అనునవి. పురాణ పురుషుల దివ్య గాథలను శ్రవణము చేసినపుడు కలిగే వైరాగ్యబుద్ధి యెంతకాల ముండును? యింటికి వచ్చే వరకే కదా! అట్లే ప్రసూతి కాలేక బాధపడుచూ, తన ప్రాణమైననూ దక్కునో దక్కదో అను మహాభయంలో కలిగెడు, భర్తృ సుఖమందలి విరక్తి బిడ్డను చూచుకొన్న మరుక్షణములో ఏమైపోవుచున్నది? కట్టెలలో కాలిపోవు కాయముయొక్క దుర్గతి స్వయంగా చూచి, చూచిన పదుగురూ చేసెడి వేదాంత ప్రసంగములు విని, తనలో కల్గిన వైరాగ్య మెంతకాల ముండును? బుద్ధభగవానుడంతటివాని కెవ్వనికోగాని, జన్మ మృత్యుజరావ్యాధుల దుఃఖదోషాను దర్శనమువల్ల తీవ్ర వైరాగ్య ముదయించజాలదు.

బుద్ధభగవానుడు, ప్రపంచమందున్న దుఃఖమును జూచినాడు. ఆ దుఃఖకారణమేది. అని అన్వేషించి తృష్ణయే (ఆశయే) దుఃఖకారణముగా గుర్తించినాడు. ఆశపడే మనస్సు ఆత్మ పరిణామమే. అన్నిటికీ ఆ యాత్మయే మూలంగాని దానికి మాత్రం మూలంలేదు. దానియందలి ప్రీతిచేతనే సర్వమూ ప్రేమపాత్రమై యుంది. కనుక ఆత్మ ప్రేమ నశించిన గాని రాగద్వేషాలు డుగవు. "మోక్షమెట్లు సిద్ధించును?"

అనే ప్రశ్నకు "త్యాగేనైకే అమృతతత్వమానశుః" అనగా ఒక్క త్యాగము చేతనే అని సమాధాన మీయబడినది. త్యాగమనగా దేనిని త్యాగము చేయవలెను? కాశీ వెళ్లి కాకరకాయ కూర మొదలైన అయిష్ట వస్తువులను త్యాగం చేస్తే సరిపోతుందా? లేక నచికేతో పాఖ్యానములోని వాజశ్రవునివలె పాలివ్వనివి, పళ్ళూడినవి, పదిరోజులలో ప్రాణం పోయేవి యగు గోవులను దానముచేసిన అది త్యాగమగునా? అన్నిటికన్న తన కత్యంత ప్రీతిపాత్రమైన దానిని త్యాగము చేసిననే అది నిజమైన త్యాగం కాగలదుగదా! స్వాత్మకంటెనూ యిష్టమైనదేది? ఆత్మత్యాగమే గొప్పత్యాగము. ఆత్మత్యాగమంటే ఆత్మాహుతి.లేక ఆత్మ హత్య అని పొరపడరాదు. ఆత్మత్యాగమే

నిజమైన స్వార్థత్యాగము. ఎట్లనగా స్వార్థము = స్వ+అర్థము = తాననే వస్తువు. ఏలననగా తనదని చెప్పుకొనేది మరేది యీ ప్రపంచమున లేనేలేదు. సర్వము నిటనే వదలి పొవు చున్నాడు. తనదేమైన తనతో వెడుతోందా?

కం॥ ఏ యాపేక్ష జనించిన,
అయాపేక్షెల్లమాయ యని తెలియదగున్
ఆయాసమౌను దానను,
ఛీయని యది విడువదగును క్షేమముకొరకై॥

అన్నారు, శ్రీకృష్ణ దేశికేంద్రులవారు. అప+ఈక్ష = అపేక్ష కనుక అపేక్ష అనగా చెడ్డ చూపు. లేక దోషదృష్టి, ఈ దోషదృష్టి ఎట్లు కల్గును? అంటే ఆ దోషము దృక్కుదే లేక ఆత్మదే. అని అనవలసివుంటుంది. కారణమేమనగా- దోషమే ప్రవృత్తి కారణం. యీ దోషము సర్వ కారణమగు ఆత్మయందు ద్వయదోష రూపంగా నున్నది. అట్టి దోషముండుటవల్లనే తానే పరిపూర్ణ బ్రహ్మముననే భ్రాంతిలో ముంచుచున్నది. ఎట్లనగా చలాచలములు రెండూ తానే, అందచల లక్షణము చూచినవారు అదే పరిపూర్ణ బ్రహ్మమని చలన లక్షణము మాయ అని అనుకొంటున్నారు. కాని చలనమంటే పరిపూర్ణ పరబ్రహ్మ మెట్లు కాగలదని విచారించుటలేదు గదా! కనుక యీ దోష దృక్కే, దోషదృష్టికి అనగా సర్వ అపేక్షలకు కారణమై యున్నది. కనుక దోష స్వరూపమగు ఆత్మయొక్క స్థాన స్వరూప స్వభావములు వస్తు నిశ్చయముగా గుర్తించి, దోష దర్శనముచేసి విరక్తి దోష దర్శనాత్ అనే న్యాయంగా ఆత్మ ప్రేమను త్యాగము చేయవలసి యున్నది. మరిన్ని ఇచ్ఛారాహిత్యమే స్వచ్ఛమగు బోధయన్నారు కృష్ణదేశికేంద్రులు. ఉన్నదున్నట్టుగా పడ్డందుకు యిచ్ఛారాహిత్యమే తార్కాణం అన్నారు దీక్షితులవారు. యిచ్ఛా ప్రయత్నాది చతుర్వింశతి గుణములకు స్థానభూతమైన వస్తువునకు పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలముగాని, స్థానముగాని లేదని క్షణమైన మరువకుండా గురునిష్ఠలో నున్నపుడే నిజమైన వైరాగ్యం.

శాస్త్రములందు "సంసారయాథాత్మ్యావబోధ" ముంటే వైరాగ్యం కలుగునని చెప్పబడింది. అంటే, సంసారము యొక్క సంగతి వున్నదున్నట్లుగా తెలిసితే వైరాగ్యము కలుగునని భావము. భార్యాపుత్రాదులతో గూడిన బాహ్య సంసారమా? సంస్కారాలకు స్థానమైన అంతఃకరణ రూపమగు అంతస్సంసారమా? లేక యీ రెంటికీ యత్యంత మూలమై అనాది సంసారమని చెప్పబడే మూలంలేని యీ గుర్తెరిగే శరీరమా? యిందే సాంసారం సంగతి పూర్తిగా తెలియాలి? అంటే పూర్ణబోధచే అనాది సంసారము సంగతి తెలిస్తేగాని వైరాగ్యము కలుగదని తెలియవలెను.

పరిపూర్ణబోధచే వున్నదున్నట్లుగా గ్రహించిన రాజయోగి, అందరివలెనే అన్ని కార్యములు చేస్తాడుగాని దేనినీ వర్జింపడు. ఐనను అవేమియు నాతని బంధింపవు. అతని అంతఃకరణము ఆకాశమువలె ఎప్పటికప్పుడు స్వచ్ఛంగా వుంటూవుంటుంది. స్వార్థప్రేమయే లేకుండా అనుభవించిన విషయోపభోగము లేమియు బంధకారణములు కావు. విషయోప భోగము వలన విషయేచ్ఛ చల్లారునా? నెయ్యిపోసి అగ్నిని ఆర్పజాలుదుమా? అని ఎవరైన

శంకింపవచ్చును. కాని యిక్కడ అనుభవించేకర్తలేడు. కర్తృత్వ త్యాగము గల్గి యదృచ్ఛాలాభ సంతుష్టితో భోగములనుభవించిననూ అనుభవించనివాడే యగుచున్నాడు. వాని అనుభవము'ఆగామి' ఫలమునుత్పత్తిచేయదు. అట్టి రాజయోగి సుఖంకావాలి, దుఃఖము పోవాలి. అని ఆసించడు. మోక్షమని చెప్పబడే "అనర్థ నివృత్తి, ఆనందావ్యాప్తి" అనువానిని గూడా ఆసించడు. కనుక మోక్షాద్యపేక్షకూడా అతనికి లేదని చెప్పబడినది. అట్టి రాజయోగ ఠీవితో 'పరిపూర్ణత దనరువానికి సాటిగలదా యీ భువినీ," అని శ్రీకృష్ణదేశికేంద్రుల వారి వాక్యము. ఇదంతయు మాటల వేదాంతముగా యితరులకు దోచవచ్చునుగాని గురుకృపా పాత్రులకిట్ట ఆరూఢత సిద్ధించుననుటలో యెట్టి సందియము లేదు.

# తత్వము

తత్వము అనగా, సూక్ష్మాతి సూక్ష్మముగా నుండి అన్నిటిని తనయందు బీజరూపం చెందించుకొని సృష్టికి పూర్వమున్నదేదో అదే తత్వము. తత్వము అనుమాటకు స్వభావము అని కూడా అర్థమున్నది. సృష్టికి పూర్వమున్న మూలపదార్థము అవ్యక్త మహదాది పరిణామ వికాసము చెందినది. పంచతన్మాత్రాదికముగా ప్రవర్తించి ప్రపంచమైనది. కనుక అన్నియు ఆ మూలతత్వమే. ఐనను స్థూల రూపముగా పంచేంద్రియ గోచరముకాని వస్తువులన్నిటినీ తత్వములని వాడుట పరిపాటి. అంతేకాదు, యీ తత్వములను వర్ణించుచూ వ్రాయబడిన కీర్తనలకుకూడా తత్వములని పేరు వచ్చింది.

ఒక్క మూలతత్వమే అనేక తత్వములుగా అయినది. ఐతే యీ కారణ కార్యరూపములుగా నున్న తత్వములెన్ని? 25 తత్వములుగా కొందరూ, 36 తత్వములుగా కొందరు, 96 తత్వములుగా మరి కొందరూ వానిని విభజించినారు. వేయి తత్వములుగా లేక లక్ష తత్వములుగా విభజించినా విభజించవచ్చును. కనుక యీ తత్వములుయివే. యింతకంటె ఏమీ లేవని చెప్పరాదు. వీనినన్నిటిని గూర్చి విచారించి విమర్శించుటే తత్వ విచారణ. షడ్దర్శనములలో మూడవదగు సాంఖ్యదర్శనము పూర్తిగా ఈ తత్వవిచారణ గావించియున్నది. కపిలమునియే దీనికికర్త. ఉత్తమ పురుషుడు లేక పురుషోత్తముడు, అక్షరక్షర, రూపములుగానూ, శక్తి ద్వయరూపము గానూ తానే యెట్లయియున్నాడో, జగత్సృష్టిస్తితి లయములకు తన మహత్తుచే యెట్లు కారణభూతుడైయున్నాడో, కర్తృత్వభోక్తృత్వములెట్లు కల్గియున్నాడో, పరాపరాకృతులుగానూ, నవవిధద్రవ్యములుగానూ యెట్లు పరిణామం పొందినాడో, పంచత న్మాత్ర స్వరూపంతో పంచీకృత విదానంగా ప్రపంచరూపమునెట్లు వహించినాడో యిత్యాది విషయములన్నియు తత్వ విచారణవల్ల తేట తెల్లమగును.

సంఖ్యానీకముతో గూడుకొన్నందున సాంఖ్యమని కొందరూ, చక్కగా విచారించి చెప్పునది కనుక సాంఖ్యమని కొందరూ, దీనిని నిర్వచించినారు. దేనిని చక్కగా విచారించును? అంటే, ఆత్మతత్వమును వివరించును. ఈ ఆత్మ తత్వ వివరణ ఏల అవసరము? అనగా అత్యంత దుఃఖనివృత్తియే మోక్షము. దుఃఖము ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆది దైవికములుగా

నున్నది. ఉన్నదున్నట్లుగా తెలిసికొనక ఒక వస్తువుగా తెలుసుకొనుటవల్ల దుఃఖము కలుగును. ఉదాహరణకు రజ్జు సర్పము, స్థాణు పురుషుడు భయభ్రాంతులను కల్గించుచున్నవి. తానెవ్వరో మరచి తాను జీవుడనని దేహినని భ్రాంతి చెందుటవలన దుఃఖమున బడుచున్నాడు. యీ దుఃఖనివృత్తి అగుటకు తనయొక్క యదార్థరూపమును తెలుసుకొనవలసియున్నది. తాను దరిద్రుడు కాడు తన పూర్వీకులు గడించిన ధనము తన ఇంటనే పాతిపెట్టబడియున్నదని తెలుసుకొన్నపుడు దారిద్ర్య దుఃఖముండదు గదా! అట్లే తాను నిస్సంగ స్వరూపుడగు ఆత్మయేగాని దేహేంద్రియాదులచేతను దేహసంబంధీకులగు భార్యాపుత్రాదులచే తను కూడుకొన్న సంసారలంపటుడను కాను అను జ్ఞానమారూఢమైనచో దుఃఖము పటాపంచలగును.

నిస్సంగుడగు పురుషుడే ఆత్మ ప్రకృతియే వికృతి (వికారము) చెందుటచే జీవేశ్వర జగత్సృష్టికి కారణభూతమైనది. ఈ ప్రకృతి పురుషుల యదార్థజ్ఞానము కలిగించుటే సాంఖ్యము యొక్క ప్రయోజనము. తత్వ విచారణవలన ఫలము.

25 తత్వములుగా విభజించబడిన పద్ధతియే సాంఖ్యమందు ముఖ్యముగా పరిశీలించబడినది. ఆ యిరవై ఐదు తత్వములు ఏవి?

1) సత్వరజస్త మోగుణములు మూడున్ను సామ్యావస్తయందున్న ప్రకృతి.

2) దాని వికృతి (వికారము) మహత్తు

3) దాని వికారమగు మహదహంకారము.

(4,5,6,7,8) పంచన్మాత్రలు శబ్ద స్పర్శరూప రసగంధతన్మాత్రలు (9 లగాయితు 19) వానినుండి వికృతి చెందిన జ్ఞానేంద్రియము లైదు. కర్మేంద్రియములైదు. మనస్సు అను ఏకాదశేంద్రియములు. 19 లగాయితు 24 పృధివ్యాపస్తే జోవాయురాకాశములనే పంచ భూతములు, 25 పురుషుడు ఈ యిరవై అయిదున్ను తత్వములుగా నిర్ణయింపబడినవి క్లుప్తంగా చెప్పాలంటే..

అష్ట ప్రకృతులు, షోడశ వికారములు, పురుషుడు యిరవైదు తత్వములు అని చెప్పివేయవచ్చును. అష్టప్రకృతులు పంచతన్మాత్రలున్ను సమిష్టి మనోబుద్ధ్యహంకారములున్నూ షోడశ వికారములు = పైన చెప్పిన ఏకాదశేంద్రియములున్నూ పంచభూతములున్నూ ప్రకృతి వికృతులకు భిన్నంగా, విలక్షణంగా, జ్ఞాన సంపత్తితో అసంగుడైయున్న వాడు పురుషుడని సాంఖ్యము నిర్ణయించును.

పురుషుడైన బ్రహ్మమునందు త్రిగుణాత్మికమాయలేకనే. తోచినదని జగత్తు మాయా పరిణామమనీ కనుక మిధ్యయనీ వేదాంతులు వాదింతురు. పురుషుడు అసంగుడు అంతా ప్రకృతి వ్యవహారమేనని సాంఖ్యులు వాదింతురు.

ఈ రెండు వాదముల సమన్వయము గావించి పరిపూర్ణ భావజ్ఞులు, పురుషుడఖండ జ్ఞాన స్వరూపము గనుక దానికి ఎరుక అని పేరిడి "అకాశాధిక భూతానీకాత్మమగుచు యెరుక యీ జగమయ్యేన్" అనిన్ని, "ఎరుకైన భూతముల నీవెరుగుము అకసము, గాడ్పు, యింగలము, నీళ్ళి రవందనేలయని నేనెరిగిన పద్ధతిని నీకు యెరగించినానూ, ముజ్జగములయ్యెను వీట్లతోను"

అని పల్కినారు. పురుష ప్రకృతులు రెండూ ఒకే యెరుకయొక్క రూపములు. ఈ నిర్ణయ విధానమునందు పంచభూతములు, పంచతన్మాత్రలు, పంచశక్తులు, పంచబీజములు, పంచఅధిష్ఠాన దేవతలు యీ యిరవై అయిదున్ను చెప్పబడినవి. బ్రహ్మము లేక ఆత్మ వీనికన్నిటికి కారణమై వీనికి సూక్ష్మముగనున్నది. యిదంతయూ బ్రహ్మాండ విచారణకు సంబంధించినది. పిండాండమందలి 25 యింద్రియములు పంచతన్మాత్రల నుండి ప్రభవించినవి. భద్రాద్రి శతకములో యివి సీ॥ ఆకాశ పంచక మంతరేంద్రియములు! ప్రాణాదులను వాయపంచకంబు॥ అనే పద్యములలో చక్కగా చెప్పబడినవి. ఈ 25 యింద్రియముల కతీతముగా చెప్పబడిన ప్రత్యగాత్మయే పరమాత్మ అని తెలిపినారు. ఆ పరమాత్మను తెలియుటకు బ్రహ్మాండవిచారణ చక్కగా చేయవలయును. ఆ పరమాత్మ భూతయోని యని శృతిస్మృతులు చెప్పుచున్నవి. భూత యోని అను శబ్దము పరమాత్మకన్వయించునా? లేక ప్రకృతి కన్వయించునా? అను సమస్యకు సాంఖ్యులు ప్రకృతే భూతయోని అన్నారు. కాని వేదాంతులు పరమాత్మ భూతయోని యని సూత్రభాష్యమందునిర్ణయించినారు. పురుష ప్రకృతులుగా గానవచ్చేది ఒకే వస్తువైనపుడు ఎట్లు నిర్ణయించినా బాధలేదు. అదే పిండబ్రహ్మాండములయందు ఖండాఖండములుగా గనిపించు ఎరుక. దానిని చూచి అదే బ్రహ్మమని కొందరు భ్రాంతి చెందినారు. అది అఖండయెరుక మాత్రమేనని తెలియుటయే తత్వవిచారణకు ఫలము, అని పూర్ణ భావజ్ఞుల తాత్పర్యము.

ఈ అఖండ యెరుకయే పరాప్రకృతుల రూపంగాను, క్షరాక్షర రూపములుగానూ యున్నది. వైశేషిక దర్శనము, ద్రవ్య, గుణ, కర్మ సామాన్య, విశేష, సమవాయ అభావములను ద్రవ్యలక్షణములు, పృధివ్యాధి పంచభూతములు, కాలము, దిక్కులు అనే వస్తువుల యందె గాక ఆత్మయందుగూడా గాన వచ్చుటచే నవవిధ, ద్రవ్యవిచారణయందు ఆత్మను కూడా ద్రవ్యకోటిలో చేర్చినారు కనుక ఆత్మాతీతమైనదే కేవలాత్మయగు పరిపూర్ణ పరబ్రహ్మమని ఋజువుకాగలదు.

ఆత్మయొక్క స్థానస్వరూప స్వభావములను ప్రత్యక్షముగా గుర్తించుటయే తత్వ విచారణకు లక్ష్యము. ఆ ఆత్మ స్వరూపుడే తాను. ఆదియందు అఖండ యెరుక స్వరూపుడై అనగా పురుషోత్తముడై క్షరాక్షర రూప పరిణామములు చెంది శక్తిద్వయ రూపమగు ఆవరణలు కల్గియున్న యెరుక స్వరూపుడు తాను. తనకన్యమైనది. పరిపూర్ణ పరబ్రహ్మము. కనుక పరిపూర్ణ మెరుగుటకు యెరుకనెరుగుటకు యెరుకను విడిపించుటకూ కూడా యీ యెరుక విచారణ గురుముఖాతః వస్తు నిశ్చయ పూర్వకముగా చేయుట కెంతో అవసరమైయున్నది.



# ముముక్షత్వము

ముముక్షత్వ మనే సాధన లేకుంటే నేమి? బ్రహ్మవిద్య కధికారి కాజాలడా? అంటే మొదటి సాధనమగు నిత్యానిత్య వివేకంవల్ల, నిత్యమైనదొక్క బ్రహ్మమేయనీ, మిగతా నామ రూపాత్మకమైనదంతా అనిత్యమేననీ, తెలియుట వలన దారా పుత్ర ధనకనక వాహనాది వస్తు సంపత్తియందు వైరాగ్యము కల్గుచున్నది. అట్లే లోకాంతర సుఖకారక వస్తువులన్నిటి యందూకూడ నిస్పృహ కలుగుచున్నది. కాని కోపతాపాలు నివర్తించకపోవుటచే శమాది షట్కసంపత్తి అవసరమైనది. అందువలన శాంతి వృత్తి కల్గిననూ ముముక్షత్వము లేక పోవుట వలన ఆత్మ సాక్షాత్కారము పొందవలెనని గాని, అందు కొరకై గురువు నాశ్రయించి శ్రవణమన నిధి ధ్యాసలు చేయవలెననిగాని, తద్రీత్యాగాక, మూలజ్ఞానము మరొక రీతిగా తొలగదనీ తెలియక గురుని ఆవశ్యకతనే అతడు గుర్తించుటలేదు. అట్టివారు సంసారమును త్యజించి యోగులమని సాధులమనీ యూరూర తిరుగుచూ కాలక్షేపము చేయుచున్నారే గాని గురువు నాశ్రయించుటయే లేదు.

తీవ్ర మోక్షేచ్ఛ యున్నదంటే, బంధము యొక్క బాధలేవో బాగా నాటుకొన్నాయన్న మాట. లేకుంటే ఆ బంధమునుండి ఎవరు తనకు మోక్షం కలిగింతురూ యను తహతహ కల్గనేకలగదు. ఆ బంధ కారణమేదో దానిని తొలగించగల సమర్థు లెవరో అనేది ఆలోచన లోనికేరాదు. కాని తీవ్ర మోక్షాపరునికో? సద్గురు సందర్శన లభ్యమగుట ఆలస్యమైనకొలదీ నిర్వేదము హెచ్చును. విషాదము పెరుగును. అర్జున విషాదయోగములో నిర్ణయించ బడిన రీతిగా నిస్పృహ నిరాశలతో నిర్వీర్యుడై చతికిలబడవలె. "ఈ షణత్రయ లోలుడవై దారా పుత్ర ధన ధాన్యములకై ఎంతో పరితపించి ఏడ్చుచున్నావే, నీ సంసార బంధ విమోచనకై ఒక్కనాడైన. ఒక్క పది నిమిషములైన ఏడ్చితివా?" అని రామకృష్ణ పరమహంస అడుగుచుండెడివారట. కాళీ సమక్షంలో "తల్లీ నీ దర్శనము కాకుండా మరోదినము వృదాగా గడచి పోయేనే" అని దినములకొలది నిద్రాహారములు మాని ఆయన రోదించినారట. శ్రీరామకృష్ణ పరమహంస దర్శన భాగ్యముతో శాంతిపొందే వరకు మతములన్నియు గాలించి మహాత్ములందరి వద్దకు పరుగెత్తి "భగవంతుని చూచితివా? నాకు చూపగలవా? అని వెర్రెత్తి తిరిగిన వివేకానందుని దృష్టాంతముకూడా తీవ్ర మోక్షేచ్ఛకు నిదర్శనమే.

బంధమనేది ఏదో కూడా తెలియకనే మోక్షం కావాలి, మోక్షం కావాలి అనే కోరిక మాత్రం అందర్కి యుండవచ్చు. అది నోటి ఆకలివంటిదే గాని నిజమగు ఆకలికాదు. అట్టివాడు శ్రవణాధికారికాడు.

ఇక్కడ నొక ముఖ్య విషయమును గుర్తించుకొనవలెను. ఏమనగా, శమాది షట్కములోని "శ్రద్ధ" అనే శబ్దానికి "వేదాంత శాస్త్రముల్ విని విమర్శించి సద్గురునందు భక్తి గల్గుటయు శ్రద్ధ" అని ఒక విధముగా అర్థం చెప్పబడింది యిందు "విని" అన్నారు కదా! సాధన చతుష్టయ సంపత్యనంతరం శ్రవణ మనన నిధి ధ్యాసలు చేయాలి అంటున్నారే.

ఆ"వినుట"కు, "శ్రవణం" చేయుటకు తేడాఏమి? అను శంక కలుగవచ్చును. మొదటిది సాధన చతుష్టయ సంపత్తి కల్గుటకై చేసే పూర్వ సాధనలోని శ్రవణము. రెండవది సాధన చతుష్టయ సంపత్యనంతరం "తత్వమసి" మహా వాక్యమును, వుపదేశ రూపంగా గురుముఖతః శ్రవణం చేసి వాక్యార్థమును మనన నిధి ధ్యాసలు చేయుట వేరే ప్రకరణమునకు సంబంధించినది. ఈ వుపదేశ పద్ధతి శుక రహస్యోపనిషత్ నందు వివరింపబడినది.

తానే బ్రహ్మము అని, అరూఢ జ్ఞానము కలుగుటయే బ్రహ్మ విద్యా ఫలము. ఈ ఫలప్రాప్తి మహా వాక్యార్థ జ్ఞానముచే కలుగుచున్నది. ఈ జ్ఞానము గురుని ద్వారా సాధన చతుష్టయ సంపత్తి గలవానికే లభ్యమగు చున్నది. కనుక "ముముక్షత్వము లేనిచో ప్రయోజనము లేదు. ఒకప్పుడొక గురువు శ్రుత్యక్తి అనుభవములను జోడించి, మహా వాక్యార్థమును అన్వయ వ్యతిరేక యుక్తులతో ఎంతో చక్కగా ఉపన్యసించిన పిదప, తనకెదురుగా కూర్చునియున్న శిష్యునిజూచి "ఓరీ ఏమైన పట్టినదా?" అని అడిగేనట. అందుకా శిష్యుడు "చిత్తం స్వామీ! అంతా పట్టినది గాని, తోక మాత్రం యింకా బయటికి తొంగి చూస్తూనేవున్నది" అన్నాడట. "అదేమిట్రా" అంటే, యెదుట గోడ రంధ్రములో దూరిన యెలుకను చూపెనట. తీవ్ర మోక్షేచ్ఛయున్న వానికిట్టి చిత్త విక్షేపముండదు కదా!

ఈ సాధన చతుష్టయ సంపత్తి కేవలం అంతఃకరణకు సంబంధించినది.వివేక వైరాగ్యాది సాధనల ప్రభావము అంతఃకరణ మీదనే పనిచేయును గాని బాహ్యమందెట్టి మార్పునూ తెచ్చిపెట్టదు. కనుక వేషబాషల చూచి మోసపోరాదు. వాని ప్రయోజనమున్నూ ఏమీలేదు. అంతఃకరణమే మార్పు చెందవలెను.

నేటి జిజ్ఞాసువులలో, ముఖ్యంగా పూర్ణబోధ నాశించి గురువులను చేరిన శిష్యులలో యిట్టి అంతఃకరణ మార్పున్నదా? లేనిచో మహా వాక్యోపదేశమునకే అధికారులు కారే! వారికి పూర్ణబోధ యేమి? అని సహజంగా ఒక ప్రశ్న ఉదయించును.

పూర్వజన్మ సుకృత విశేషం చేతనే కొందరికి పుట్టుకతోనే యిట్టి అధికారి లక్షణముండ వచ్చును. మిగిలిన వారంతా పురుష కారముతో యీ జన్మలోనే కృషిచేసి అధికారులు కావలసియున్నది. సన్యాసములో రెండు విధములున్నవి. (1) వివిదిషా సన్యాసము (2) విద్వత్స న్యాసము. అంటే సన్యసించి పిమ్మట బ్రహ్మ విద్యను సముపార్జించుట మొదటిరకం. విద్వాంసుడై పిమ్మట సన్యసించుట రెండవ పద్ధతి. అట్లే ఎట్టి అధికారం లేకుండానే గురునిచేరి పిమ్మట గురూప దిష్టమార్గమున నడచి కృషిచేసి శ్రవణాధికారియై, పిదప పరిపూర్ణ బోధగ్రహించుటకు అధికారియగు పద్ధతి యొకటి. సర్వమూ ముందే తెలుసుకుని పిమ్మట గురువును చేరి, వస్తు నిశ్చయ పూర్వకముగా పరిపూర్ణబోధ తెలియుట రెండవ పద్ధతి. ఈ రెండవ పద్ధతిగా పూర్ణబోధ గ్రహించువారు ప్రసుత్త కాలములో కొంచమించుమించుగా లేరని చెప్పవచ్చును. మొదటి పద్ధతిగా కృషిచేసేవారే ప్రస్తుత శిష్యులు నూటికి నూరుమంది కూడా. ఐతే వీరిలో ఉత్తమః మధ్యమ, అధమ, అధమాధమ తరగతుల వారుండవచ్చును. సచ్ఛిష్యుడైయుండి, సమర్థుడగు గురువుండినేని "పదుగురు నిను జూచి భళీ శబాస్ ఈ త్రోవ కెదురు లేదనేటట్లు ఇదిగో

నేచేశేద" నని ప్రతిజ్ఞ చేయవచ్చును.

కనుక అయ్యో! నాకా తీవ్రమోక్షాపేక్షలేదే" అని యెవరున్నూ మొదట్లోనే నిస్పృహ చెందవలసిని పనిలేదు. గురు భక్తునికి ఎన్నడూ ఎట్టి లోపమున్నూ యుండబోదు. గురుని అనుగ్రహ ప్రసాదం చేతనే శిష్యుని అంతఃకరణశుద్ధి కాగలదు. వివేక వైరాగ్యాది సమస్త అధికారములున్నూ చేకూర గలవు. హరి భక్తుడైన ప్రహ్లాదునికి "సద్గుణంబు లెల్ల సంఘంబులైవచ్చి అసుర బాలకునందు అలుముకొనియె" నట. అట్లే గురు భక్తునికి సర్వార్థసిద్ధి కాగలదు. ఐతే "సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ" అన్న గీతా చరమోపదేశమే శరణ్యంగా గ్రహించి" శ్రద్ధాభక్తి ధ్యానయోగాత్" అన్నరీతిగా గురూపాసన మాత్రం చేస్తే "దిద్ది తీరిచి బోధ తెరువు జూపును" అనుటలో యెట్టి సందియమూనూ లేదు.

మోక్ష మందలి యిచ్ఛ తప్ప యీతరాపేక్ష లేకుండుటే ముముక్షత్వమని కొందరన్నారు. నిజమే మిగతావన్నియు అపేక్షలే. అనగా అప+ఈక్ష=అపేక్ష=తప్పు చూపు అనే అర్థములో మిగతావన్నీ అపేక్షలే అనుకుందాం. మోక్షమందలి కామ్యము గూడా నొక కామమే గదా? యిక నిష్కామ కర్మ చేయుట మేలాగు. అంటే, బంధించునని కామ్యములే. కనుక మోక్షము నిష్కామ్యమైనదే అనగా కోరికలనే బంధము నుండి విడుదల అన్న మాటనుక నిష్కామమును గోరుట కామ్యము కాజాలదు. ఐతే "కేవల మోక్షాపేక్ష సంకల్పో బంధః" అని నిరాలంబోపనిషత్ పల్కుచున్నది. యిది సమన్వయమెట్లు? అంటే సంకల్పమే బంధము నిస్సంకల్పమే మోక్షం. నిస్సంకల్పమంటే సంకల్ప మేమీ చేయక వూరుకొనుట (నిద్రా, మూర్ఛ, సమాధి స్థితులలో వలె) కాదు. సర్వ సంకల్పములు చేయుటకు మూల కారణమైన యెరుక సకల కార్యప్రయత్న జనకమగు వస్తువు రహిత స్థితియే కేవల నిస్సంకల్పము. ఈ స్థితి నుండి యిక తిరిగి చ్యుతి లేదు. దీనికే పరిపూర్ణ పరబ్రహ్మమని పేరు. యిట్టి పరిపూర్ణబోధ సందర్భములోనే "కేవల మోక్షాపేక్ష సంకల్పో బంధః" అని శృతి చెప్పినది. బంధ మోక్షములు రెండూ మిధ్యయే అనేది ఈ స్థితిలోనే, ఇట్టి అతీత స్థితియందు మాత్రమే. మోక్షాపేక్షకూడా నొక అప+ఈక్ష (చెడ్డచూపు) అగుచున్నది. ఈ దృష్టితోనే శ్రీమద్భాగవతుల కృష్ణదేశి కేంద్రులవారు కం॥ ఏయాపేక్ష జనించిన ఆయాపేక్షెల్ల మాయమని తెలియదగున్, ఆయాసమౌను దానను, ఛీయని యవి విడువ దగును క్షేమము కొరకై.



# మౌనము

అన్ని జీవోపాధుల శరీరముల యందునూ, మనస్సు వాక్కు, శరీరము అను ముఖ్య మైన మూడంగములు ఏదో ప్రమాణంలో నున్నవి. అందు మానవునియందు యీ త్రికరణములు పూర్ణ వికాసము చెంది యున్నవి. వానిలో మనస్సు భావనారూపంగానూ(లేక సంకల్ప రూపముగాను), వాక్కు వ్యవహార రూపంగానూ, శరీరము క్రియా రూపముగానూ కర్మ లొనర్చుచున్నవి. యీ మూడు కర్మలూ వుత్తరోత్రా ఒకదాని కంటె నొకటి స్థూలముగా గానవచ్చు చున్నవి. ఇందు మనస్సు మిగతా రెంటితోనూ కూడకుండానే వ్యవహారము చేయగలదుగాని వాక్ శరీరములు మాత్రము మనస్సుతో కూడియే వ్యాపారము చేయుచున్నవి. ఏమైననూ వాక్కు లేకపోయినా మనస్సు యొక్కయు శరీరము యొక్కయు వ్యవహారములకు యెట్టి భంగమున్నూ వాటిల్లదు. కనుకనే మూగివాడు కూడా తనభావములను యితరులకు సూచించి దేహయాత్ర సాగించగలగుచున్నాడు. ఇది కేవలము పశుపక్ష్యాదులు జీవ యాత్ర చేసినట్లే అగును గాని, కవి, పండిత, వుపన్యాసకులవలె తన వాగ్వైచాలిచే భావ ప్రకటన చేయజాలడు. తన భావములను తన రచనల ద్వారా యితరుల కందీయవచ్చును గదా! అంటే అది చదువుకొన్న అల్ప సంఖ్యాకులకు మాత్రమే చిక్కగలదు.

ఏదో వొక భాషలో మాట్లాడ నేర్చినవాడట్లుమాట్లాడక వూరకుండుటయే మౌనము అని వాగ్మౌనమును నిర్ణయించవచ్చును. ఐతే వాక్కు పర, పశ్యంతి, మధ్యమ,వైఖరీ అను నాల్గు విధములుగా నున్నది. పరావాక్కు రాళ్ళయందును పశ్యంతి వాక్కు తరు లతాగు ల్మాదులయందునూ, మధ్యమా వాక్కు పశు పక్ష్యాదుల యందును, వైఖరీ వాక్కు మానవుల యందును గలదు. కాని విచారించి చూస్తే యీ నాల్గువిధవాక్కులూ కూడా ఒక్క మానవుని యందే గానవచ్చుచున్నవి. ఎట్లనగా, వా గ్రూపమైన వ్యవహారము జరగవలెనన్న తొలుత మాట్లాడవలెననే సంకల్పము, పిదప ఏ భాషలో ఎట్లు మాట్లాడుటయా అని ఆలోచనవుండును. అనంతరం కంఠస్థాన మందు స్వరపేటికలో అవ్యక్త రూపధ్వనులుత్పత్తి చెంది, నాలుక, దవడలు, దంతములు పెదవులు అనువాని కదలికలో వైఖరీ వాక్కు బయల్వెడలును. యిందు సంకల్పమే పరావక్కు ఆలోచనయే పశ్యంతి వాక్కు, అవ్యక్త రూపధ్వనులే మధ్యమావాక్కు. నోటి నుండి వెడలు మాటల వైఖరీ వాక్కు. కనుక యీ చతుర్విద వాగ్వ్యాపారమున్ను నిలచిపోయినపుడే, అది సంపూర్ణమగు మహా మౌనమని చెప్పబడును. మౌనత్రయమని మౌనము మూడు విధములు.

**1. కాష్ఠ మౌనము:** ఏదోవొక ఆసనమందు శరీరావయవములలో యెట్టి కదలిక లేకుండునట్లు శరీరమును కఱ్ఱవలె చలనము లేకుండగా నిలిపి యుండుట కాష్ఠ మౌనము. యిందు వాగింద్రియము తప్ప మిగతా కర్మేంద్రియ వ్యాపారము అరికట్టబడి యుండును.

**2. వాగ్మౌనము:** మాటల చేతనూ వాక్యముల చేతనూ తన భావములను ప్రకటించకుండా వూరకుండుట వాగ్మౌనమనబడును. సంజ్ఞలచేతగాని వ్రాతలోగాని చివరకు 'అ''ఉ' అను మధ్యమా రూపమగు ధ్వనులచే గాని భావ ప్రకటన చేసినప్పటికి యిట్టి మౌన వ్రతమునకు

భంగము లేదని భావింపబడుచున్నది. కనుక ఈ మౌనమును బహు సునాయాసముగా పాటించవచ్చును.

**3. అక్షమౌనము:** అక్షమనగా యింద్రియము కనుక యింద్రియములను మౌనము చెందించుట (అరికట్టుట) అక్షమౌనమనబడును. యింద్రియములు జడములు గనుక యింద్రియములు నరకట్టవలెనంటే యింద్రియములు ద్వారా ఏది వ్యవహారము చేయుచున్నదో దానిని అరికట్టినగాని యింద్రియ వ్యాపారమణగిపోదు. జ్ఞానేంద్రియముల ద్వారా మనస్సు శబ్దాది విషయ పంచకముగుర్తెరిగి కర్మేంద్రియముల ద్వారా కర్మచేయుచున్నది. కనుక మనస్సు యింద్రియములకు రాజు అన్నారు. రాజును స్వాధీన పరచుకొంటే రాష్ట్రమంతయూ స్వాధీన మగునట్లు మనస్సును అరికట్టితే సర్వేంద్రియములు స్వాధీనములో నుండును. మనస్సును అరికట్టుట అనగా మనోవ్యవహారమును నిలుపుచేయుట. సంకల్ప వికల్పములే మనస్సు యొక్క ఆది భౌతిక వ్యాపారము కనుక మనస్సును నిస్సంకల్పస్థితియందు నిలుపుట అనగా శూన్యస్థితిని చెందించుటే మనో మౌనము. కనుక అక్షమౌనమనగా మనో మౌనమనియే సిద్ధించుచున్నది. "యోగశ్చిత్త వృత్తి నిరోధః" అని చెప్పబడినది. మనో మౌనమన్నా, అక్ష మౌనమన్నా, చిత్తవృత్తి నిరోధమన్నా యొక్కటే గనుక యోగసాధనల వల్ల సమాధి లభ్యమైతే తత్కాల మందు మాత్రము యీ అక్షమౌనము సిద్ధించుచున్నది.

ఈ మౌనవ్రతము వలన, పశ్యంతి, మధ్యమ, వైఖరీ వాక్కులకు మాత్రము మౌనము (నిర్వ్యాపారత లేక నిష్క్రియతం) సిద్ధించుచున్నది. కాని మూడింటికీ మూలమగు పరా వాక్కు తాత్కాలికముగా నిస్సంకల్ప రూపముగా నున్నను, తిరిగి సహస్ర సంకల్పమునకు పుట్టిల్లై యున్నది. ఈ పరావాక్కు మరుపు, సుషుప్తి, మూర్ఛ, మరణ సమాధి ప్రళయముల యందు మాత్రము నిష్క్రియమై యున్నది. ఈ పరావాక్కునకు మూలముగాని స్థానము గాని లేనిదొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. అట్టి పరిపూర్ణ బోధయందు, ధ్వని మొదలగు తన్మాత్రలు కనుగొనగా లేశమైన గాన్పించి చోటును, బట్టబయలుగాని, యెరుక వీడిన వారికే మహామౌనమే సిద్ధించినదని చెప్పనగును.

సాధారణముగా ప్రతివారును అభ్యసించదగునదియు, అభ్యసించునదియు, వాగ్మౌనము మాత్రమే గదా! ఇది కేవలం నిష్ప్రయోజనమేనా యని సందియం కలుగవచ్చును. నోరు మూసుకొని వున్నప్పటికీ శరీరేంద్రియములు పని చేయుచునే యుండును. కనుక ప్రాణమనంబుల చలనస్థితి యుపశమింపలేదు. జ్ఞానేంద్రియములచే శబ్దాది విషయములను గ్రహించి కర్మేంద్రియములచే (ఒక్క వాక్కుచే తప్ప) కర్మ చేయుచునే యుండుటచే అంతఃకరణమందు నూతన సంస్కారములు ఏర్పడుచునే యుండును. అంతరేంద్రియ వ్యాపారము నిరాఘాటముగా సాగుచునే యుండును.

ఐననూ చిత్తశుద్ధితో పూనిన వాంగ్మౌనము కేవలమూ నిష్ప్రయోజనము కాదు. 1) శరీర మనస్సులకెట్లు విశ్రాంతి కావలెనో వాక్కునకునూ అట్లే విశ్రాంతి కావలయును. లేనిచో ప్రాణము క్షీణించును. కనుక వాంగ్మౌనము వలన ప్రాణ రక్షణ కాగలదు.

2) "ఊరుకొన్నవాని కూరెల్ల నోపదు" అని వేమన గారి వాక్యము, వాగ్మౌనమువల్ల యెవరితోనూ యెట్టి వాగ్రూప కలహములున్నూ రావు. యెదుటివారు తిట్టి తిట్టి వారే వూరు కొంటారు. అదే పనిగా యెదుటివారు తిట్టుచూ వుంటే, అంతా వింటూ మౌనవ్రత భంగమునకు వెరచి వూరుకొంటూ వుంటారు. కనుక మౌనవ్రతము వలన యెంతో సహన బుద్ధి (ఓర్పు) చేకూరగలదు.

3) ఇతరుల యందుండే విశ్వాసముచే ఎందరో తమ తమ రహస్యములను చెప్పుచుందురు. మౌనసాధన చేసిన వాడు అట్టి రహస్యములను గోప్యముగా నుంచుటకు సమర్థుడగును. తాను తెలుసుకున్న రహస్యములు బైటికిపోవు. వాచాలుడైనవాడెన్నడూ రహస్య గోపనము చేయజాలడు.

4) "అసత్య మాడకూడదు" అని ఎంతపట్టుదల వహించిన వానికైనా, జరిగినవిగాని, విన్నవిగాని పదిమాటలు చెప్పుటలో ఏదో ఎవరికీ బాధలేని యే చిన్న అసత్యమో, తనకు తెలిసియో తెలియకో, దొర్లిపోవుట జరుగును. మౌనవ్రతునకు యిట్టి అసత్య దోషము కూడా సంభవించదు.

5) గ్రంథ పరిశోధన వలనగాని యితరులు చెప్పుప్రబోధ వినుట వలనగాని తానెన్నియో విషయములు గ్రహించగలుగునుగాని, తానే మాట్లాడు చుండుట వలన ఏమియూ నేర్చుకొనజాలడు. వినుటకు రెండు చెవులిచ్చి మాట్లాడుటకు ఒక్కనోరే పరమాత్మ యిచ్చుటలో గల వుద్దేశమిదేనేమో!

6) "మాటలచేత భూపతులు మన్ననచేసి పురంబులిత్తురా మాటల చేత దేవతలు మన్ననచేసి వరంబులిత్తురా, మాటల చేత మానినులు మన్ననచేసి మనంబులిత్తురు" అంటూ కవులు వర్ణించినా మాటలచేత సాధించ దగినదంతా లౌకిక ప్రయోజనముతో కూడిన శ్రేయస్సేగాని పారలౌకికమగు శ్రేయస్సుకాదు.

పరిపూర్ణ భావజ్ఞులు మౌనమునకిచ్చు నిర్వచనమే వేరు. స్వార్థ రహిత సత్య సంభాషణమే నిజమగు మౌనము కాని, మూతి బిగించుకొని యూరుకొనుట మౌనము కాదని వీరందురు. "సత్యం బ్రూయత్, ప్రియం బ్రూయాత్, నబ్రూయాత్ సత్యమప్రియం" అనగా సత్యము చెప్పుము ప్రియమైన విషయమునే చెప్పుము. అప్రియమైనదగుచో సత్యమైననూ చెప్పదగ సుమా! అని యీ శృతి హెచ్చరించుచున్నది. రాజయోగి యీ శాసనమును పాలించి సమిష్టి శ్రేయస్సును, పరహితార్థమును కోరి స్వార్థరహితమగు సత్య సంభాషణ గావించుచుండును. సత్యము, ధర్మము, కాపాడుట పట్ల మౌనము వహించక ధైర్యముగా వుద్ఘాటించునే కాని మూగనోము పట్టడు. భీష్ముడు ధర్మరాజాదులకు ధర్మోపన్యాసము చేయుచుండగా ద్రౌపది పకపకనవ్వెనట. కారణము, ద్రౌపదీ వస్త్రాపహరణ సమయంలో భీష్ముడుండియు నోరుమూసుకొని మౌనము వహించుటయే గదా?



# స్వార్థము

స్వార్థము అనగా తనకొరకు అని సామాన్యార్థము. కాని స్వార్థము = స్వ+అర్థము అనగా స్వ=తనయొక్క అర్థము=వస్తువు అనగా తనయొక్క వస్తువు (తాననే వస్తువు లేక నేననే వస్తువు) ఈ నేననే వస్తువు యీ దేహమునందు నేను, నాది అను అహంకార, మమకారములకు హేతుర్భూతముగా నున్నది. అంతఃకరణతో కూడి జీవుడనీ, అంతఃకరణను విడచినపుడు ప్రత్యగాత్మయనీ, వ్యవహరింపబడుతోంది. స్థూలదేహమును అభిమానించినపుడు విశ్వుడనీ, సూక్ష్మదేహమును అభిమానించినపుడు తైజసుడనీ, కారణ శరీరమును అభిమానించినపుడు ప్రాజ్ఞుడనీ, మహాకారణ శరీరమును అభిమానించినపుడు ప్రత్యగాత్మయనీ, వ్యవహార నామములు వహించి యున్నది. ఈ నేనే అవస్థాత్రయము లందునూ అనువృత్త వస్తువుగా నుండియున్నది. ప్రాణము కూడ మూడవస్థలయందూ కానవస్తూన్నది. గాని అది తెలివిహీనమై యున్నది. అట్లుగాక "నేను" అనునది జ్ఞాన రూపంగా వుంటూవున్నది. మరియు సమాధియందు ప్రాణచలనము కూడ తాత్కాలికముగా నిలిచిపోవుచున్నది. మరణమందున పూర్తిగా పోయినది. కాని నేను అను ఆత్మయొక్కటే! సమాధి మరణములయందు సహితము లేకపోవుటఅనేది లేక యున్నది.

ఈశ్వరస్థానమందు ఈ ఆత్మయే "ఈశ్వరోహం" అని చెప్పబడుచూ కాలత్రయముల కును హేతువై జీవుల కర్మఫలములను కాలానుసారం కలిగించుచున్నది. నేనను ఆత్మయే సృష్టికి పూర్వము తాను తానుగా నిలచియుండి యొకానొకపుడు సృష్టికామనకల్గి ఏకమైన తాను అనేకములగు నామరూపాలను వహించుటయు చివరకు ఆట ముగించి సర్వసృష్టిని తన లోపలి కుపసంహరించుటయు జరిగించుచున్నది. ఈ విధముగా జీవస్థానమున జీవోహం, ఈశ్వర స్థానమున ఈశ్వరోహం, బ్రహ్మస్థానమున బ్రహ్మోహం అనే పేరులను బూని ఒక్క వస్తువే "నేను" గా నున్నది. యిదియే స్వార్థము. దీనికే ఎరుక అని పరిపూర్ణ భావజ్ఞులు పేరిడినారు.

ఈ నేననే వస్తువే స్వార్థముగా వుండి అంతఃకరణతో గూడి సకల కోరికలకు క్రోధాదులకు కేంద్రమైయున్నది. జీవితావసరములకునూ కోరికలకునూ యుండె వ్యత్యాసము విస్మరించరాదు. ఆకలి దప్పిక నిద్రాదులు తీరుట మాత్రమే ప్రాణులకు ముఖ్యావసరములు. ఆకలితీరుటకై అందుబాటులో నున్న ఆహారము స్వీకరించుట అవసరము. కాని అందని మ్రానిపండుకై అర్రులుసాచి అవస్థపడుట అనవసరము. అట్లే ఎడారిలో ప్రయాణం చేస్తూన్నప్పుడు దాహంవేస్తే, దాహోపశమ నార్థము నీవు కోరవలసినది నీరమేగాని నిమ్మ రసం కాదు. ఆకలి తీరుటకు పంచభక్ష్య పరమాన్నములే ఆశించుట అవసరంకాదు.

అది కేవలం కామమేయగును. అది నెరవేరని యెడల అట్టి కోరికలు (కామము) తీరుటకు అవరోధముగానున్న వ్యక్తులయెడ క్రోధము జనించును. సిద్ధించని కామాదులు, తిరిగి కామక్రోధాదులను రేకెత్తించు చుండును. ఈ కామక్రోధాదుల కన్నిటికి మూలము స్వార్థమే గదా! స్వార్థము నెరవేరనిచో దుఃఖము కలుగుట సహజమేగాని, తీరిన కోరికల వల్లనైనా

సుఖశాంతులు నిజముగా గల్గుచున్నవా? విచారించవలెను.

పుట్టిన దాదిగా యింతవరకు ఏమేమి సుఖములనుభవించితిమో ఒకసారి సింహావ లోకనముజేసి చూసుకొంటే ఫలితం శూన్యంగానే కనుపిస్తుంది. అనుభవించిన సుఖాలేమీ లెక్కకు వచ్చుటలేదు. ఆ సుఖముల జాడలో వాని వెనువెంట వచ్చిన దుఃఖాలే ముందుకువచ్చి నిల్చుంటున్నవి. అట్లు దుఃఖముల జాడలేకుండా, అచ్చమగు సుఖములు ముందు చిక్కుతాయనీ, అనుభవించబోయే విషయములు అట్టి సుఖశాంతులు కలిగిస్తాయనీ ఆశిస్తు న్నాము. కోరికలు కోరుకొంటూ అవి తీరినపుడు సుఖము లభిస్తుందని వువ్విళ్లూరి కలలుగంటు న్నాము. కోరిక సిద్ధించనిచో నిర్వేదము. నిస్పృహ, నిరాశలు దుఃఖమును తెచ్చిపెట్టుచున్నవి. సిద్ధించిననూ తృప్తి అనేది లేకపోవుట వలన అట్టి సుఖము లింకా కావాలని క్రొత్త ఆశలు చిగురిస్తున్నాయి. ఆశకు అవధి, అసంతృప్తికి అంతము అంటూలేవు. కనుక నిజమగు సుఖము కావాలంటే కోరికలే లేకుండాపోవాలి. అట్లని బలాత్కారముగా కోరికలు లేకుండా చేసుకోవాలంటే అవి అణగిపోజాలవు. వాని బలము సామాన్యముకాదు. కనుకనే "బలవాన్ యింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" అనగా, ఎంతటి పండితునిగూడా యింద్రియములు స్వాధీనం చేసుకొంటాయి అని భావము.

కోరికల కింతటి బలము యెట్లు చేకూరినది? కోరిక లెట్లుత్పన్నమగునో విచారించిన యీ విషయం స్పష్టంకాగలదు. పూర్వ సంస్కారములే యిప్పటి మనకోరికలకు పునాదులు. ఆ కోరికలు తీర్చుకొనుటకై ప్రయత్నంచేసి వానిననుభవించుటలో మరలనూ తన సంస్కారములు జనించును. ఆ సంస్కారములు పునఃపునఃకోరికలను కల్పించి వాని ఫలప్రాప్తి యొక్క అనుభవమునకు ప్రేరేపించుచుండును. ఈ విధంగా జన్మజన్మ నుంచి కర్మ, కర్మ నుంచి సంస్కారమువల్ల కోరికలు, ఆ కోరికలు తీరుటకై కర్మ, తత్ఫలములగు సుఖదుఃఖానుభవము దానివలన తిరిగి సంస్కారములు దానివలన మరల జన్మయీ విధంగా అనంతమగు ఒక విష వలయ మేర్పడుచున్నది.

"నేను" అనే వస్తువే (స్వార్థమే) అంతఃకరణతో గూడి సకల కామక్రోధాదులకు మూలమై కేంద్రస్థానమున నున్నది. ఆ కేంద్రము నాధారముగా గీయబడిన వృత్తములవంటివే కోరికల యొక్క చిన్న లేక పెద్ద, ఆవరణములు. "ఆత్మవస్తుకామాయ సర్వం ప్రియం భవతి" అని శ్రుతి చెప్పుచున్నది. కనుక తనయందలి ప్రేమచేత తన యొక్క శ్రేయస్సునే కోరుకొనుట స్వార్థము. ఈ స్వార్థము యొక్క ఆవరణము పెరిగిన కొలదీ స్వార్థము తరుగుచున్నది. ఆవరణము సంకుచితమైన కొలదీ స్వార్థము పెరుగుచున్నది. కనుకనే విశాలాంతఃకరణమైన కొలదీ వృత్త పరిధి పెద్దదైన కొలదీ స్వార్థము నశించును. అట్టి పరిధి లేకుండా పోయినపుడుగాని సంపూర్ణముగ స్వార్థరహితము కాదు: మరియు కేంద్రములేని వృత్తముండనట్లుగానే, స్వార్థము లేకుండాదాని ఆవరణమున్ను వుండజాలదు.

నిరావరణరూపమైన పరిపూర్ణబోధ సిద్ధాంతము వలన గాని యీ కేంద్రమున్ను దాని ఆవరణరూపమగు వృత్తమున్ను లేకుండా పోవు. కనుకనే "ఆవరణము ఆకసము, నిరావరణము

అచలమనుచు అనిరి మహాత్ముల్" అని సెలవిచ్చినారు కృష్ణదేశికేంద్రులవారు.

తన సంకుచితాంతఃకరణ వృత్తి క్రమశఃవిశాలమై, తన కుటుంబముతన గ్రామం, తన మండలం తనరాష్ట్రం, తన దేశం అంటూ వాని యోగక్షేమములకొరకై కృషిచేయుకొలది నిస్వార్థతచేకూరుచూ చివరకు మహాప్రపంచమే తనకుటుంబం(వసుధైక కుటుంబం)గా తీసుకొనగల్గిన మహాత్ములకు, తానే ఆత్మ మిగతా సర్వమూ దాని ఆవరణములోనిదేయను సర్వాత్మ దృష్టి యేర్పడును. యిదే నిస్వార్థ స్థితి అంటారు. యిది బహుపల్చనైపోయిన స్వార్థము మాత్రమే. తన యొక్కనికే పరిమితమైనపుడిది సాంద్రతమమై నికృష్ట స్థితిజెందును. ఈ నీచోత్తమస్థితులు రెండూ ఆత్మకు సహజములై యున్నవి. ప్రేమ, జీవకారుణ్యము, సత్కర్మాచరణము, సేవాధర్మము మొదలగువానియందు కూడ కించిదహంకారముండును. అహంకారమున్నంత వరకు స్వార్థరహితముకాదు. మరియు కోరికలు అహంకారము యెంత వరకుండునో, అంతవరకు స్వార్థరహితం కాదు. అంతర్ముఖుడవై ఆత్మావలోకనము చేసుకొనుటకు కూడా వీలులేకుండా నీ కోరికలే నీ హృదయకవాటములను మూసి వేస్తూ వుంటాయి. కనుక కోరికలను వదలిపెట్టాలనే అందరూ చెప్తారు. కోరికలను వదలి పెట్టాలి అంటే సన్యాసం సరికాదు. కర్మసన్యాసము అసంభవముకదా. యిక దేనిని సన్యసించాలి? "నకర్మణా నప్రజయాధనేన, త్యాగేనైకే అమృతత్వమానశుః" అని త్యాగము వలన మాత్రమే అమృతత్వం సిద్ధించునన్నారు. స్వార్థమగు ఏ 'నేను' యందు గలదో దానికి పరిపూర్ణ పరబ్రహ్మము నందు స్థానముగాని, మూలముగాని లేదని గురుముఖత, గుర్తెరిగి అట్టి "నేను" యందు "రోసతి మోక్ష్యాదపేక్ష" అని చెప్పబడిన రీతిగా ఆత్మప్రేమను రహితము చేసుకొన్నప్పుడే గాని సంపూర్ణ స్వార్థత్యాగమూ సిద్ధించదు. జనన మరణ భ్రాంతియూ తొలగదు.

# మనస్సు

శ్లో॥ మన ఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసక్తం ముక్తం నిర్విషయం మనః॥

తాత్పర్యము : మానవుల బంధమోక్షములకు మనస్సేకారణముగానున్నది. విషయాసక్తమైన మనస్సు బంధహేతువు. మనస్సు నిర్విషయ స్వరూపము జెందింపచేసినచో ముక్తికి సాధనభూత మగుచున్నది అని తాత్పర్యము.

కనుక మనస్సును గురించి సంపూర్ణముగా విమర్శించి తెలుసుకొనుటయు, దానిని మోక్షసిద్ధికి సాధనభూతముగా చేసికొనుటయు మానవుని ముఖ్య కర్తవ్యములైయున్నవి. ఏవస్తువునైననూ పూర్తిగా తెలుసుకొనవలెనన్న దాని స్థాన స్వరూప స్వభావములు యిదమిద్ధమని, విస్పష్టముగా తెలుసుకొనవలసియున్నది. త్రికరణములు (మూడు పనిముట్లు) లో మనస్సు చాలా ముఖ్యమైనది. కాని ప్రత్యక్షముగా గాన రాకున్నది. మనస్సును తెలుసుకొనవలెనన్న మనస్సు చేతనే దానిని తెలియవలసియున్నది. పంచేంద్రియములద్వారా సర్వమును దెలసుకొను ప్రధానేంద్రియము మనస్సు సూక్ష్మ శరీరములో ప్రధానమగునది మనోమయకోశము.

జ్ఞానేంద్రియములు మనస్సు గూడి మనోమయ కోశమని నిర్ణయము. ఈ కోశమున మనస్సు ప్రధానమైనదగుట చేతనే దీనికి మనోమయమని పేరున్ను వచ్చినది. మనస్సు లేనిచో దశేంద్రియముల అనగా జ్ఞానకర్మేంద్రియముల వ్యవహారము చక్కగా జరుగనేరదు. అంతరేంద్రియములు మనస్సు యొక్కమారు రూపములే. మనస్సు లేనిచో సంకల్ప వికల్పములు గాని స్వప్నావస్థగాని శ్రవణ మనననిధి ద్యాసలుగాని ప్రాపంచిక పారమార్థికములగు యెట్టి వ్యవహారములుగానియేమీ లేవు. మనశ్శక్తి యెక్కువగానున్న వారగుట చేతినే మానవులని పేరు వచ్చినది. మానవునికి 84 లక్షల జీవోపాధులలో శ్రేష్టత చెప్పబడుటకు కారణమున్ను అయినది. ఇంద్రియములకెల్ల రాజై, అవస్థాత్రయముల యందేగాక, జన్మజన్మాంతరములకు ప్రాణచోదితమై ప్రయాణములు సాగించుచున్నది. యీ మనస్సు యొక్క విక్షేపమును అణగ ద్రొక్కుటకే అనగా చిత్తనిరోధమునకే, లేక అమనస్కయోగమును సాధించుట కొరకే యోగశాస్త్రమూ ప్రవర్తిల్లినది. లింగ దేహము భంగ మొనర్చి జన్మరాహిత్యము సాధించవలెనని ఆదికాలము నుంచి ప్రయత్న పరంపరలు జరుగుచునేయున్నవి. జనన మరణ రూపమగు సంసారమునకు మనస్సే మూలము. కనుక జన్మరాహిత్యమునకు మనోనాశమే సాధించవలెనంటే మనస్సున కేదిమూలమో వెదకిపట్టుకొని దాని రహితమును సమకూర్చుకొనవలసియున్నది. ఆ విధంగా మనోనాశము సాధించిన పరిపూర్ణ భావజ్ఞులకు మనోవికార జన్యములైన సంకల్ప వికల్పాదులు జాగ్రత్స్వప్నాదులు, ప్రాపంచిక పారమార్థిక రూపములగు యెట్టి వ్యవహారములు గాని యేమిలేవు. వారినే సహజామనస్క రాజయోగులందురు. మనశ్శక్తి యెక్కువగా నున్నందున మానవత్వము, మనోనాశమే అయితే దేవత్వము. వారే అనహంకారులగు అనిమిషులు, వారే నిజమగు భూసురులు, యితర జేజేలు, బాలోన్మత్త పిశాచవత్ గానుందురన్నారు. ఐతే బాలులకు వున్మత్తులకు పిశాచులకు మనస్సు వున్నది. ఐతే అపరిపక్వంగానో, వుపాధిరహితంగానో యున్నది. పరిపూర్ణుల మనస్సు దోషరహితము పరిశుద్ధమునై పరిపూర్ణతదనరుచు వుండియు లేక యున్నది.

మనో వ్యవహారము కేవల సంకల్ప వికల్పాదులు మాత్రమే కాదు. ఇచ్ఛాద్వేష ప్రయత్నాదులు, కామక్రోధాదులు, శ్రద్ధా, శ్రద్ధలు, ధైర్యాధైర్యములు, విచారేచ్ఛ, లజ్జా, జ్ఞాన, భయాదికము, అష్టమదములు, అష్టపాశములు, రాగాదులు మొదలగువాని కెల్ల పుట్టిల్లయి యున్నది. మనస్సులేనిచో సంకల్పమూలేదు. తదనంతర కర్మలేదు, మనస్సులేనిచో ప్రపంచమే లేదు, సృష్టియేలేదు. "ఇచ్ఛామాత్ర ప్రభుస్సృష్టిః" అన్నారు సమిష్టి మనోసంకల్పముచే ఈశ్వర్డు సృష్టించుచున్నాడు. మనస్సులేనిచో సర్వేంద్రియములుండియు లేనట్లే అందుచేతనే "మనోమాత్రమిదం సర్వం" అని చెప్పబడుతోంది.

మనస్సు నిత్యమని, అణుపరిణామమని, తార్కికులవాదన. వేదాంతులు దీని కంగీకరించరు. మనస్సు నిత్యముకాదు. కార్యరూపంగా పరిణమించు స్వభావము గలది. కనుక స్వప్నములో ద్రష్ట దర్శన దృగ్రూపములుగా తానే అగుచున్నది. మనస్సు నిత్యమే అన్నచో జీవునికి ముక్తి యనేదే యుండదు. కనుక మనస్సు నిత్యమని అంగీకరించుట శ్రుత్యుక్తి యనుభవములకు విరుద్ధమైయున్నది.

ఆకాశభూతమందలి అష్టమాంశము వాయువులో చేరి, మనస్సు అగుచున్నది. అని, సాంఖ్యము చెప్పుచున్నది. ఛాందోగ్యోపనిషత్రృత్తి పాదితమగు త్రివృత్కరణ విధానము నందు అన్నపు సూక్ష్మాంశము, మనస్సుగా నిర్ణయమగుచున్నది ఎట్లనగా భుజించిన అన్నము, సప్తధాతువులుగా పరిణామము చెందుటయేగాక సూక్ష్మాతి సూక్ష్మాంగా రేతస్సు, మనస్సు ఓజస్సు రూపములుగా గూడా పరిణమించుచున్నది. కనుక మనస్సు పరిశుద్ధము గావలెనన్నను, మనో చాంచల్యమడంగి ఏకాగ్రత సిద్ధించవలెనన్నను, మనోనాశనము సాధించవలెనన్నను ఆహారము పరిశుద్ధముగా నుండవలసియున్నది. కనుకనే "ఆహార శుద్ధౌ సత్వ శుద్ధిః" అనిన్ని "సత్వాత్సంజాయతే జ్ఞానం" అనిన్ని చెప్పబడుతూయున్నది. కనుక శుద్ధ సత్వ ప్రధానమగు మనస్సుందే పారమార్థికమగు జ్ఞానముత్పత్తియైయీ మనస్సు నిర్విషయరూపము చెందినపుడే దానిని శుద్ధజ్ఞానమని అన్నారు. ఈ శుద్ధ జ్ఞానమే పిండబ్రహ్మాండముల యందేకమై అఖండమై వ్యాపకస్థితిలోనున్న దీనినే "అయమాత్మాబ్రహ్మ" మన్నారు.

మనస్సుయొక్క సామాన్య రూపమిట్టిదని స్పష్టంగా నిరూపించుట కష్టమైనను మనమందరమూ మనస్సును నిత్యమూ గుర్తించుచునే యున్నాము. ఏది అజాగ్రత్తగా నుండుటవలన మంచి వెలుతురులో సహితం మన కట్టెదుట నున్నదానిని గూడా జూడజాలమో అదియే మనస్సు. అట్లే ఏది ఏకాగ్రత చెందినచో దేవతారూపములు సహితం కట్టెదుట ప్రత్యక్షముగా గానవచ్చునో అదియే మనస్సు. ఏది అన్యథాయత్తమైనపుడు శ్రోత్రేంద్రియము కట్టెదుట మాట్లాడువాని మాటలు ఏమాత్రం గ్రహించదో అదే మనస్సు. "నా మనస్సిట లేదు. ఏమంటివి?" అనుటయు కద్దు. చీకట్లో కేవలం స్పర్శజ్ఞానముచే యిది గోడ యిది తలపులని గుర్తించునదే మనస్సు. మాటలాడు సమకాలమందే ఆ మాట యందలి సుశబ్ద దుశ్శబ్దములను గుర్తించునదే మనస్సు. మనస్సునకు రూపములేదు. శబ్దస్పర్శరూప గుణకమగు అగ్నియొక్క ప్రకాశములో నానా ఆకారములు. రూపములు వర్ణములు గాననగును. గాని కేవల శబ్దస్పర్శలు మాత్రమే గుణకములుగాగల ఆకాశ వాయువుల సంయోగములో వుత్పత్తియైన మనస్సునకు రూపముండజాలదుగదా! దానికి సహజముగా ఏ రూపమును లేనప్పటికీ అదే అన్నిరూపములు వహించుచున్నది. "మనోహిజతువత్" అన్నారు. అనగా కరిగిన లక్కయే మూసలోపోసిన యా యాకారము వహించునట్లే మనస్సున్ను యే వస్తువును సంకల్పించినా ఆ వస్తు రూపము వహించు చున్నది. యిదియే మనస్సుయొక్క స్వరూప లక్షణము. అన్ని స్వరూపములు అదే అయినపుడు దానికి ప్రత్యేకముగా ఏ స్థానము చెప్పగలము? ఆకాశ సంబంధమగు మనస్సు అన్నిస్థానముల యందూ నుండగలదు గాని ఏక కాలములో మాత్ర మన్నిటియందూ నుండదు. ఐనను పిండాండమందుండి సకల వ్యవహారములు చేయు వ్యష్టి మనస్సునకు కంఠము స్థానముగా నిర్ణయించినారు. కాని కాలియందు ముల్లు గుచ్చుకొన్న తక్షణమే మనస్సు దానిని గుర్తించు చున్నదంటే స్థూల శరీర మంతటా ఎక్కడ రక్తమాంసములుంటే అక్కడనే అది యున్నదనాలి. అన్నము యొక్క మధ్యమాంశం మాంసము, సూక్ష్మాంశం మనస్సు గనుక మాంసమున్న ప్రతిచోటా మనస్సున్న దనవలసినదే.

మనస్సే బంధ మోక్షములకు కారణమన్నాము, ఎట్లాగంటే, భావనా రూపమైన మనస్సంకల్పములు పుణ్య పాప రూపములగు సంస్కారముల నుత్పత్తి చేయుచున్నవి. ఆ సంస్కారములే ఆగామి రూపమగు అదృష్టరూప సుఖదుఃఖఫలములను కల్గించుచున్నది. ఆ ఫలములను భవించు నిమిత్తం మానవుడు తిరిగి జన్మ పరంపరలలో చిక్కువడుచున్నాడు. యీ రీతిగా మనస్సు బంధమునకు కారణముగా నున్నది. మనస్సునందు శుభాశుభ సంస్కారములకు తావీయక వర్తించగల "యోగఃకర్మసుకౌశలం" అని గీతలో చెప్పబడిన రాజయోగ ప్రవర్తనయందు నేర్పరితనమును సంపాదించినచో జన్మరాహిత్యమునే సాధించగల్గు చున్నాడు.

మనశ్శుద్ధియే ప్రధానమని సర్వులూ అనుచునేయున్నారు. దోషము లేనిచో శుద్ధి యెందుకు? కనుక మనస్సునందుగల దోషము లేవియో ముందు తెలియవలసి యున్నది. మలవిక్షేప ఆవరణములను దోషములు మనస్సున తిష్ఠవేసుకొని యున్నవి. యీ దోష నివారణ చేయుటయే మనశ్శుద్ధి. "తారకంబు మనశ్శుద్ధి కారకంబు" అని చెప్పబడినది. కాని తారక యోగముచే విక్షేప దోషమొక్కటియే తొలగను. కనుక మనశ్శుద్ధికై భగవద్గీత మానసిక తపస్సును విధించుచున్నది. ఎట్లనగా

శ్లో॥ మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః
భావ సంశుద్ధి రిత్యేత త్తపో మానసముచ్యతే భ.గీ. 14-17

తాత్పర్యము : ప్రసన్నమై సంతోషముతో గూడిన మనస్సు. సౌమ్య స్వభావము. మౌనము, అత్మనిగ్రహం, అంతఃకరణ శుద్ధి గలుగుటకై చేయు ప్రయత్నమంతయు మానసిక తపస్సు అని చెప్పబడును.

రాజయోగులు పరిపూర్ణ భావమెరిగినవారై జనులందరివలె అన్ని పనులు చేయు చుండినను, మనఃపరివర్తన చేసుకొన్న వారై, ఏ ఆపేక్షయులేక, కర్తృత్వ త్యాగబుద్ధితో, కర్మయందు కుశలత్వము గల్గి సంచరించుచు, శేష జీవితము గడుపుకొందురు. కనుకనే వారే నిజముగ మనోనాశము గావించుకొన్న అశరీరులు.

# వాక్కు

ఆకాశం, గాలి, వెలుతురు, నీరు, నేల సర్వజీవుల మనుగడకు పరమావశ్యకములై యున్నవి. యివి పంచభూతములనే పేరుతో ప్రసిద్ధములై ఈశ్వరుని యొక్క స్థూల శరీరమగు విశ్వ ప్రకృతిగా నున్నది. ఇందేది లేకున్నను బ్రతుకుట సులభసాధ్యంగాదు. విశ్వ మందలి ఖాళీ ప్రదేశ రూపమగు ఆకాశములో తిరుగుచూ విశ్వమందలి గాలిపీల్చుకొనుచు నీరు త్రాగి దప్పిక తీర్చుకొనుచు నేలపై పండిన సస్యాదుల తినుచూ సమస్త ప్రాణులూ స్వేచ్ఛగా వెలుతురులో తిరుగుచూ బ్రతుకుచున్నవి. తన విజ్ఞానముచే మానవుడింకనూ యీ పంచభూతములు సహాయముతో సృష్టికి ప్రతి సృష్టి గావించుచూ 84 లక్షల జీవోపాధులలోను

యుత్తమస్థానము పొంది యున్నాడు. ఈ పంచభూతములలోను అకాశము మిగతా నాల్గింటికి మూలకారణమై సర్వమునకు మాతృస్థానముగా నున్నది.

అకాశము యొక్క సూక్ష్మము శబ్దతన్మాత్ర బెల్లమునకు తీపివలె ఆకాశమునకు శబ్దమే గుణముగా నున్నది. కనుక సృష్టియందు ప్రథమమున అవిర్భవించి ప్రకటమైనది. ధ్వని రూపమగు శబ్దమే. యిదే ప్రణవ ధ్వని. ఈ ధ్వని వైఖరీ రూపమును వహించినపుడు, మానవుని యుచ్చారణను బట్టి, సంస్కృత భాష యందేబది వర్ణము లేర్పడినవి. నానాదేశాల ప్రజలు వారి వారి భాషల కనుగుణ్యములగు వర్గ(అక్షర) మాలలను ఏర్పరచుకొని వ్రాత లిపిని సృష్టించుకొని నానా భాషలలో మాట్లాడుచూ వారి వారి నిత్య వ్యవహారములు జరుపుకొను చున్నారు.

"రసోవైసః" అని కేవలం ప్రతి యొక్కరి యందున్న ఆనంద రస తరంగముల పొంగును. రసవత్తరమగు భాషలోని కనువదించి కవీశ్వరులు తామానందించి లోకము నానందింపచేయుచున్నారు. ఋషీశ్వరులు వారి యధ్యాత్మికానుభవములకు నామ రూప కల్పనలు గావించి వాక్య బద్ధముచేసి శ్రుతిస్మృతుల రూపంలో లోకమునకు ప్రసాదించినారు. ఆదిలో కేవలం బీజ రూపంగా నుండిన శబ్దము ధ్వన్యాత్మకంగా బ్రహ్మాండ వ్యాపితమై భాషా రూపంలో వ్యవహార రూపమగు వాక్కుగా పరిణమించినది.

వాక్కు యొక్క పరిణామమును నాలుగు దశలుగా విభజించి వానికి, పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అను నాలుగు పేర్లు పెట్టినారు. పింద బ్రహ్మాండముల యందునూ సృష్టికి పూర్వమునందునూ యివి ఏ విధముగా నున్నవో సమగ్రముగా తెలుసుకొన వలసియున్నది.

సృష్టికి పూర్వము బ్రహ్మము (పరిపూర్ణ బ్రహ్మము కాదు) నందు సూక్ష్మాతి సూక్ష్మంగా యణగి మణగియున్న శబ్ద బీజమే పరావాక్కు. ఈ స్థితి యందున్న బ్రహ్మమే నిశ్శబ్ద బ్రహ్మమని కొందరు వాడినారు. ఇది శబ్దము ప్రకటముగాని స్థితి మాత్రమే కనుక కేవల నిశ్శబ్దమని అనరాదు. పరిపూర్ణ బ్రహ్మము శబ్ద నిశ్శబ్దముల మీరినదని ధ్వని మొదలగు తన్మాత్రలు కనుగొనగా లేశమైన గాన్పించని చోటని అచల ఋషులు వల్లిస్తూ వచ్చేరు.

ఈ పరావాక్కు సంకల్ప రూపంచెంది అహం స్ఫురణ కల్గి పూర్వాపర, స్వపర భేదముతో విమర్శించునపుడు దానికి పశ్యంతి అను పేరు వుంచబడినది. ఆలోచన ఒక నిశ్చయ రూపంజెంది గుణత్రయ విభాగముతో సృష్టికున్ముఖమై స్థూలాకృతుల వహించినపుడు దానికే మధ్యమ వాక్కని నామకరణ మేర్పడినది. జరిగిన సృష్టి రూప నామ క్రియాత్మకమైనపుడు అదియే వైఖరి అనబడెను.

ఈ చతుర్విధ వాక్కులు బ్రహ్మాండ పిండాండములయందు ప్రకటమైన విధానము యీ క్రింది విధముగా పెద్దలు నిర్ణయించినారు. రాళ్ళయందు పరావాక్కుగా, తరులతా గుల్మాదులయందు పశ్యంతి రూపంగా, పశుపక్ష్యాదుల యందు మధ్యమ వాక్కుగా, మానవులయందు వైఖరీ వాక్కుగా నున్నదని చెప్పబడినది. ఎట్లనగా సర్వవ్యాపకమని కొనియాడబడు పరమాత్మచేతనము రాళ్ళయందు విశేషంగా ప్రకటమగుటలేదు. గాని లేనే

లేదని అనరాదు. ఒకరాతిని పరీక్షించి చూచిన యెడల పృధ్వీ భూత సంబంధమగు అనేకాణువుల సంయోగముచే ఆ రాయి ఏర్పడినదిగా గమనిస్తూనే యున్నాము. ఏ శక్తి యొక్క ప్రభావముచే ఈ అణువులు పరస్పర మొకదాని నొకటి గాఢంగా కరచిపెట్టుకొనిపోయి సంశ్లేషం చెందినవో ఆ శక్తి పరమాత్మ యొక్క శక్తిగాదా! ఆ చైతన్య శక్తియే పరావాక్ అని అభివర్ణింపబడి గూఢంగా ప్రతి వస్తువునందునూ ఉన్నది. ఆచైతన్య శక్తి మరికొంత విజృంభించినపుడు జ్ఞానశక్తిగా పరిణతి చెందునపుడు దానికి పశ్యంతి వాక్ అని పేరు పెట్టబడినది. ఉదా: ప్రొద్దు తిరుగుడుపూవు సూర్యునివైపు అభిముఖ మగుట ఆ మొక్కయందు గల ఏ కించిన్మాత్రమగు జ్ఞానప్రకాశము వలననేకదా! అట్లే మనం పెట్టినపాదుపైకెదుగుటలో మన ఇంటిచూరు అడ్డము వచ్చినపుడు ఆ పాదు యొక్క తీగె కొనలు చూరును తప్పించుకొని వెలుతురు వైపు మాత్రమే సాగి తమదారి తాము చూచుకొను చున్నవి. పశ్య అను మాట కర్థము చూచుట. కనుక పశ్యంతివాక్ అని యీ తెలివికి పేరు పెట్టబడినది. పరావాక్ యే యింద్రియమునకు గోచరించక గూఢంగా నున్నందున దానికి పరావాక్ అనిపేరు. పశ్యంతివాక్ శ్రవణేంద్రియ గ్రాహ్యముగాకున్న నేత్రేంద్రియముచే కనిపెట్ట గల్గుచున్నాము. మధ్యమ వైఖరీ వాక్కులు రెండునూ శబ్ద రూపములుగా నున్నందున శ్రవణేంద్రియముచే వినగలుగుచున్నాము. పశుపక్ష్యాదులు తమ వాగింద్రియము ద్వారా చేయు ధ్వనియే మధ్యమా వాక్కు. పశుపక్ష్యాదుల వాక్కు మానవ భాషల యందుండు వర్ణములచే వ్యక్తపరచుటకు వీలుగా నుండదు. కేవలము ధన్యాత్మకముగానే యుండును. ఆ ధ్వనుల యందుండు బేధ విశేషములను అందు వ్యక్తమగు భావమును దీర్ఘకాల పరిశోధనచేగాని గ్రహించజాలము. శ్రవణేంద్రియముచే వినగల్గియు అందలి భావమును మాత్రము సాధారణముగా గుర్తించలేకున్నాము. కనుక ఈ వాక్కునకు మధ్యమ వాక్కని నామకరణము చేయబడినది. మానవుని వాక్కే వర్ణాత్మకమై భాషా నిర్మాణంబునకు అనువైనదియై వక్తయొక్క భావమును స్ఫుటముగా ఇతరులకు అందజేయుటకు వీలైనదిగా నున్నది. కనుక మానవుని భావవైఖరి భాషయందే తెలియబడుటచే మానవ వాక్కునకు వైఖరీ వాక్కు అని నామకరణం చేయబడినది.

"యదే వేహతదముత్రయదముత్రత దన్విహ" ఏది యిక్కడ (యీ దేహమునందు) కలదో అది బ్రహ్మము నందున్నది. ఏది బ్రహ్మాండము నందున్నదో అది యీ పిండాండము నందునూ యున్నదని దీనికర్థము కనుక బ్రహ్మాండమందున్న యీ నాల్గు విధములగు వాక్కులు పిండాండము నందు ఏవిధముగా నున్నవోమనం చూడవలసి యున్నది. మానవుని వాక్యము అద్యంతమూ పరిశీలించినచో శబ్దము, లేక మాట యెట్లు రూపు దాల్చుచున్నదో గమనించ దగును. మాటపైకి వచ్చుటకు పూర్వదశలో స్వరపేటిక (కంఠము) యందు చలనము కలుగవలెను. దానికి పూర్వము భావరూపమగు సంకల్ప ముండవలెను. దానికి పూర్వదశయందు ఆ సంకల్పము పుట్టుటకు బీజరూపంగా యొకానొక సంస్కారముండవలెను. మానవుని వాక్కునకు గల యీ పూర్వ దశలకే భిన్న భిన్న నామములు ఏర్పడినవి.

వాక్యమున కత్యంత మూలకారణముగానున్న సంస్కారమే పరావాక్కనీ, అది సంకల్ప

రూప పరిణామం చెందినపుడు పశ్యంతే వాక్కనీ, స్వర పేటికయందు మధ్యమ వాక్కనీ పెదవి దాటి శబ్దము భావగర్భితమై బయల్వెడలునపుడు వైఖరీ వాక్కనీ పిలువబడుచున్నది. అసలు చలనముంటేనేగాని శబ్ద ముత్పత్తి కాజాలదు గదా! ఐతే బ్రహ్మమునందు బీజ రూపంగా లేక లేశ రూపంగా నున్న పరావాక్కు ధ్వన్యాత్మకముగా యెట్లు ప్రకటమాయెను? అవును అచల స్థితిలో నున్న బ్రహ్మ స్వరూపమునకు "నేను" అను అహంస్ఫురణ కల్గుటయే ప్రథమతః కల్గిన చలనము. ఈ చలనము కల్గుటయే శబ్దోత్పత్తికి కారణము. ఛాందోగ్యోప నిషత్ప్రమాణానుసారం అగ్ని జల పృధ్వీభూతములు మూడున్ను త్రివృత్కరణమైనవని ఆవిధంగా సృష్టి కల్గినదని వర్ణింపబడినది. అందు అగ్ని యొక్క సూక్ష్మము వాక్కు అని నిర్ణయించినారు. అగ్ని భూతమునకు సూక్ష్మము వాయువు, వాయువునకు సూక్ష్మము ఆకాశము, ఆకాశ గుణము శబ్దము శబ్ద రూపము వాక్కుగదా! కనుక అగ్నియొక్క సూక్ష్మాంశము వాక్కు అని బ్రహ్మాండమున ఋజువగు చున్నది. యిక పిండాండమునందో, మనము భుజించిన ఆహారములో చమురు గల పదార్థము లున్నవి.

అవి మాత్రమే గాక కేవలంగా మనం నూనె, నెయ్యి మొదలగు వానిని భుజించు చున్నాము. యివి అగ్ని సంబంధమగు పదార్థములు. వీనిని స్థూల భాగము యెముకకు, మధ్య భాగము మజ్జకు సూక్ష్మ భాగము వాక్కుకు పుష్టి యిచ్చుచున్నది. కనుకనే శిశువులకు చమురు విశేషముగా వాడుచున్నారు. నెయ్యి విశేషముగా వాడే వారి వాక్కు స్ఫుటముగా నుండుటయు గమనించుచున్నాము. గంధతన్మాత్ర యందలి అష్టమాంశము శబ్దతన్మాత్రయందు చేరుటచే వాగేంద్రియ మేర్పడినది అని సాంఖ్యము తెలుపుచున్నది.

ఈ విధముగా సృష్టికి పూర్వాపరములయందు సర్వత్ర యున్నది. గనుకనే "వాగ్వై బ్రహ్మ" అని శ్రుతి యనుటకు కారణమైనది. సృష్టికి పూర్వము పరావాక్కును ఏది తనయందు బీజరూపంగా దాచుకొన్నదో అదే "వాగ్వైబ్రహ్మ" అను శ్రుతిలో లక్షింపబడినది.

ఆ పిదప, ధన్యాత్మకంగా యింకనూ తదుపరి వర్ణాత్మకమగు అక్షర సముదాయంగా, విజృంభించిన దంతయు "వాచారంభణం వికారో నామధేయం" మాత్రమే. ఐననూ వాక్కు బ్రహ్మ స్వరూపముగా యెంచి అసత్యాత్మకముగా లేక హింసాత్మకముగా దానిని వినియోగించక సర్వ వ్యవహారములయందునూ దానిని మహా పరిశుద్ధముగా నుంచుట మానవుని కర్తవ్యమై యున్నది.



# శరీరము

నశించు స్వభావము గలది శరీరము అని వ్యుత్పత్తి కనుక నిజంగా శరీరమనగా సూక్ష్మ శరీరమనాలి. దహింపబడునది దేహమని వ్యుత్పత్తి, గనుక దేహమనగా స్థూల దేహమనే అనాలి. ఐనను వాడుకలో శరీరమును శబ్దము గూడా స్థూల దేహమునకే వర్తింపబడుచున్నది. కనుక శరీరము, దేహము, కాయము యిత్యాది శబ్దములు పర్యాయ పదములుగానే వాడుకలో నున్నవి. మనోవాక్శరీరములని, మనోవాక్కాయములని అనబడు త్రికరణములలో ఉత్తరోత్తరా ఒక దానికంటె నొకటి స్థూలరూపంగా నున్నవి. మనస్సు అంత రేంద్రియములలోనిది. వాక్కు బాహ్యేంద్రియము లనదగిన కర్మేంద్రియములలోనిది. శరీరము యీ రెంటికంటెను స్థూలమై సూక్ష్మకారణ, మహాకారణములని చెప్పబడు వ్యష్టి శరీరములన్నిటికి నిలయమై, ఆధారమై యున్నది. కాపుర ముండుటకు యిల్లులేనివాడెట్లు అందందు పరిభ్రమించవలసివచ్చునో అట్లే దేహము పోయిన జీవుడు తిరిగి దేహములో ప్రవేశించువరకు నందందు పరిభ్రమించక తప్పదు. కనుకనే దేహమునందున్నపుడు జీవునికి దేహి యని పేరు గూడా గల్గినది. "జీవో బ్రహ్మైవనాపరః" అని చెప్పు అద్వైత మతానుసారంగా దేవుడే బ్రహ్మము అనగా దేవుడు కనుక అట్టి దేవుడుండు దేహము దేవాలయమని "దేహం దేవాలయం ప్రోక్తోజీవో దేవస్సనాతనః" అనుకారికయు పుట్టినది.

ఈ స్థూల దేహము పంచ భూతాత్మకమనీ, తిరిగి విచ్ఛిన్నానంతరం విశ్లేషం చెంది పంచభూతములలో చేరిపోవునని అందరు అనుచున్నారు. కాని యీ శరీరమున పంచభూతము లేయే రూపములలో నున్నవి? పంచీకృత పంచమహాభూతములు బ్రహ్మాండమున గానవచ్చినట్లు దేహమునందు గాన వచ్చుచున్నవా? ఆయా రూపములలో మాత్రం గానవచ్చుటలేదు. మరి శరీరము నందున్నట్లు ఋజువేమి? పృధ్వి కఠినాంశము, జలము ద్రవాంశము, అగ్ని తేజాంశము లేక ఉష్ణాంశము, వాయువు చలనాంశము. ఆకాశము బయలాంశమునై యున్నవిగదా! యీ అంశములు మాత్రం శరీరమునందు గానవస్తూవున్నవి. శరీరమందు కఠినంగా నున్న సర్వము పృధివ్యాంశసంబంధము. ఉదాహరణకు, "నరములస్థులు చర్మనఖరోమ మాంసముల్ భూగుణంబులు" ద్రవరూపంగానున్న వన్నియు జలభూత సంబంధములు. ఉష్ణాంశముతో గూడుకొన్న ఆకలిదప్పి నిద్రాసంగమాదులు అగ్నిభూత సంబంధములు, చలనక్రియతో శరీర వ్యాపారము నంతను జరిగించు కార్యకలాప మంతయు వాయుభూత సంబంధము ఆకాశార్థమైన అంతఃకరణము నాశ్రయించి సూక్ష్మాతి. సూక్ష్మమై వ్యాప్తినొందు కామక్రోధాదులే ఆకాశ సంబంధములు. యిట్లీ పంచ భూతాంశగుణములతో నేర్పడిన స్థూల శరీరము మున్నంతవరకు దాని యందుండు పంచభూతాంశ గుణములున్ను యుండును. కనుక ఎంతటి జ్ఞానికయినా దేహమున్నంతవరకు కామక్రోధాదులుండుట సహజమే కాని అంతఃకరణము ఆకాశ నిజాంశ రూపమగు జ్ఞానప్రకాశముచే వెలుగొందుచుండును. గనుక కామాది వృత్తు లాతనిని బాధింప జాలవు. ప్రాణమునకు కోరలున్ననూ అందు విషమున్ననూ మంత్రబద్ధమైన ఆ పాపము యొక్క విషమెవ్వరిని బాధింపజాలదు గదా!

తల్లి దండ్రులు భుజించిన అన్నము సప్తధాతు పరిణామము జెంది శుక్ల శోణితరూపమై పిండోత్పత్తి యగుచున్నది. ఆ పిండమునందు పంచభూతాంశ గుణములున్నవిగదా! అది యెట్లు వచ్చుచున్నవి అంటే ఆ పిండమునకు ఆదికారణమైన అన్నము పృథ్వీభూత సంబంధము. పంచీకృతమైన ఆపృథ్వియందు శబ్ద స్పర్శ రూప రసములుగా మిగతా నాలుగు భూతములు సూక్ష్మముగా నున్నవిగదా! అంతేగాక తిన్న అన్నము శుక్లశోణితరూపము చెందుటకు పంచభూతముల సంయోగమున్నదికదా! కనుక యీ విధముగా స్థూలశరీరము పంచ భూతాత్మ కమని రుజువగుచున్నది.

ఈ స్థూలశరీరము ఆదిలో అన్న స్వరూపముగా నుండి,తల్లి భుజించిన అన్నముచే అభివృద్ధి వికాసములు చెంది, పుట్టిన పిదప అన్న రూపమగు తల్లి స్తన్యముచే వృద్ధిపొంది, పిదప తానే అన్నము భుజించి, బాల్య యౌవనములయందు సంపూర్ణ వికాసము చెంది క్రమశః కౌమార వార్ధక్యములందు క్షీణించి, మరణించి, దహన ఖనన సంస్కారాదులచేత అన్న జనకమగు పృథ్వియందు చేరుటచే దీనికి అన్నమయకోశమని పేరు వచ్చినది. అన్నమయకోశ రూపమగు స్థూలశరీరమే మిగతా కోశములు అనగా ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములకు అధారముగనున్నది. 25 యింద్రియములు దీనినే ఆశ్రయించుకొని ఆయా గోళకముల యందు యిరవైఐదు విధముల తెలివిరూపంతో నుండి వ్యవహారము చేయు చున్నవి. తల్లి గర్భమునుండి వేరై బ్రహ్మాండమున బడుటయే పుట్టుక. కనుక పుట్టినదేది? స్థూల శరీరమే, బాల్య యౌవ్వన కౌమార, వార్ధక్యములు దేనియందు ప్రకటమగుచున్నవి? ఈ స్థూలశరీరమునందే, సూక్ష్మ శరీరమునకు యీ అవస్థలు లేవు. చివరకు ఉఛ్వాస నిశ్వాస రూపముగా యీ దేహమును, బ్రహ్మాండమునకు ముడిపెట్టిన సూత్రము తెగిపోయినచో పడిపోయి శిథిలమైపోవునదియు యీ శరీరమే. జనన మరణాదులు పొందునది యీ స్థూల శరీరమనీ, జనన మరణములు దేహధర్మములేననీ అన్నారు. దేహధర్మములు ఈ దేహముతోనే పోతూయుంటే జనన మరణ రహితమునకై వేరే కృషి చేయుటేల? అంటే అందుకు మరి కొంచెము విచారించవలసియున్నది. పుట్టుక యనగానేమి? జీవముతో పుట్టినపుడే మనము శిశువు జన్మించెనందుము. జీవము లేని శిశువు పుట్టినచో అప్పుడేమనవలెను? శిశువు జన్మించెననవలెనా? శిశువు యొక్క శవము జన్మించెననవలెనా? కనుక ఈ దృష్టితో చూస్తే జన్మ శిశువు యొక్క శరీరమునకా? లేక శిశువునందలి జీవత్వమునకా? శరీరమందలి జీవత్వమునకే జన్మయని యనవలసి వస్తుంది. ఈ జన్మయెపుడు కలిగినది? తల్లి గర్భమందున్న పిండములో జీవుడు ప్రవేశించునపుడు అనగా దేహమును ధరించినపుడు జన్మ అనాలి. అదే దృష్టితో ఆలోచిస్తే శరీరమునుండి బైటికి పోయినపుడు అనగా దేహమును విడచినపుడు మరణం అనాలి. కనుక జనన మరణాలు శరీరమునకనాల్లా? జీవునికి అనాలా? అంటే జీవునికే అనాలి. అపుడు జనన మరణాలు దేహధర్మాలనే మాట వివాదాస్పదమౌతుంది. దీనికి సమన్వయమేమి? అంటే జనన మరణాలు పొందేది జీవుడే (అనగా దేహమును ధరించువాడు, విసర్జించువాడూ) జనన మరణాల ప్రభావం మాత్రం దేహంమీద గానవస్తుంది. కనుక స్థూలంగా నిర్ణయించి

జనన మరణాలు దేహ ధర్మాలని అన్నారు అని అనుకోవాలి. కనుకనే, ఈ దేహం నశించునట్టిది. దేహి నిత్యము. చినిగిన వస్త్రమును విడచి, మానవుడు నూతన వస్త్రమును ధరించునటుల రోగము ముసలితనము యిత్యాదులచే జీర్ణమై శిథిలమైన దేహమును విడచి జీవుడు మరొక క్రొత్త శరీరమును ధరించుచున్నాడని గీత చెప్పుచున్నది.

కనుక గర్భస్తపిండమున ప్రవేశించి చైతన్యము కలిగించి తన ప్రాణశక్తిచే దానిని తల్లి గర్భమునుండి వెడలించు వాడును పంచప్రాణరూపంగా దానిని భరించువాడును తుదకు కాలచక్ర కర్మచక్రములకు లోబడి దానినుండి తానే బహిర్గతుడై దానిని పాము కుబుసమువలె విడచువాడును ఎవడు? శాశ్వతుడని చెప్పబడుజీవుడే. కనుక పుట్టుక చావులను కల్పించుకొనువాడు జీవుడే. దేహమందున్నంతకాలము జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములందు విశ్వ తైజసప్రాజ్ఞ ప్రత్యగాత్మాది నామములు చెందువాడును. మరణ సుషుప్తులు జెందువాడును, దేహముతో తగులుబాటుచెంది సర్వభ్రాంతులు చెందువాడును, గురువుచే మేల్కొనువరకు జనన మరణములు చెందుచూ బ్రహ్మమెంత శాశ్వతుడో తానూ అంతశాశ్వతుడుగానే చెప్పబడుచుండు వాడును తుదకు పరిపూర్ణ పరబ్రహ్మమందు తాలేనని గురుమూర్తిచే గుర్తెరిగి శాశ్వతముగా లేకపోవువాడును, ఈ జీవుడే. కనుకనే కృష్ణదాసుగారు "ఆటాడియాడకుండును ఆటాడిన మేనీ బొమ్మ ఆటాడకనే యాటాడు ఆటాడించేటివాడు అతడేర కర్తా అన్నిటికి యీ అచలమకర్తా చేటుపాటులచే వచ్చు ఫలము ముమ్మాటి కనుభవించి మరణ జననములొంద నతడేకర్తా, అన్నిటికీ యీ అచలమకర్తా" అన్నారు.

కనుక అంతరేంద్రియ పంచకముచే ధర్మా ధర్మ విచక్షణ చేయుచూ ప్రాణేంద్రియ వ్యాపారముచే శరీరాన్ని ధరించి భరించి, జ్ఞానేంద్రియపంచకముచే విషయపంచకము గుర్తెరిగి కర్మేంద్రియములచే జీవుడే కర్మనాచరించి కర్మఫలములను అనుభవించుటకై మరల మరల జన్మించుచున్నాడు. కరచరణాద్యవయవములు యింద్రియ గోళకములుగల యీ స్థూల శరీరము మనోవాక్కులతోపాటు ముఖ్యమగు పరికరమైయున్నది. ఈ స్థూల శరీరము తల్లిగర్భము నుండి బైటబడినదాది జీవుడు లేచిపోవువరకు అన్ని అవస్థలయందు వ్యవహారము చేయుచునే యున్నది. స్వప్న సుషుప్తులయందు, మూర్ఛా సమాధులయందు పనిచేయుచున్నదా? అంటె బాహ్యమునందు పనిచేయునట్టు కనుపించినను లోపల పనులు జరుగుచునేయున్నవి. గుండె కొట్టుకొనుచున్నది.

ఊపిరితిత్తులు సంకోచ వికాసములు చెందుచూ, కొలిమితిత్తులవలె గాలిని ఉఛ్వాస నిశ్వాస రూపంగా నడిపించుచున్నవి. రక్తము ప్రవహించుచున్నది. భుజించిన ఆహారము జీర్ణమగుచున్నది. సమాధియందు యీ క్రియలలో కొన్ని జరుగకున్నను నఖరోమాదులు యెదుగు చున్నవి. మిగతా అవస్థల యందువలెనే క్షణక్షణము కొన్ని జీవాణువులు శిథిలమై శరీరమును విడిచిపోవుచున్నవి. వాని స్థానే కొన్ని జీవాణువులువచ్చి చేరుచున్నవి. మనోవాక్కులకు విశ్రాంతి యున్నదిగాని నిజముగా శరీరమున కెట్టి విశ్రాంతియులేదు. గనుకనే యిందలి భాగములు క్రమశః క్షీణించి శిథిలావస్థను చెందుచున్నవి. ఈ శరీరమెంతో వింతైన యంత్రము. కనుకనే

కృష్ణదాసుగారు తమ కందార్థములలో దీనిని పెనుమాయగా వర్ణించినారు.

"పెనుమాయను చూడుము యిదె, జనకుని జఠరంబు వలన జననీ గర్భంబునజొచ్చి మారురూపున జనియించును అవయములు జనితమై భువినీ, విను, కను, తిను, మూర్కొను, వచ్చును చను" అన్నారు.

జీవుడు, జాగ్రదావస్థయందు స్థూలశరీరము ద్వారా స్థూల భోగరూపంగా ప్రారబ్ధ మనుభవించుచున్నాడు. శరీరముచే సుకర్మయో దుష్కర్మయో చేయుచున్నాడు. తన శరీర బలముపయోగించి యితరులకు సహాయపడుట, దేవ, గురు, బ్రాహ్మణులను పూజించుట, శౌచము, సత్ప్రవర్తనము బ్రహ్మచర్యము అహింస యిత్యాదులు సత్కర్మలు, హింస, చౌర్యము, వ్యభిచారాది క్రియలు దుష్కర్మలు. శరీరముచే సత్కర్మ మాత్రమే చేయుచుండుటయే శారీరక తపస్సని శారీరక సంయమనమని చెప్పబడుచున్నది.

అంతశ్శౌచము (అనగా అంతఃకరణ పవిత్రత) ప్రధానంగాని, బాహ్యశౌచముతో పనిలేదని కొందరందురు. యీ శరీరము మలమూత్రములకొంప, శ్లేష్మరక్త కఫ మాంసాది అరోచక పదార్థములకు పుట్టిల్లు. ఈ చిల్లుకుండ నుంచి అన్ని రంధ్రముల ద్వారా నిత్యమూ రకరకముల మాలిన్యములు స్రవిస్తూనే వుంటాయి. యిది కల్లుకుండవలె మహా అపవిత్రమైనది. యీ శరీరమును శుద్ధ మొనర్పజూచుట నిరర్థకము. యిది "కాటికేగాని కొరగాదు గవ్వకైన" అని పెద్దలంటుంటారు. అంటే, శరీరమందు దురభిమాన రూపమగు దేహవాసన నశించుటకై చెప్పిన మాటలు మాత్రమేగాని శరీర శౌచమును విసర్జించి, గాడిదవలె పందులవలె, బ్రతుకుమని చెప్పుటకాదు. అంతశ్శౌచము అనగా అంతఃకరణశుద్ధి ప్రధానమనుటలో సందేహంలేదు. అంతఃశ్శౌచమునకు బాహ్యశౌచ సహాయకారి కాగలదు.

ఈ శరీరమందలి రక్త మాంసములకు ప్రాణమనస్సులు సూక్ష్మ భాగములుగా నున్నందున పరిశుద్ధమైన ఆహారపానీయములనే వినియోగించిన వానిమనఃప్రాణములు పరిశుద్ధముగా నుండగలవు. పరిశుద్ధాహారమనగా పాప విధంగా గాక, ధర్మ పద్ధతిగా స్వకష్టార్జితముచే సంపాదింపబడినదని యెరుగవలెను. కనుకనే "ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః" అని చెప్పబడినది.

మరిన్ని "దేహోదేవాలయప్రోక్తః జీవో దేవస్సనాతనః" దేహము దేవాలయముగా చెప్పబడినది. ఏలననగా జీవుడు దేవుడే కనుక అని తాత్పర్యము. దేవాలయము వంటి దేహమును ఎంత పరిశుద్ధముగానూ పవిత్రముగానూ యుంచవలె? తమ యిష్టదైవము యొక్క దేవాలయము నెవ్వరైన అపవిత్ర మొనర్చుకొందురా? దేవాలయమునందే బాగమైన శిథిలమగుచో, వెంటనే బాగుచేయింతురు గదా. అట్లే దేహమునందు వ్యాధులు రాకుండా కాపాడవలెను. వచ్చిన వ్యాధుల, ననేకోపాయముల నివారణ గావించు కొనవలెనేగాని, "దేహమేవిధంబుననుంచ నిల్వదు" గదా! యని దానిని నిర్లక్ష్యంచేసి, కావలెనని ఎవ్వరూ దానిని కూలబెట్టరు గదా! "శరీర మాద్యంఖలు ధర్మసాధనం" అన్నారు పెద్దలు.

నీ ధర్మ కర్మలు చక్కగా జరుగవలెనంటే శరీరమును జాగ్రత్తగా కాపాడవలెను. అందుకు

శరీర శౌచము, ఆరోగ్యము ఎంతో ప్రధానములు. కనుకనే అష్టాంగయుతమగు యోగమార్గమున, యమనియమ, ఆసన, ప్రాణాయామములను పూర్వాంగములు శరీర సంశుద్ధికై నిర్ణయింపబడినవి. ఏ సాధనలకైననూ శరీరారోగ్యము ముఖ్యావసరమే.

ప్రకారాంతరముగ, విచారించినచో ఛాందోగ్యోపనిషత్ నిర్ణయించిన త్రివృత్కరణ విధానమందు, రక్తమాంసములకు క్రమంగా ప్రాణమనంబులు సూక్ష్మాంశములై యున్నవి. రక్తమాంస యుతమగు స్థూలశరీరము చక్కగా ఆరోగ్యవంతమై యుండిననే, ప్రాణమనో రూపమగు సూక్ష్మ శరీర సంబంధ రూపమగు తెలివియు చక్కగా నుండగలదు. యీ విషయమునే ఛాందోగ్యోపనిషత్ కథా రూపమున వివరించినది. వేదశాస్త్రములు చక్కగా నేర్చిన విద్యార్థి గురువాజ్ఞ ప్రకారం 14 రోజులు అన్నము ముట్టక యుండినందున అది వరకు అతని కంఠస్థ విషయములు కూడా జ్ఞప్తికి రాకుండాపోయెను గదా! కనుక శరీర పోషణయందు ఏమరక యెంతటి వేదాంతులును కడు జాగరూకులై యుండవలెను. శరీర స్వాస్థ్యములేనిచో మనసెంత మాత్రమూ దేని యందునూ నిలువజాలదు. "చచ్చేటప్పుడు సంధ్యమంత్రమా" అను సామెత యీ విషయమునే బలపరుచు చున్నది.

స్థూల సూక్ష్మకారణ మహాకారణ దేహములన్నియు ఆత్మ పరిణామములే. కనుకనే "ఐతదాత్మ్యమిదం సర్వం" అని వుపనిషద్వాక్యము ప్రవర్తిల్లినది. స్వరూప నిశ్చయార్థమున్ను పరిశీలనార్థమున్ను మాత్రమే దేహీ దేహ విభాగము చేయబడినదిగాని దేహీ దేహములు రెండూ యొక్కటిగానే తెలియవలెను. కనుకనే శ్రీ ఆదిశంకరులవారు కూడా "యథామృణ్మయో కుంభం తద్వత్ దేహోపిచిన్మయః" అని సెలవిచ్చినారు.

స్థూల శరీరము కర్మశరీరమనీ, కురుక్షేత్రమనీ, అభివర్ణింపబడినది. స్వర్గాది పదవుల పొంది తేజోమయ శరీరములతో ఆనందించు వారికీ కర్మశరీరములేదు. అటనుండి వారింకనూ యూర్ధ్వలోకములను చెందవలెనంటే ముఖ్య పరికరము(పనిముట్టగు) అగు ఈ కర్మ శరీరము లేకపోవుటచే వారికి సాధ్యము కాదు. తిరిగి భూలోకమున కర్మ శరీరధారులై జన్మించి సాధనలు చేసుకొనవలసినదే.

కనుకనే "దుర్లభం మానుషం దేహం" అని అభివర్ణించబడినది. యిట్టి శరీరం లభించినందుకు మనమెంతో గర్వించి యీ శరీర సాధనమును అనగా ఈ పనిముట్టును దుర్వినియోగం చేయరాదు. గురుపరమాత్మచే ప్రసాదింపబడిన యీ పరికరమును గురుసేవకై మాత్రమే కైంకర్యము చేసి గురుకృపా సంసిద్ధి పొందుట గురుపుత్రుల కందరికి పరమ ధర్మమై యున్నది.



# అంతఃకరణము

అంతఃకరణము అనగా లోపలి పనిముట్టుఅని శబ్దార్థం. దేని లోపల? పిండాండము లోపలనా? బ్రహ్మాండము లోనా? పిండాండముకూడా బ్రహ్మాండములోనిదే కనుక బ్రహ్మాండము లోపల అని అర్థము చెప్పుకొంటే, రెంటియొక్క అంతరమూ మన ఆలోచనా పరిధిలోనికి రాగలదు. పిండాండమునకు కరచరణాద్యవయవములు నానావిధ యింద్రియములు పనిముట్లుగా నున్నట్లుగా బ్రహ్మాండమునకున్ను పనిముట్లున్నట్లున్ను, అందు అంతఃకరణము లోపలి పనిముట్టనిన్ని చెప్పి నట్లగుచున్నది? అట్లయితే, బాహ్యకరణములు (బైట పనిముట్లు) ఏవి? సూర్య చంద్రాదులు, పంచ భూతములు, మొదలైనవి బాహ్య పనిముట్లుగా నుండి, కాలత్రయములయందు (వేసవికాలము, వర్షాకాలము, శీతాకాలము) సకల కార్యకర్మములు బ్రహ్మాండమునందు జరుగుచున్నవి గదా!

అంతఃకరణము యొక్క స్థానస్వరూప స్వభావములను వ్యష్టి సమష్టులయందు గుర్తించుటకుముందు, శ్రుతి ప్రమాణముల నించుక పరిశీలించుట అవసరము.

1) శ్రుతి : "సదేవసౌమ్యేదమగ్రమాసీత్" = సృష్టికి పూర్వము సత్పదార్థ మొక్కటే యుండెను.

2) శ్రుతి : "ఆత్మాఉ ఏకస్సన్ ఏతత్రయం" = ఆత్మయే ఏకైక సత్పదార్థము. అది త్రివిధ రూపంగా నున్నది.

3) శ్రుతి : "మనఃప్రాణవాచా సంఘాతం సత్తా = మనఃప్రాణ వాక్కుల సమిష్టియే సత్పదార్థము.

సృష్టికి పూర్వం, సద్రూపమైన, ఏక మాత్రమగు ఆత్మయే వుండెనీ, అదే మనఃప్రాణ వాగ్రూపములుగా నుండేవనీ, యీ శ్రుతులను పరిశీలించినచో స్పష్టమగుచున్నది. యిది ఎట్లు సాధ్యము? అంటే, తెలివి రూపముగా అనగా సంకల్ప రూపంగా వ్యవహరించినపుడు ఆత్మకే మనస్సుని పేరు. సకల కర్మలకు ప్రాణరూపమగు చలనమే కారణముగా నుండును. కనుక కర్మరూపముగా వ్యవహరించునపుడు యీ ఆత్మకే ప్రాణమని పేరు కల్గెను. సృష్టి పరిణామమున ప్రధమమున శబ్దతన్మాత్ర, దాని స్థూల పరిమాణము శబ్ద గుణకాకాశము. కనుక సృష్టి కారణమై యున్నపుడీ ఆత్మయే వాక్కను నామముచే వ్యవహరింపబడును. శబ్దతన్మాత్ర వ్యష్టీ సమిష్టిగా రెండు రూపములలో విమర్శించబడినపుడు సమిష్టియే అంతఃకరణముగా సాంఖ్యములో పేర్కొనబడుచున్నది. అంతే గాని మనః ప్రాణ, వాక్కులలో, వేరుగా ఒక్క వాక్కు మాత్రమే పరిణమించెననీ, మనఃప్రాణములు వేరుగా విలక్షణముగా నిలచియున్నవనీ అంతఃకరణము వేరనీ, వ్యష్టి రూప యింద్రియములు వేరనీ భావించరాదు. "తెలుపు, మృదుత్వము, మధురము గల వస్తువు చక్కెరనుచు కనుగొన్నట్లే తెలివి శరీరము, జగంబులుగల వస్తువు బిందువనుచు గనుగొనరాదా?" అని శ్రీ కృష్ణదేశికేంద్రులు తెలుపుచున్నారు. బిందువే అంతఃకరణము. యిది ఏకమాత్రమగు వస్తువేకాని తెలివి, శరీరము, జగంబులని పేర్లు యిదియే వహించుచున్నది. తెలివియే మనస్సు. శరీరమే ప్రాణము. జగత్తే వాక్కు అని గ్రహించవలెను.

శరీరమే ప్రాణమనీ, జగత్తు వాక్కనీ అనుట ఎట్లు? అని సందేహము కలుగవచ్చును.

ఈ అన్నమయ కోశమగు స్థూల దేహమును జూచి యిది శరీరమనుకొనుట పొరబాటు. స్థూల దేహము యిల్లు వంటిది. యిందున్న ప్రాణరూపమగు శరీరమే శరీరమనదగును. అదియే పిండాండము. కనుకనే "పిండం కుండలినీ శక్తిః" అని గురుగీత చెప్పుచున్నది. అట్లే జగత్తుగా పరిణమించుటకు వాక్ (శబ్దతన్మాత్ర) మూలకారణముగా నున్నది. కనుక కారణవస్తు దృష్ట్యా వాక్కే, జగత్తు కనుక మనస్సు వాక్కు ప్రాణం అన్ననూ, మనస్సు వాక్కు శరీరములన్ననూ, తెలివి జగత్తు శరీరములన్ననూ, ఒక్కటే. బిందువన్నా, ఎరుకన్నా, అంతఃకరణమన్నా యొక్కటే. ఈ అంతఃకరణమే వ్యష్టియందు జ్ఞాన, మనో, బుద్ధి, చిత్తాహంకారములను అంతరేంద్రియ పంచకంగా నుండుటమాత్రమేగాక సర్వేంద్రియముల రూపంగా యిదియే వ్యవహరించుచున్నది.

"అనుమానము మదినుంచక, వినుమింకను యెరుకపేర్లు వివరించెద. బుద్ధ్యన చిత్తంబన మానసమనిన నహంకార మనిన అంతఃకరణనినన్ సంకల్పమంచనినా యిచ్చునినన్" అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చినారు.

కారణ కార్యరూపమగు సమస్త చరాచరములయందు యీ మనఃప్రాణవాక్కులు ఎదో రూపంలో 'ఆబ్రహ్మ స్తంభపర్యంతంగాన వస్తూ యున్నవి. జ్ఞానకర్మ స్వరూపములకూ, నామ రూప క్రియా నటనలకూ, యీ మనఃప్రాణ వాక్కులే కారణము. సచ్చిదానందరూపమై, సర్వమునకూ మూలమైయున్న, మూలంలేని గుర్తెరిగే శరీరము యీ మనఃప్రాణవాచా సమిష్టియే. యిదే లేనియెరుకయనీ, దీని రహితము నందే పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క నిశ్చయమనీ అచల ఋషుల తాత్పర్యము.

సృష్టికి పూర్వమున్న ఆత్మయే అంతఃకరణమా? అయినచో అది దేని అంతర మందున్నది! అదే అంతా అయితే, అది దేనియందుండగలదు? అది కానిదొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. పరిపూర్ణ పరబ్రహ్మమునందేదియు లేదుకదా! యిక అతఃకరణమను పేరెట్లు సార్థకము? అంతఃకరణము ఆత్మలోపల నున్నది అని సమాధానము చెప్పాలంటే, ఏభాగము నందు ఏవైపు, ఏ మూల అను ప్రశ్న వస్తుంది. బెల్లము నందలి తీపి ఏ స్థానమందున్నది? అంటే సర్వత్ర అని అనవలసిందేకదా! అట్లే ఆత్మయందు మనఃప్రాణ వాగ్రూపముగా నున్న అంతఃకరణము ఏ స్థానమందున్నది? సర్వత్ర అనే జవాబు చెప్పాలి. ఆత్మయందుసర్వత్ర అంతఃకరణముంటే ఆత్మయే అంతఃకరణమనుటలో దోషమేమి? ఐతే, "అంతః+కరణము-లోపలి పనిముట్టు అని ఎందుకన్నారు? అని ప్రశ్న మిగిలిపోతోంది. మనఃప్రాణవాక్కుల లక్షణములు సృష్టికి పూర్వము ఆత్మయందు బహిరంగముగా గానవచ్చుటలేదు. కాని యీ మనఃప్రాణ వాక్కుల యొక్క ధర్మములు,లేక లక్షణములు, ఆత్మయందు నిగూఢంగా నిక్షిప్తమయ్యేవున్నవి. అనగా బీజరూపంగా నున్నవి కనుకనే మనఃప్రాణవాగ్రూపముల సమిష్టి రూపమునకు లోపలి పనిముట్టు అంతఃకరణమని పేరువచ్చినది. అట్లనుటకు మనఃప్రాణ వాక్కులు బహిరంగంగా కానరాకపోవుటయే కారణము ఐతే దానిని పనిముట్టు అని అనవచ్చునా? అనవచ్చునంటె ఎవరిచేతి పనిముట్టు! అని అడగవలసియుండును? పనివాడూ, వానిచేతి పనిముట్టూ అని రెండూ చెప్పవలసివస్తే అద్వైత హానియగును. కనుక పనివాడూ

అదే, పనిముట్టూ అదే అని అనకతప్పదు. కనుకనే "అన్నియు తానై తనకవి పన్నుగ వేరనుచు నోట బల్కుచు మరి తానన్నిటి నెరిగే యెరుకై యున్నానని, యెరుక కెరుకే యూహింపుచుండూ, తనలో తానే మోహింపుచుండూ," అని కృష్ణదేశికేంద్రులు సెలవిచ్చినారు.

ఈ మనఃప్రాణవాక్కులు పిండబ్రహ్మాండముల యందెట్లున్నవో ఛాందోగ్యోపనిషత్, త్రివృత్కరణ విధానములో ప్రతిపాదించుచున్నది. మనఃప్రాణవాక్కులు వాని స్థూలాంశములగు పృధ్వి జలాగ్నులతో గూడినచో బ్రహ్మాండమనిన్ని యీ మనఃప్రాణ వాక్కులే మధ్య మాంశములగు మాంసరక్త, అస్థులతో గూడినచో పిండాడమనిన్ని పేరు. అంతఃకరణ లేనిదీ అంతఃకరణ గానిది యొక్క పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే.

# త్రికరణశుద్ధి

మనస్సు, వాక్కు ప్రాణము ఈ మూడింటిని కలిపి త్రికరణములందురు. ఈ త్రికరణములయందు గల దోషములు, తన్నివారణోపాయములు తిరిగి వానికి దోషమంటకుండా ప్రవర్తించు విధానము మొదలగు విషయములు విపులముగా వివరింపబడినవి.

మనఃప్రాణవాక్కులు మూడుగా ఒక్క అంతఃకరణమాయెననీ, అంతఃకరణము. ఆత్మయొక్క స్థూలరూపమనీ కూడ గమనింపవలెను. యీ మూటియొక్క ప్రత్యేక దోషమేమి? మనస్సు సహజంగానే ద్వంద్వ స్వరూప వ్యవహారముజేయుచు సంకల్ప వికల్ప రూపముగా పనిచేయుచున్నది. ఈ సంకల్ప వికల్పములు తిరిగి ద్వంద్వ స్వరూపంగా వ్యవహారము చేయుచున్నవి. ఎట్లనగా 1) శుభసంకల్పము, శుభ సంకల్పము యొక్క వికల్పము. 2) అశుభ సంకల్పము (దుష్ట సంకల్పము) దానియొక్క వికల్పము. ఈ రీతిగా ద్వంద్వ స్వరూపముగా మనో వ్యాపారము జరుగు చుండును. అట్లే వాక్కు ద్వంద్వ స్వరూపంగా నుండి సత్యా సత్య సంభాషణ గావించును. లేదా ఒకప్పుడు ప్రేమ రూపంగా ఆదరణ రూపంగా గౌరవ రూపంగా సామ్యముగా మాట్లాడును. మరియొకపుడు ద్వేష రూపంగా నిరాదరణముగా అగౌరవంగా దౌర్జన్య రూపంగా హింసాత్మకంగా మాట్లాడును. శరీరము సేవా రూపంగా పరోపకారముగా అహింసాత్మకంగా పని చేయును. లేదా స్వార్థ ప్రయోజనాత్మకంగా, పరహింసాత్మకంగా వ్యవహారము చేయును. కనుక యీ త్రికరణములకునూ ద్వంద్వ పద్ధతి యుంటూనే యున్నది. అందువల్ల పుణ్య పాపఫల ప్రదములగు శుభాశుభా సంస్కారములు మానవున కేర్పడుచున్నవి. దృష్టాదృష్ట ఫలములు యిహమందు(ఈ జన్మ యందు) పరమందు (పరలోకముల యందు లేదా (యితర జన్మలయందు) అనుభవించుటకై జన్మ పరంపరల నెత్తుచున్నాడు.

ఈ త్రికరణముల యొక్క దోషములను వేర్వేరుగా నివారించి శుద్ధి చేయుటయా? లేక వాని సమిష్టి రూపమగు అంతఃకరణ శుద్ధి సాధించుటయా? యేది సులభోపాయమో మనము గమనించవలసియున్నది. ఒక చిన్న దృష్టాంతము వలన ఈ విషయము స్పష్టము కాగలదు. ఒకనికి ఒక రోగము వచ్చినది. రోగ లక్షణము లనేకముగా శరీర వివిధ భాగముల యందు రకరకములుగా బాధపెట్టుచుండును. వేరు వేరు స్థానములయందు వేర్వేరు

విధములుగా బాధించు నొక్కొక్క లక్షణమునకు ఒక్కొక్క మందు చొప్పున వేయుట మంచిదా? లేక ఆ వ్యాధికి మూలకారణమగు దోషము వాతపిత్త శ్లేష్మాదులలో నేదియో గుర్తించి దానికి తగు చికిత్స చేయుట మంచిదా? రోగ మూలములను గుర్తింపక రోగ లక్షణములకు మాత్రము చికిత్స చేసినచో తాత్కాలిక ప్రయోజనము మాత్రమే యుండగలదు. శాశ్వత ప్రయోజన ముండజాలదు. అట్లే త్రికరణ దోష నివారణకై వానిమూటికి మూల కారణమగు ఏకైక దోష మేదియో గుర్తించి దానిని తొలగించినచో దోషశుద్ధి కాగలదు. కుండల దొంతరలో అడుగుకుండ దీసినచో అన్నియు పడిపోవునట్లు, తల్లివేరు ఛేదించిన వృక్షమంతయు నశించునట్లు, త్రికరణ శుద్ధికై ఆ త్రికరణ దోషములకు మూలమేదియో గమనించి దాని దోష మేదియో గుర్తించి నివారించవలసి యున్నది.

ఈ మనో వాక్శరీరముల సమిష్టి రూపమే అంతఃకరణమనీ వ్యష్టి సమిష్టి రూపంగా పిండబ్రహ్మాండములనుండు అంతఃకరణ యొక్కటియే అని అదే ఏకైక రూపమగు పరమాత్మగా నున్నదని గమనించగలము. కనుక దోష మూలము పరమాత్మ స్థానమందే యున్నది. యిదే క్షరాక్షరోపాధిద్వయ దోషము. దీని నివారణయందే ఆత్మశుద్ధి, అంతఃకరణశుద్ధిత్రికరణశుద్ధి, సర్వము సిద్ధించగలవు. యీ పునాదులపైననే పరిపూర్ణ బోధ సిద్ధాంతము ప్రతిపాదింపబడినది. కనుకనే పరిపూర్ణ బోధ గురు పరంపరా పురుషులలో నొకరగు వేమన "ఆ॥వె॥ ఆత్మశుద్ధిలేని ఆచార మదియేల? భాండశుద్ధి లేని పాకమేల? చిత్తశుద్ధి లేని శివపూజలేలయా విశ్వదాభిరామ వినురవేమ" అని చెప్పినారు.

అన్నిటికి మూలకారణమగు ఆత్మశుద్ధి ప్రధానము. (అది లేనిచో త్రికరణములచే ఏ విధముగా నడచినా) ఏట్టి సదాచార సంపన్నుడైనా పూర్ణ ప్రయోజన ముండజాలదు అని భావము. కల్లుముంతలో పాయసాన్నము వండినట్లే కాగలదు.

మనస్సులో భావించినట్లే వాక్కుచే మాట్లాడవలెను. వాక్కుచే మాట్లాడినట్లే శరీరముచే చేయవలెను. యిదే త్రికరణశుద్ధి. సాధకుని ప్రవర్తన యీ రీతిగా నుండదగునని సామాన్యా భిప్రాయము. కాని విచారించినచో యిది ఎంతకష్టమో మీదు మిక్కిలి ఎంత అనర్థదాయక మగునో యూహించదగును. ఉదా: సాధకుని అంతఃకరణయందు అనేక పాప సంకల్పము లుదయించవచ్చును. ఆ పాప సంకల్పములను నోటితో పైకిచెప్పి శరీరముచే కార్యరూపము నందుంచనగునా? కూడదుగదా!

మరియు యిదే త్రికరణశుద్ధి యగుచో దీనిని పాటించవలెనంటే ఎంతకష్టము? యిట్టి త్రికరణశుద్ధి పాటించవలెననుటలో కూడ కొన్ని మినహాయింపులు పెద్దలు పాటించియే యున్నారు. ఎట్లనగా, సత్యంబ్రూయాత్ ప్రియం బ్రూయాత్ నబ్రూయాత్ సత్యమప్రియం= నిజంచెప్పు. హితమైన నిజంచెప్పు. అప్రియమైనది సత్యమైనా జెప్పవద్దని దీని భావము. యిందు చాలా లౌక్యము యిమిడి యున్నది. అయిష్టమైన సత్యము చెప్పవద్దనుటలో ఆ సత్యమొక్కర్కి ప్రియము మరియొక్కర్కి అప్రియము కావచ్చును. అపుడేమి చేయవలెను?

యిందు కుదాహరణముగా యీ దిగువ కథను తీసుకొనవచ్చును. ఒక ఋషి తన

పర్ణకుటీరము ముంగిట కూర్చుని ధ్యానము జేసుకొనుచుండెను. ఒకడెవడో మహాభయముతో పరుగెత్తుకొనుచూ వచ్చి ఋషి ఆశ్రమములోనికేగి దాగుకొనెను. అతడు పరుగెత్తి వచ్చిన పాదముల సవ్వడికి ఋషికి ధ్యానభంగమై, తన ఆశ్రమంలో తలదాచుకొంటున్నట్టు స్పష్టంగా చూచియే యుండెను. వెనువెంటనే మరియొకడు భయంకరాకారముతో చేత కత్తిబూని మొదటి వానిని తరుముకొనుచూ వచ్చెను. అతడీ ఋషిని చూచి "యిటు పరుగెత్తుకొంటూ వచ్చినవాడేడి?" అని ప్రశ్నించెను. ఋషికి పచ్చి వెలగకాయ గొంతుక బడినట్టుయ్యెను. నిజం చెప్పినచో రెండవవాడు మొదటి వానిని చంపును. ఈ హత్యాదోషములో తాను పాలుపంచు కొనవలసి వచ్చును. అబద్ధమాడుట త్రికరణశుద్ధికి భంగము అవుతుందేమో అని క్షణమాలోచించి యిట్లనెను. "చూచిన కన్నులు మాటలాడలేవుగదా! మాటలాడే నోరుచూడలేదు గదా నేనేమి చెప్పాలి?" అనెను. యీ మాటలేమీ అర్థం కాక యీ ఋషికి మతేపోయిందనుకొని రెండవవాడు ముందుకు సాగిపోయెను. ఈయుక్తివలన ఋషి నిజానిజములు చెప్పనక్కరలేకుండా తప్పించుకొనగల్గెను. ఈ కథ అబద్ధమో నిజమో కాని, ఋషి వాక్యములయందు యెంత లౌక్యము, కృత్రిమము, మోసము, కుయుక్తి యిమిడి యున్నవి? కండ్లద్వారా చూచేదీ, నోటిద్వారా మాట్లాడేదీ ఒక మనస్సని తెల్సియే ఋషి యుక్తి జేసి విజ్ఞానం లేని యా మానవుని మోసగించెను గదా! యిది త్రికరణశుద్ధి కాగలదా? సత్య సంభాషణమొకరికి ప్రియమై మరియొకరి కప్రియమగు నెడ మౌనము వహించుటయే ధర్మము. యెక్కువమందికి శ్రేయస్సు కలిగించితే సత్యమునే వచించనగును.

మరియొక దృష్టాంతము చూడుము. ఒకే ముఠాకు జెందిన నల్గురు దొంగలు ఒక రాత్రి ఒక్కొక్క రొక్కక్క వైపుగా పోయి దొంగతనంగా సంపాదించిన ద్రవ్యమంతయూ ఒకచోట చేర్చి సమానంగా పంచుకొందురు. ప్రతి ఒక్కనికీ తానెంత దొంగిలించెనో వాని మనస్సుకు తెలుసును. తక్కువ చెప్పకుండా యింత దొంగిలించితినని చెప్పును. చెప్పినంతే తెచ్చి రాశిలో చేర్చును. వారిలో నాయకుడు న్యాయంగా ఆ దొంగ సొత్తును నాలుగు వాటాలుగా పంచును. యిదియును త్రికరణశుద్ధి కాగలదా? ఆదిలో పాపరూపమగునది, చివర వరకు పాపరూపమే యగును గదా!

తలచినదే పలుకుట. పలికినట్లే చేయుట. యిదే త్రికరణ శుద్ధి యింతకంటే ఏమీ లేదు అనుట పూర్తిగా సరిగాదు. సర్వత్రా సర్వసందర్భముల యుందూ సాధ్యమూ కాదు. మరి, కృష్ణ దాసుగారి కందపద్యములో "కం॥ మనసున, వాక్కున, తనువున, పనియొక్కటి జరుపునట్టి భక్తునికి దయన్ వినిపించుము, వినుమని యీ ఘనబోధను, వానికతుకగలదు దుకకుమీ॥" అని చెప్పలేదా! యిదే త్రికరణ శుద్ధి కర్థము అని వాదించవచ్చును. కాని యిదే త్రికరణశుద్ధియని ఆయన అనలేదు. శ్రవణాధికారియెవరో మాత్రమే యిందు చెప్పబడినది. సామాన్యభిప్రాయమింతే కావచ్చును. కాని జిజ్ఞాసి యింకనూ లోతుగా విచారించవలసి యుండును.

త్రికరణముల యందు సంయమనము గల్గి యధేచ్ఛగా వానిని వదలి వేయక

పరిశుద్ధంగా ప్రవర్తించుటయే త్రికరణ శుద్ధియనుటయే యుత్తమ భావము. పరిశుద్ధమగు సంకల్పము. ఆలోచనలు గలిగి యుండుటయే మానసిక తపస్సు. సమిష్టి శ్రేయస్సునకై స్వార్థరహిత సత్య సంభాషణ మొనర్చుటయే వాచిక తపస్సు. పరోపకార పారీణమగు సేవాధర్మమే శారీరక తపస్సు పారమార్థిక జీవనమునకు ఈ మూడునూ అత్యంత ముఖ్యము అనుటలో ఏమీ సందేహము లేదు. కాని గురుపుత్రులై పరిపూర్ణ బోధ గురుముఖతః గ్రహించి కృషిచేయువారు గమనించ వలసిన దేమనగా గురుమూర్తి వలన తెలుసుకొన్న పూర్ణబోధరీతిగానే తన జీవనమును సరిదిద్దుకొని, కర్మణా, మనసా, వాచా గురుసేవ చేయుచు వాంగ్మనశ్శరీరములచే తద్బోధ కనుగుణ్యంగా ప్రవర్తించుటయే త్రికరణశుద్ధి. బోధ యందారూఢత సాధించువరకు యీ విధానమగు త్రికరణ శుద్ధి పాటించవలసియుండును.

ఇక పరిపూర్ణ బోధయందారూఢుడై పరిపూర్ణతదనరు వాని విషయములో ఏ నిర్ణయములూ లేనేలేవు. ఏలననగా అతని అంతఃకరణమునకు పరిపూర్ణ బ్రహ్మమునందు స్థానమూ, మూలమూలేవని యీతని కారూఢత సిద్ధించినది. అతడే యశరీరి. అతని ప్రవర్తనకే నిబంధనలుండును? అట్లని, అతని వలన యెట్టి పాపకార్యములు జరుగనే జరుగవు. పరమాత్మ నిర్మిత విధానంగా కరములు తమ పనులు తామే గడుపుకొనునట్లుగా, సర్వవ్యవహారములు జరుగుచుండును. అట్టి వాని విషయంలోనే, శ్రీ భాగవతుల కృష్ణదాసుగారు యిట్లు సెలవిచ్చినారు. కందార్థము : కలనెడబాసిన మనుజులు కలలోపలి పనులు చేయగలవారననా, కలవారు గారు. వారల వలె యెరుకను గురుని చేతవద, లెరుకలో నా గలపని చేయవలదెరుకలోనా! కలవారంచని నోటపలుకుట మరయ పకలికేన వారికి తొలగాదు పాపాము. వదలెరుకలోనా! గలపని చేయవల దెరుకలోనా॥ రాజయోగ ధర్మమందు శిష్యుడెట్లుకర్మయందు నేర్పరితనము గల్గి, త్రికరణ శుద్ధి కొరకు యెట్టి ప్రవర్తన గల్గి యుండవలెనో సద్గురువు కృపకు పాత్రుడై తెలిసికొని ఆగామిరహితముగ శేషజీవితమును సాగించి కృతార్థుడు కావలసియున్నది.

# అహింసా పరమోధర్మః

"అహింసా పరమోధర్మః" అనగా ధర్మములలోకెల్ల అత్యుత్తమమైనది, అహింస అని చెప్పబడుచున్నది. హింసయనగా, యితర ప్రాణులకు (84 లక్షల జీవరాసులలో దేనికైనను) భయము, బాధ, కష్టము, ప్రాణహాని కల్గించుట హింస యనబడును. అహింస అనగా, అట్లు జరుపకుండుట, ఈ విధముగా ఏప్రాణికిన్ని ఏరూపంలోనూ ఎట్టి హింసయూ చేయకుండా వుండుట సాధ్యమా! కాదని రూఢిగా చెప్పవచ్చును. ఏలననగా, ప్రతి మానవుడును, ఏదో రీతిగా తెలిసియో తెలియకో హింస చేయుచునే వుండును. తన శరీరముయొక్క చిన్న కదలిక కూడ అనేక సూక్ష్మజీవులకు బాధ కలిగించవచ్చును. తినే తిండిలో, తాగే నీరులో, పీల్చెడి గాలిలో అనేక సూక్ష్మజీవులు నశించును. అంతేగాక తాను చేసెడి అన్ని పనుల(కర్మల) యందు, తనకు తెలియకనే జీవహింస జరుగుచున్నది. కనుక అహింస అనేది అనాద్యము. కనుక

బుద్ధిపూర్వకముగా ఇతడు శరీర ధన,మాన, ప్రాణకీర్తిప్రతిష్ఠలకు భంగముకలిగించు పనులు చేయకుండుట అహింస అని నిర్వచింపవచ్చును.

మానవుడు తన త్రికరణములచేత అనగా మనస్సు, వాక్కు, శరీరము, అను మూడింటిచేత హింస గావించు చున్నాడు. ఇతరులకు యేవిధముగా కీడు సంకల్పించిననూ, లేక తలంచినను అది మనస్సుచే చేయబడు హింస, దూషించుట అసత్యారోపణలు గావించుట, చాడీలు చెప్పుట, తిట్టుట మొదలగునవన్నియు వాక్కు చేయు హింస, తన శరీరాయవములచే యితరులను కొట్టుట, చంపుట, యితరుల సొత్తు హరించుట మొదలగునవి చేయుట శరీరముచే చేయబడు హింస. యితరుల కీర్తి ప్రతిష్టలకు హాని కల్గునట్లు వ్రాతలు వ్రాయుట బొమ్మలు వేయుట మొదలగునవి కూడా శరీరము చేసే హింసలోనికి చేరును. కనుక పశు, పక్షి, క్రిమికీటకాదులను చంపుట లేక యితర విధముగా హింసించుట మాత్రమే హింస అని అనుకొనరాదు.

స్థూలంగా విచారిస్తే హింసాకార్యములుగా తోచబడినా హింసకాని కార్యములు చాలా యున్నవి. 1) ఆహారముకొరకు, ఆకలి బాధ నివారణ చేసుకొనుటకు, ఔషధరూపంగా వినియోగించుటకు యితర జీవులను చంపుట హింసకాదు. ఏలననగా ప్రకృతియందు పరిశీలించి చూచినచో "జీవో జీవస్య భక్షణం" అనగా ఒకజీవికి మరొకజీవి ఆహారముగా వినియోగింపబడుచున్నది.

2) తనకుగాని, సంఘమునకుగాని, మతమునకుగాని, దేశమునకుగాని, ప్రభుత్వమునకుగాని అక్రమముగా కీడుగలిగించు దుష్టజీవులకు హాని కలిగించుట లేక చంపుట హింసగాదు. దుర్మార్గులగు మానవులు, క్రూర జంతువులు, లేక బాధకరమగు క్రిమికీటకాదులు మొదలగునవి యన్నియు యీ తరగతిలోనికి వచ్చును. అట్లే శత్రు సైన్యములను యుద్ధమునందు చంపివేయుటకూడా హింసకాదు.

3) విద్యాబుద్ధులు చెప్పెడిపట్ల, వైద్య విధానములందు ఆరోగ్య క్షేమములు కలిగించుపట్ల ప్రయోగించెడి పద్ధతులు హింసకానేరవు. ఉదాహరణకు : 1) బాలబాలికలకు విద్యాబుద్ధులు నేర్పుటలో, వారిని మందలించుట తిట్టుట కొట్టుట మొదలగునవి హింస కానేరవు 2) రోగికి శస్త్ర చికిత్స పథ్యపానాదులు ఔషధసేవ చేయించుట మొదలగు వానియందు చేయు హింస హింసకానేరదు.

4) ఆత్మరక్షణకై అనగా తన ధన, మాన,ప్రాణాదులను రక్షించుకొనుటకై చేయు బలాది ప్రయోగమున్ను హింస కానేరదు.

"పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనం" అను ఆర్యోక్తి ప్రకారం పరపీడనమువల్ల పాపము సంభవించును. కనుక పరపీడనము (లేక హింస) దూష్యమైనది. పూర్వజన్మలయందు చేసిన దుష్కృతములవల్ల దుష్ట సంస్కారము లేర్పడి జన్మాంతరముల యందు దుఃఖప్రాప్తిని కలిగించు అదృష్టమగు (కానరాని) కర్మఫలమే పాపమనబడును. పైన యిచ్చిన వుదాహరణలయందు చేయబడిన కర్మ దుష్కృతమనిగాని, దుష్టసంస్కారోత్పత్తికి

హేతువగుననిగాని చెప్ప వీలులేదు. కనుక అట్టి కర్మవలన ఎట్టి పాపమున్నూ సంభవించదు. కనుక అట్టి కర్మ హింసాత్మకమని చెప్పరాదు.

"మమాత్మా సర్వభూతాంతరాత్మా" అనగా నాయాత్మయే సర్వప్రాణి కోటియందునూ అంతరాత్మ రూపంగా నున్నది. అంతేగాదు. సర్వమూ ఆత్మస్వరూపమే లేక గురురూపమే అయివున్నప్పుడు ఏ ప్రాని కెట్టి హింసచేసిననూ అది తనకు తాను బాధ కలిగించుకొనుటే యగును. అంతే గాదు. ఆత్మద్రోహమూ, గురుద్రోహమూ అగుచున్నది. కనుక ముముక్షువులు అహింసా వ్రతము పూనవలసియున్నది అని సర్వమతములు శాసించుచున్నవి. "తానే సర్వము సర్వమునందు తానే" అనే ఆత్మదృష్టి దృఢమగుటకు అహింసా వ్రతము పూనుట ముముక్షువులకు ముఖ్య కర్తవ్యమై యున్నది.

అహింసను వ్రతముగా పూనుట గృహస్థులైన రాజయోగులై వున్నవారికి సాధ్యమా? అని విచారించవలసియున్నది. ఏలననగా తానూ, తన్నాశ్రయించినవారూ బ్రతుకవలెను. కనుక తన స్వార్థము కొరకు కొన్ని కర్మలు అనివార్యముగా చేయక తప్పుటలేదు. ఫలప్రాప్తిని కోరుటయు తప్పుటలేదు. అట్లు కర్మలు చేయుటలో యితర ప్రాణులకు అనివార్యముగా కొంత హింస జరుగుచున్నది అని తెలిసికూడా కర్మచేయుట జరుగుచున్నది. యిది అహింసావ్రతమునకు భంగముకాదా అని శంక కలుగవచ్చును. కాని కర్తృత్వరహితముగ, కర్మ యొనర్చినచో అందలి పాపములంటవు. కర్తృత్వరహితమే భగవద్గీత యందు "యోగఃకర్మసుకౌశలం" అని చెప్పబడినది. గురుముఖతః నిజమగు కర్తను గుర్తించినగాని కర్తృత్వరహిత విధానము సిద్ధించదు అని తెలియవలెను.

# పూర్ణయోగము

ఆత్మయే విజ్ఞానఘనము చిద్ఘనము అయివున్నది. "జ్ఞానా దేవతు కైవల్యం" అని చెప్పబడినది. ఒకే ఆత్మ, ప్రేమ(భక్తి) రూపము అఖండ జ్ఞాన రూపము అయివున్నది. కనుక తదుపలబ్ధికి, ఆ భక్తి జ్ఞాన మార్గములు రెండున్నూ గ్రాహ్యములే. అందొకటి హేయము. రెండవది ఉపాదేయము యనుట ఎంతటి అపచారము?

"ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల? భాండశుద్ధిలేని పాకమేల? చిత్తశుద్ధిలేని శివపూజలేలయా ॥విశ్వ॥ అని వేమన యోగీంద్రులన్నట్లు అంతఃకరణశుద్ధి లేనివానికీ భక్తి జ్ఞాన మార్గములలో ఏదియు ఫలించదు. కనుక సత్కర్మానుష్ఠానముచే అంతఃకరణ శుద్ధిగావించుకొనుట ప్రథమ కర్తవ్యము, మనోవాక్శరీరముచే కర్మ చేయబడుచున్నది. గనుక త్రికరణశుద్ధి యెంత ఆవశ్యకమో చెప్పనక్కరలేదు. కనుకనే శ్రీభాగవతకృష్ణ దేశికేంద్రులవారు, కం॥ "మనసున, వాక్కున తనువున, పనియొక్కటి జరుపునట్టి భక్తునకుదయన్ వినిపించుము వినుమని యీ ఘనబోధను వాని కతుకగల దుడుగకుమీ॥" అని శెలవిచ్చినారు. త్రికరణ శుద్ధిగలవాడే భక్తుడు. అట్టి వాడే ఈ బోధవినుటకు పూర్ణాధికారి అని భక్తి లక్షణములు పూర్ణాధికారి లక్షణములున్ను ఒక్క కందపద్యములో శెలవిచ్చి నారు. భక్తనామము సార్థకమగుటకు

త్రికరణశుద్ధి అత్యావశ్యకము. ఏలననగా భయముతో గూడిన ప్రేమకే భక్తి యను పేరు తగియున్నది. భయము లేనిచో నిది భక్తియే కాజాలదు. ఉదాహరణకు పితృభక్తిగైకొందము. పుత్రునికితండ్రియందు ప్రేమ యుండును గాని పితృ ఆజ్ఞాపరిపాలనము చేయనిచో తండ్రి శిక్షించునేమోయని భయముకూడా నున్నపుడే అది పితృభక్తికాగలదు. అట్లే ఆత్మ ప్రేమ, మాత్రముండిన చాలదు. పరమాత్మ సత్యస్వరూపుడు. ధర్మ స్వరూపుడు, శాంతి స్వరూపుడు, ప్రేమ స్వరూపుడు కనుక ఆ సత్య ధర్మ శాంతి ప్రేమల కనుకూలవిధముగా ప్రవర్తించినపుడే అతడు నిజమగు భక్తుడు. లేనిచో ఆత్మద్రోహియేయగునుగానిభక్తుడు గాజాలడు.

"స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే" అని శంకరాచార్యులవారు భక్తిని నిర్వచించియున్నారు. అన్నపుడు స్వస్వరూపాను సంధానమునకు యోగాంగములగు యమనియమములు ధ్యాన ధారణలు కూడా కొంతవరకు అవసరమే గదా! కనుక కర్మ భక్తి జ్ఞానములతో పాటు యోగ పద్ధతియు సాధనకు అవసరమే యగుచున్నది. ఐతే "జ్ఞానం వినా మోక్షోనసిద్ధ్యతి"అని అన్నారుకనుక జ్ఞాన మార్గమునకు కర్మ భక్తి యోగములు పూర్వాంగములు కావచ్చును. శుద్ధమైన కాని జ్ఞానమార్గమొక్కటియే మోక్షదాయకము" అని అందురు కాని జ్ఞాన సాధనాకలమందు (అనగా శ్రవణ మనన నిధి ధ్యాసలు చేయు కాలములో త్రికరణ శుద్ధి ప్రవర్తనారూపమగు కర్మమార్గముగాని, ఈశ్వరానుగ్రహమున (గురుకృప)కై ఉపాసనగాని, చిత్త విక్షేపం లేకుండుటకై యుక్తాహారవిహరములు, యమనియమాదులుగాని వుండవలెనా అక్కరలేదా? యోచింపవలెను. కనుక కర్మ, భక్తి, యోగ, జ్ఞాన సాధనలన్నియు ఏకకాలమున అభ్యసించుచు కృషిచేయువాడే శీఘ్రముగా కృతకృత్యుడు కాగలడు.

జ్ఞానమార్గమే గొప్పదని కొందరు కర్మయోగమే గొప్పదని కొందరు, భక్తిమార్గమే గొప్పదని మరొకొందరు భగవద్గీత మొత్తమంతయూ తమవాదమునే సమర్ధించుచున్నదని వాదులాడుట నిష్ప్రయోజనము. అసమంజసము. ఏ అధ్యాయము జూచిననూ అందు అన్ని మార్గములున్ను సూచింపబడుచునేయున్నపుడు గీతయే దేనియొక్క మార్గమునే నిర్ణయించినదనుకొనుట హాస్యాస్పదము. అన్ని మార్గములవసరమే అని సూచించుటయే భగవానుని అభిప్రాయము. అన్ని సాధనలున్ను ఏకకాలమున అభ్యసించుటయే పూర్ణయోగము. ద్వైతా ద్వైత విశిష్టాద్వైతాది మతములన్నియు సోపానక్రమముగా సత్యములేయని గుర్తించి, కర్మ, భక్తి, యోగ, జ్ఞాన మార్గములన్నిటిని అభ్యసించి తద్రీత్యా పురుషోత్తమ ప్రాప్తిని పొందవలెను. "ఆత్మాతీతం కేవలాత్మా" అని చెప్పబడుతోంది. ఆత్మోపలబ్ధికి పిమ్మట ఏ సాధనయూ నవసరంలేదు. అటుపిమ్మట సాధనాంతర నిరపేక్షకమైన కేవలాత్మయే స్వతస్సిద్ధమైయున్నది.

కనుక, "ఏ సాధన నీకెందుకు పీసానికి పనికిరాదు" అని వూరుకొనక, అన్ని సాధనల సముచ్ఛయరూపముగా గురుపరమాత్మనుపాసించి గురుకృపాసిద్ధిగాంచి జననమరణ భ్రాంతి రహితం చేసుకొని కృతకృత్యులగుదురుగాక!

# కర్మత్రయ లక్షణం

కర్మయనగా పని అని సామాన్యార్థము. గాని కర్మ ఫలము అని కూడా అర్థమున్నది. చేసిన ప్రతి పనికి ఫలముండక తప్పదు. హైందవ మతానుసారము జీవుడు అనేక కోట్ల జన్మలు ఒకదాని వెనుక ఒకటి ఎత్తుచునే వుండును. ఈ జన్మలు ఎప్పుడు ప్రారంభించినవంటే చెప్పుట కష్టము కనుక జీవుడు అనాది అని అన్నారు. జీవుడు ఎత్తిన ప్రతి మానవ జన్మలోనూ ఏదో ఒక పనిచేయుచునే యున్నాడు. ఆ చేసిన పని యెన్నడూ వృధాపోదు. దానివలన మంచిదో, చెడ్డదో ఫలితమున్నూ కలుగుచునే యుండును.

ఈ ఫలములు రెండు విధములు. 1) దృష్టఫలము 2) అదృష్టఫలము.

**1) దృష్ట ఫలము :** అనగా ప్రత్యక్షముగా పని పూర్తిచేసిన వెంటనే గాని కొద్ది కాలములోగాని కలిగే ఫలము. ఇందుకు దృష్టాంతము, నిప్పుమీద చేయివేయుట ఒక కర్మ(పని) దాని ఫలము వెంటనే చేయి కాలుట. యిది దృష్ట ఫలము. అనగా ప్రత్యక్షంగా కానవచ్చే ఫలితము. దీనికి అదృష్టఫలము లేదు. 2వ దృష్టాంతము ఒకడు దొంగతనము చేసినాడు. దీని దృష్టఫలము వెంటనే పట్టుబడుట, తన్నులు తినుట, క్రిమినలు కేసులో పడుట, శిక్షపడి అనుభవించుట, ఇత్యాదులు దృష్ట ఫలములు. వివిధ వుపాయముల చేత మానవుడు తన తెలివిని వుపయోగించి ఈ దృష్టఫలము నుండి ఎటులో తప్పించుకొనుట సాధ్యమే.

**2) అదృష్టఫలము :** ఈ లోకమునందు ప్రత్యక్షముగా కానరానిదై, కర్తయొక్క అంతఃకరణ యందు సంస్కార రూపముగా చోటుచేసుకొని జన్మాంతరమునందు కాలచక్రకర్మ చక్రములకు లోబడి కలుగు ఫలమునకు అదృష్టఫలము అని పేరు. చేసిన కర్మ యొక్క మంచిచెడ్డల ననుసరించి సుఖ రూపముగనో దుఃఖ రూపముగనో కర్మఫల ముంటూ వుండును. సుఖము నిచ్చునది మంచిపని (లేక సుకృతము) సూక్ష్మముగా అదృశ్య రూపముగా నున్న ఈ ఫలమును పుణ్య మందురు. దుఃఖము తెచ్చునది దుష్కృత ఫలము, దీనినే పాపమందురు. కనుక అదృష్ట ఫలము పుణ్య పాపములుగా వుంటూవుండును. మరియును ఈ అదృష్టఫలమే ఆగామి, సంచిత, ప్రారబ్దములను మూడు విధములుగా నున్నది.

**1. ఆగామి :** అనగా ఈ జన్మలో చేయుచున్న సుకృత దుష్కృతములకు ప్రత్యక్షముగా ఇచటనే కలుగు ఫలితముగాక పుణ్య పాప రూపమగు అదృష్టఫలము ఆగామి అనబడును. ఇది రాబోవు జన్మలలో అనుభవింపబడుటకు నిల్వలో నుండును.

**2. ప్రారబ్దము :** తల్లి గర్భములో పడిన దాది మరణపర్యంతము అనుభవించుటకు నిర్ణయమైన సుఖదుఃఖ రూపమగు కర్మ ఫలమునకు ప్రారబ్ధమని పేరు. దారిలో తినుటకు బాటసారి చేతబట్టుకొనిపోవు భత్యము లేక భోజనము వంటిదే ఈ ప్రారబ్ధ కర్మఫలము. తల్లి గర్భమున పడుటతోడనే జీవుడు ఈ కర్మ ఫలము అనుభవించుట ప్రారంభించును. కనుకనే దీనికి ప్ర+అరబ్దము = ప్రారబ్దము అనగా చక్కగా ఆరంభింపబడినది. కనుకనే ప్రారబ్ధమని పేరు వచ్చినది. వింటినుండి వదలిపెట్టబడిన బాణము తన వేగమున్నంత వరకు యే దిశగా

వదలిపెట్టబడెనో ఆ దిశగా మధ్యలో ఆగకుండా పోవును. అట్లే ప్రారబ్ధ శరీరము తాను తెచ్చుకొన్న కర్మ ఫలమును సంపూర్తిగా అనుభవించువరకూ సుఖదుఃఖములను అనుభవించుచూపోయి మరుక్షణములోనే పడిపోయెను. ఇదే మరణం, ప్రారబ్ధానుభవము పూర్తియైతేనేగాని ఈ దేహము పడిపోదు.

కనుక వర్తమాన శరీరమునకు ప్రారబ్ధ శరీరమని పేరు మణి, మంత్ర, ఔషధ, తపఃశ్చర్యలలో దేనిచేతను ప్రారబ్ధానుభవమును జీవి తప్పించు కొనజాలడు. కనుకనే "అవశ్యమును భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" అని చెప్పబడినది. ప్రారబ్ధ కర్మ అనుభవించక తప్పవంటే ఇక పురుషకారము వలన ప్రయోజనమేమి? అని ప్రశ్న రావచ్చును. అయితే నిర్ణయమై రానున్న కర్మఫలము ననుసరించియే మానవులకు సంకల్ప ముదయించును. కనుకనే "బుద్ధి కర్మానుసారిణీ" అని చెప్పబడినది. అథవా పురుషకారము ఏ పక్షములోనూ వృధా కానేరదు. కాలాంతరమున ఏ జన్మాంతరమందో లేక లోకాంతరమందో దాని ఫలము అది యివ్వగలదు. మరియును ప్రారబ్ధ మనుభవించుటపట్ల ఓర్పు, ధైర్యము ఇత్యాదులను యివ్వగలదు. కనుక పురుషకారమును విడవరాదు.

**3. సంచితము** : జీవుడింతవరకు నెత్తిన అనంత కోటి జన్మలలో చేసిన సుకృత దుష్కృత రూపములైన కర్మఫలములలో యింతవరకు అనుభవించినది పోగా, శేషించిన కర్మ రాశియే సంచితము అనబడును. వర్తమాన జన్మములలో చేసిన కర్మ ఫలములు కూడ ఈ సంచిత రాశికే చేరుచున్నవి. యిందు సుకృత కర్మలయొక్క సుఖమున్ను దుష్కృత ఫలము యొక్క దుఃఖమున్ను, దేనికదే వేరు వేరుగా అనుభవించవలసినదేగానీ ఆ పుణ్య పాప ఫలములను ఒకదానినుండి మరొకటి తీసివేసి శేషించినది సుఖమో దుఃఖమో అనుభవించుటకు వీలులేదు. అది లెక్క పుస్తకములలో జమ, ఖర్చు, మాదిరిగా ఒకదాని నుండి ఒకటి తీసివేసి మిగిలినది నిల్వయో బాకీయో చూపుట వంటిదికాదు. కనుక ఈ సంచిత రాశి ఎన్నటికిని తరుగక జీవుడు అనంతముగా జన్మలు ఎత్తవలసి వచ్చుచున్నది. ఎత్తిన ప్రతి జన్మయందును తిరిగి కర్మ చేయుచున్నందున ఆ కర్మ ఫలములు ఆగామి రూపముగా సంచితమును చేరి రాశిని పెంపు చేయుచున్నవి. అర్ధ ఘడియ భోగము 6 నెలల రోగము అన్నట్లుగా అల్పకాలములోనే, తలపెట్టిన కార్యక్రమము చేయగలడు గాని, దాని ఫలానుభవమునకు విశేష కాలము పట్టును. ఒక్క జన్మలోచేసిన కర్మలయొక్క ఫలములను అనుభవించుటకు వందలాది జన్మలు కావలసి వుండును. అట్టి జన్మలలో కర్మచేయక వూరుకొనుట లేదుగదా! కనుక సంచితరాశి ప్రతిక్షణము పెరిగిపోవు చున్నది. కర్మ నిశ్శేషంగా రహితమైతేగాని జన్మ లేకుండాపోదు. అట్టి కర్మరాహిత్యమగుటయే నైష్కర్మ్యసిద్ధి. అది యెట్లు చేకూరును? అన్నదే వేదాంతులను ఎదుర్కొన్న సమస్య. ఆగామి సంచిత ప్రారబ్ధములను సులభముగా అర్థము చేసుకొనుటకై పెద్దలు ఈ క్రింది దృష్టాంతమును యిచ్చి యున్నారు.

ఒక రైతు ఒక సంవత్సరం పండిన ధాన్యమంతటిని తన గాదెలో పోసెను. అందు, యే అల్ప భాగమునో తిండికై ఖర్చు చేసెను. ఇంతలో కొత్త పంట వచ్చెను. కొత్త పంట

ధాన్యమంతయూ కూడ ఆ గాదెలోనే పోసెను. ఆ మొత్తము రాశిలో నుంచి తిరిగి ఒక అల్ప భాగముమాత్రమే 2వ సంవత్సరము అనుభవించెను. ఇంతలో 3వ పంట రాగా తిరిగి దాని నంతనూ ఆగాదెలోనే పోసెను. కొన్ని సంవత్సరములిట్లే జరిగెను. గాదెలో నున్న మొత్తం ధాన్యరాశి వంటిదే "సంచితము". ప్రతిసంవత్సరము పండించు కొత్త ధాన్యమువలె ప్రతిజన్మలోనూ చేయు కొత్త కర్మల ఫలితమునకు ఆగామి అని పేరు. సంవత్సర గ్రాసమునకై తీసుకొన్న గాదెలోని ధాన్యము వంటిదే ఒక జన్మలో అనుభవించుటకు తెచ్చుకొన్న పుణ్యపాప కర్మఫలములు. దీనికే ప్రారబ్ధమని పేరు. అట్లే ఆరైతు చాలా సంవత్సరములు గాదెలో ధాన్యము పోయు చుండినచో ఆ ధాన్యమునకు ఎన్ని గాదెలు కావలసియుండును?

అదే విధముగా అనంత కోటి జన్మలలో ఖర్చు కాకుండా కూడ పెట్టబడియున్న సంచితరాశి పరిమాణము కూడా నట్టిదే.

శ్లో॥ ప్రారబ్ధం భోగతోనశ్యేత్ తత్వజ్ఞానేన సంచితం।
ఆగామి ద్వివిధం ప్రోక్తం తద్వేషీ ప్రియ వాదినౌ॥

తాత్పర్యము : అనుభవము చేత ప్రారబ్ధమును, తత్వజ్ఞానముచే సంచితమున్నూ పోవుననియు ఆగామి కర్మఫలములో, పుణ్య ఫలమును తన్ను భూషించినవారును, పాప ఫలమును తన్ను దూషించిన వారున్నూ తీసుకొని పోదురనిన్ని, ఆవిధముగా జ్ఞానికి కర్మత్రయము నశించి మోక్షము కల్గుననియు కొందరు చెప్పుదురు. కానీ ఆగామి విషయంలో ఈ శ్లోకమందు చెప్పబడినది సరిగాదు. ఏలననగా జ్ఞాని కడతేరుటకు ఆయనను భూషించు వారు కొందరూ దూషించు వారు కొందరూ కావలసియుండును. అపుడు తమ శక్తి యందు తనకు స్వాతంత్ర్యము లేదనిన్నీ, తన ముక్తి పరాధీనము అయివున్నదనినీ చెప్పవలసియుండును.

ఐనచో ఆగామి రహితమునకు మార్గాంతరమేమి? ఇందుకు సర్వ కర్మలను సన్యసించి, భుక్తి క్రియకైననూ కదలక మెదలక ఒక చోట పడియుండి తనకు లభ్యమయినది తిని త్రాగి, జీవితాంతమూ కాలక్షేపము చేయవలెనని కొందరందురు. ఇది ఆచరణ యోగ్యము కాదు. మరి కొందరు నిష్కామముగా కర్మలు చేయవలెనని, అందువలన ఆగామి ఉత్పత్తి కాదని చెప్పెదరు. కాని నిష్కామముగా కర్మలు చేయుట సాధ్యమా? ఏ ప్రయోజనమును ఆశించకుండా ఎవరును ఏ పనినీ చేయనేచేయరుగదా! మరికొందరు కర్మఫలమును ఆశించక ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలు చేయవలెననిన్ని, అందుచే కర్మఫలములైన పుణ్య పాపము లంటవనిన్ని అందురు. ఈ విధానము అపమార్గములకు దారి తీయగలదు. ఎట్లనగా "నేను ఈ రోజున చేసిన పనులలో కొన్ని మంచి పనులను, కొన్ని చెడ్డ పనులను చేసితిని రెంటి ఫలములను ఈశ్వరునకు అర్పణ చేసితిని. కనుక నాకు పుణ్యమూ లేదు పాపము లేదు" అని ఆత్మవంచన చేసుకొనుటకు సావకాశము కలదు. యింకా మరికొందరు కర్మ త్యాగము పూని కర్మలు చేసినయెడల ఆ కర్మ ఫలములు తన్నంట వనిన్నీ ఆ విధముగా ఆగామి నుండి తప్పించుకొనవచ్చునని చెప్పుచున్నారు. నేను కర్తను కాను. అనగా అర్థం నేను ఈ పని చేయలేదు. అనుటయే కదా! తన జ్ఞానేంద్రియములచే విషయ పంచకమును యెరిగి మనస్సుచే

సంకల్పించి బుద్ధిచే నిశ్చయించి. తన కర్మేంద్రియములచే కర్మ చేసి యీ కర్మకు నేనుకర్తను కాదు అనుకొనుట హాస్యాస్పదముగాదా! పిల్లి కళ్ళు మూసుకొని పాలుత్రాగి తన్ను యెవరూ చూడలేదు అనుకొన్నట్లుగానే వుండును.

కర్మ త్యాగము, కర్మఫల త్యాగము, కర్తృత్వ త్యాగము ఈ మూడునూ సరికాకపోయినచో యిక " నైష్కర్మ సిద్ధి" అనేది అందరాని పండేనా?

యిందుకు శ్రీశివరామదీక్షితీయ సహజా మనస్కరాజయోగ విధానమే శరణ్యము. యిది యోగ పద్ధతులచే సమాధిని సాధించి అమనస్కమై పోయినది అని అనుకొన్నట్లు కాదు. సమాధి యందుకూడా మనసు లేకపోలేదు. కనుక అమనస్కమేకాదు. సహజ పద్ధతి అసలేకాదు. రాజయోగమున్నూ కాదు. మరి సహజామనస్క రాజయోగ మనగా నేమి? యే సాధనల చేతనూ సాధించవలసిన ఆవశ్యకత లేక స్వతః సిద్ధముగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మమున్నదనిన్ని జగజ్జీవేశ్వర రూపములుగా పరిణమించు మూలకారణ వస్తువునకు ఆ పరిపూర్ణ పరబ్రహ్మము నందు మూలముగాని, స్థానంగాని లేదనిన్ని, గురుకృపకు పాత్రుడై, ఉన్నది వున్నట్లుగా, తెలుసు కొనుటయే యిందుకు మార్గము ఇది కర్తృత్వరహిత విధానమే కాని దీని నిజాభిప్రాయమును తెలుసుకొనవలెను. కర్తృత్వ రహిత విధాన మనగా కర్త కర్మ క్రియలలో కర్త అని చెప్పబడిన "జీవోహం" ను మాత్రమును త్యజించుట కాదని పిండ బ్రహ్మాండములతో కూడిన ఈ అనంత విశ్వమునకే మూల కారణమయిన కర్త ఎవడో వానికి, పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలం లేదు అని దానిని త్యజించుటే నిజమగు కర్తృత్వ త్యాగము. కనుక ఆ కర్తను వస్తు నిశ్చయ పూర్వకముగా గుర్తెరిగినపుడే అది నిజమగు తత్వజ్ఞానము. ఆ జ్ఞానముచే సంచిత రాశి నశించును. కాని శాస్త్ర జన్య జ్ఞానముచే నశించదు. "అన్నిటికి అతడు కర్త" అని యెవరిని చెప్పవచ్చునో అతని యందలి అభిమాన త్యాగమే నిజమగు కర్తృత్వ త్యాగము. ఈ ప్రారబ్ధ శరీర పతనముతో ప్రారబ్ధము నశించునని సర్వాంగీకృత విషయమే. ఈ విధంగా కర్మత్రయము నశించును. నైష్కర్మసిద్ధి చేకూరును. సాంప్రదాయక నిజగురువులచే పరిపూర్ణ బోధ ఎరిగిన వారికే నిజమగు కర్తృత్వ త్యాగపద్ధతి తెలియగలదు. వేరు మార్గంలేదు.

# ప్రారబ్ధ కర్మానుభవము

ప్రారబ్ధమనగా తల్లి గర్భములో పడిన దాది శరీర త్యాగము చేయువరకు జీవుడు అనుభవించు సుఖదుఃఖలే అని కర్మత్రయములో తెలుసుకొని యున్నాము. ఫలము నిచ్చుటకు ప్రారంభించిన కర్మ ఆరబ్ధకర్మ లేక ప్రారబ్ధ కర్మ యని చెప్పబడును. సంచిత ఆగామి కర్మలు ఫలమిచ్చుట ప్రారంభించలేదు. కనుక అవి అనారబ్ధ కర్మలు అని చెప్పబడును. మహదైశ్వర్య సంపన్నుడైనా, లేక కటిక దరిద్రుడైనా యిరువురుకు సుఖదుఃఖములు తప్పవు. కేవల సుఖము గాని, కేవల దుఃఖముగాని ఏ ప్రాణికీ ఎప్పుడునూ వుండవు. సుఖదుఃఖములు వెలుగు నీడల వంటివి అగుటయే యిందుకు కారణము.

జ్ఞానికి, అజ్ఞానికి, యోగికి, భోగికి, త్యాగికీ, రోగికి, చక్రవర్తికి, బిచ్చగానికి, పండితునకు,

పామరునకు. దేశకాల పాత్రలతో నిమిత్తము లేకుండా స్త్రీ పురుషులందరికిని సుఖదుఃఖములు తప్పవు కాని "అహంబ్రహ్మాస్మి" అని ఆరూఢ జ్ఞానము పొందినవార్కి కూడా ప్రారబ్ధ కర్మానుభవము వుండునా? అని శంక కలుగుచున్నది. "జ్ఞానాగ్నిస్సర్వ కార్మాణి భస్మసాత్ కురుతే తథా"॥అని గీత చెప్పుటలో ప్రారబ్ధము కూడ భస్మమై పోవునని స్థూలముగా తోచుచున్నది. గాని సర్వకర్మాణి అనునపుడు పునర్జన్మ హేతువులకు సర్వకర్మలు అనిమాత్రమే అర్థము. ప్రారబ్ధానుభవము పునర్జన్మ హేతువుకాదు. "ప్రారబ్ధం భోగతోనస్యేత్" అనీ "అవస్య మనుభోక్తవ్యం" అని చెప్పబడుచున్నది. కనుక జ్ఞానికి కూడా పారబ్ధమున్నట్లే చెప్పవలసి యున్నది. మరియొక దృష్టితో చూచిన యెడల, తల్లిగర్భమున వుత్పత్తి చెంది మరణముతో పూర్తియగును. కనుక ఈ శరీరమునకు ప్రారబ్ధ శరీరమనిపేరు. శరీర మున్నంతవరకు ప్రారబ్ధముండును. ప్రారబ్ధ నిశ్శేషముగా నశించు వరకు శరీరముండును. కనుక జీవించి వున్నంతవరకు జ్ఞానికి కూడా ప్రారబ్ధ మున్నట్లేకదా! జ్ఞానికి ప్రారబ్ధము కూడా లేదని శంకరాదులన్నారు. ఆకల్పంలో జ్ఞానోత్పత్తితోబాటు జ్ఞాని శరీరం కూడా పడిపోవలసి యుండును. అపుడు శరీర ధారి యగు జ్ఞానియే ప్రపంచములో వుండకూడదు. కనుక శంకరాదుల నిజాభిప్రాయమేమో మనము తెలుసుకొని సమన్వయము చేసుకొనవలసి యున్నది. సుఖదుఃఖములు అందరికి వుండిననూ కొందరు వాని వలన అంతగా బాధపడ కుండుట మనము చూస్తున్నాము. యిందుకు కారణ మేమి అని యోచిస్తే వారి వారి అంతఃకరణ లక్షణముల విభిన్నతయే అని స్పష్టము కాగలదు.

ఉదాహరణకు : ఇరువురు భార్యలు గల ఒక వ్యక్తి మరణించినచో జ్ఞానియైన పెద్ద భార్యకు దుఃఖము తక్కువగను, అజ్ఞానియైన చిన్న భార్యకు దుఃఖము ఎక్కువగను వుండవచ్చును. అజ్ఞాని మనస్సు సుఖదుఃఖముల వేగమునకు తట్టుకొనలేదు. జ్ఞానియొక్క మనస్సు ఎంతటి సుఖదుఃఖములకైనా చెక్కుచెదరక నిర్వికారముగా నుండవచ్చును ఆవిధముగా ప్రారబ్ధమును అనుభవించుపట్ల పారమార్థికులకు ప్రాపంచికులకు తేడా వుండును. జ్ఞాని సుఖదుఃఖములు అనుభవించుట లేదు. అనగా వాని వలన వికారము చెందుట లేదు. కాని ప్రారబ్ధమును మాత్రము వున్నది. దాని అనుభవము లేనందున జ్ఞానికి ప్రారబ్ధము కూడ లేదని శంకరాదులన్నారు. శ్రీరామకృష్ణ పరమహంస, రమణ మహర్షి మొదలగు మహాజ్ఞానుల శరీరములపైన వ్రణములు మొదలైనవి పుట్టినను వారేమియూ బాధపొందక నిర్వికారముగ నుండుట అందరికిని తెలిసియున్న విషయమేగదా!

ప్రారబ్ధానుభవము నందు జ్ఞానులకు అజ్ఞానులకు ఈ బేధము ఎందుకుండవలెను? సుఖదుఃఖములనుభవించు మనస్సును ఆత్మయందే జ్ఞాని లగ్న మొనర్చి యుండును జ్ఞాని అజ్ఞాని వలె దేహేంద్రియముల పైననూ ప్రాపంచిక వ్యవహారముల యందును లగ్నము చేయడు. అందుకే వార్తికారులు "ఒక రాజు మరణించినచో అతని ముగ్గురు రాణులున్నూ ముండ మోతురేగాని ఇద్దరు మాత్రమే ముండమోసి ఒకతె సువాసినిగా వుండగలుగునా? అని ప్రశ్నిస్తున్నారు. నిజమే పరిపూర్ణ పరబ్రహ్మము నందు ఎరుకకు మూలముగాని స్థానముగాని లేనేలేదని నిశ్చయించుకున్న ఆరూఢజ్ఞానులకు (సహజామనస్కరాజయోగ పద్ధతిగా)

అనుభవించు మనస్సే లేదు. కనుక ఆగామీ సంచిత ప్రారబ్ధానుభవములలో ఏదిన్నీ లేదు.

ఈ ప్రారబ్ధము (1) ఇచ్ఛా ప్రారబ్ధము (2) అనిచ్ఛా ప్రారబ్ధము. (3) పరేచ్ఛా ప్రారబ్ధము అని 3 రకములుగా వున్నది. ఇచ్ఛా ప్రారబ్ధమనగా తాను చేసే పని వల్ల కలిగే సుఖదుఃఖముల సంగతి పూర్తిగా తెలసియుండియు సుకృత దుష్కృత కర్మలు చేసి కోరి తెచ్చుకున్న సుఖదుఃఖములు ఇచ్ఛా ప్రారబ్ధమనబడును. పరధనమును అపేక్షించిన చోరుడు, పరస్త్రీని అపేక్షించిన జారుడు, పరరాజ్యమును అపేక్షించిన శూరుడు, పరస్త్రీ పరద్రవ్య పరరాజ్యములు కోరి అందుకు చేయు ప్రయత్నములలో నున్న కష్టసుఖములను యెరిగి యుండియే ఆయా కార్యముల యందు ప్రవేశింతురు. ఆయా కార్యములకు ప్రోత్సహించు ఇచ్ఛకూడా ప్రారబ్ధాధీనమే కనుకనే "బుద్ధిఃకర్మాను సారిణి" అని చెప్పబడినది. కాని ఆ ఇచ్ఛను జయించుటకు వివేకయుక్తమగు బుద్ధి తోడ్పడుచున్నది. అట్లుగాక ఇచ్ఛచే ప్రేరేపింపబడి యింద్రియ విషయములకు లోలుడై అజ్ఞాని తెలిసి యుండియూ బుద్ధి పూర్వకంగా ఆయా కార్యముల యందు ప్రవేశించి ఆయా సుఖదుఃఖములను పొందుచున్నాడుకాని, జ్ఞానాగ్నిచే సంస్కార యుక్తమగు అంతఃకరణను భస్మీపటలము కావించి యున్నందున జ్ఞానికి ఇచ్ఛయే కలుగదు. కలిగిననూ తన వివేక జ్ఞానముచే దానిని వెనువెంటనే త్రుంచివేయును. కనుక జ్ఞానికి ఇచ్ఛా ప్రారబ్ధములేదు. ఆ రూఢజ్ఞానికి ఇచ్ఛయే యుండదు. కనుకనే "ఇచ్ఛా రాహిత్యంబునె స్వచ్ఛంబగు బోధయనుచు సజ్జనులనిరి...." అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చియున్నారు మరిన్ని ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప అన్య మేమీ లేనేలేదనే పరిపూర్ణ భావజ్ఞునికి ప్రారబ్ధశరీరమున్ననూ అతని భావనలో మాత్రము లేనేలేదు కనుక అతనికి ప్రారబ్ధమే లేదన్నను తప్పులేదు. కల మేలుకొన్న వానికి కల శరీరము నిలుచునా? (2) కోరకనే ప్రాణికి కల్గు సుఖదుఃఖములు అనిచ్ఛా ప్రారబ్ధఫలములని చెప్పబడును. అజ్ఞాని దుఃఖమును కోరడు కాని జ్ఞానియో, సుఖదుఃఖములు రెంటిలో దేనినీ కోరడు. హటాత్తుగా కలుగు ప్రమాదములు, అట్లే ఆకస్మిక ధనప్రాప్తి లేక ధననాశము మొదలగునవి అనిచ్ఛా ప్రారబ్ధమునకు వుదాహరణములుగా నీయవచ్చును. ఆది దైవిక తాపము లన్నియు (పిడుగు, భూకంపము మొదలగునవి) యిట్టివే.

**(3) పరేచ్ఛా ప్రారబ్ధము** : ఈ రూపముగా కలుగు సుఖదుఃఖములు యితర ప్రాణుల మూలకముగా తనకు ప్రాప్తించునవి (ఎ) ఇతరుల ప్రేరేపణచే తాను వొకానొక కర్మచేయుట వలన లేదా(బి) ఇతరులు చేసిన కర్మ ఫలితముగా తనకుకలుగు సుఖదుఃఖములు పరేచ్ఛా ప్రారబ్ధ మనబడును. (ఎ) యిది తిరిగి రెండు విధములు (1) పరుల కష్టములు చూచి జాలిచెంది వారికి మేలు చేయుటకై పనిచేయుటలో తనకు కలిగే సుఖదుఃఖములు. ఉదా: కాలుచున్న యింట్లో చొరబడి యితరులను రక్షింపబోయి తన శరీరం కాల్చుకొనుట (2) యితరులు చేసిన బోధవిని పనిచేసి తత్కారణముగా పొందు సుఖదుఃఖములు ఉదాహరణంగా యితరుల ప్రేరేపణచే వర్తకం చేసి లాభనష్టములు పొందుట.

(బి) యితర ప్రాణులు చేసినపనివల్ల తనకు సుఖదుఃఖములు కల్గుట. యీ విధముగా కలిగిన దుఃఖమునకే ఆది భౌతిక తాపమని పేరు. చోర వృశ్చిక సర్ప వ్యాఘ్రాదుల వల్ల కలుగు

దుఃఖములు. నీయందలి భక్తి ప్రపత్తులచే భార్యాపుత్రాదులు చేయు సపర్యలవలన కలుగు సుఖదుఃఖములునూ యిట్టివే.

అనిచ్ఛా, పరేచ్ఛా ప్రారబ్ధములు రెండునూ. జ్ఞానికి అజ్ఞానికి యిర్వురకూ సమానమే. జ్ఞానికి మాత్రము యిచ్ఛా ప్రారబ్ధము లేదు. మరియు జ్ఞానికి ఆధ్యాత్మిక ఆది భౌతిక ఆది దైవిక తాపములు శరీరమునందు తోచబడినా, అనిచ్ఛాపరేచ్ఛా పూర్వకమగు ప్రారబ్ధములున్నట్లు తోచబడినా అతని మనస్సు నిర్వికారముగా నుండి పరబ్రహ్మము నందే లగ్నమై యుండుటచే తత్సుఖ దుఃఖానుభవము మాత్రమాతనికి లేదని చెప్పవలయును. ప్రాపంచికుల దృష్టిలో జ్ఞానియు ప్రారబ్ధ మనుభవించుచున్నట్లు తోచబడిననూ స్వదృష్టిచే మాత్రము జ్ఞానికి ప్రారబ్ధము గూడ లేదు. యీ పద్ధతిగా జ్ఞానికి ఆగామీ సంచిత ప్రారబ్ధము లన్నియు భస్మమైపోయినట్లే యెంచదగును. కనుక పరిపూర్ణ రాజయోగికి, ఆగామీ సంచిత ప్రారబ్ధములు మూడున్ను లేవు.

# షట్కోశరహితం పూర్ణం

కోశము అనగా పొరవంటిది, లేక కత్తికి ఒరవంటిది అని సమాన్యార్థము. ఈ అర్థము తీసుకొన్నచో సమన్వయము కుదురుటలేదు. ఏలననగా అన్నమయకోశములోపల ప్రాణమయ కోశము దానిలో మనోమయము, దానిలో విజ్ఞానమయము, దానిలో ఆనందమయము అని పంచకోశములను గూర్చి సాధారణంగా చెప్పుదురు. పెట్టెలో పెట్టె దానిలో మరొక పెట్టె పెట్టినట్లుగా వున్నాయనో, లేక అరటి పూవుయొక్క డిప్పలువలె ఒక దానిలోపల మరొకటి, వేరు వేరుగా నున్నవనో మనం ఆ మాటవల్ల అర్థం చేసుకోవలసి వస్తుంది. పంచకోశములు ఒకదానికొకటి యంటక వున్నవనిన్ని వాని లోపల యెక్కడనో, అంతరాంతరంగా ఆత్మ యున్న దనిన్ని అనుకోవలసివస్తోంది.

కాని, ఈ భావ మంగీకరిస్తే ఆత్మకు ఏకదేశీయత చెప్పవలసి వస్తోంది. ఆత్మయొక్క సర్వవ్యాపకతకు భంగం వాటిల్లుచున్నది. మరి, పంచకోశములు ఎట్లున్నవని చెప్పవలెను? బెల్లపుగడ్డ తీపిమయమై వుండగా, బెల్లంలోపల తీపి వున్నదని చెప్పుట సరిగాదుగదా, ఏలననగా బెల్లపుగడ్డలో ఏ భాగములో తీపివున్నది? అని ప్రశ్నించుట కవకాశము కలుగుచున్నది. "బెల్లమునందు తీపియున్నది" అని చెప్పితే బాధలేదు. "లో" అనుటలోనూ "యందు" అనుటలోనూ అర్థమునందు యింత వ్యత్యాసమున్నది. "లో" అనునది షష్టీ విభక్తికాగా "యందు" అనునది సప్తమీవిభక్తి అని వ్యాకరణం చెపుతోంది. అన్నమయమునందు ప్రాణమయము, దానియందు మనోమయము, దానియందు విజ్ఞానమయము, దానియందు ఆనందమయము, దానియందు హిరణ్మయము అని చెప్పవలెను. "మయము" అను మాట వుపయోగించుసరికి అన్నమయ కోశమని చెప్పబడే స్థూల స్వరూపమేననీ, ఆ అన్నమయము నందు ప్రాణమయమనే సర్కి అన్నమయ కోశమందంతా ప్రాణము "మయమై"వున్నదనీ అట్లే ప్రాణమయమందంతా మనోమయమని, అట్లే చివరకు యీ అన్నియూ హిరణ్మయమై

యున్నవనీ అర్థంచేసుకోవలసియున్నది. అంటే ఒక దానికంటే యొకటి సూక్ష్మ, అతిసూక్ష్మ, మహాసూక్ష్మములుగా వ్యాపించియున్నవన్నమాట. ఆత్మ అన్ని కోశములయందూ, "యధా మృణ్మయో కుంభం, తద్వత్ దేహోపి చిన్మయం" అని ఆదిశంకరులు చెప్పినట్లుగా అణువణువునా వ్యాపించియున్నది.

"పంచకోశాతీతం ప్రత్యగాత్మ" యని కొందరందురు. కాని ప్రత్యగాత్మ పంచకోశములకు అతీతమైన విలక్షణంగా యెక్కడోవున్నట్లు చెప్పుట సరిగాదు. "ఉన్నవి ఐదే కోశములు, ఆరవదంటూ లేనేలేదు. పంచకోశములేగాని షట్కోశములుగావు" అని మరొకొందరందురు. కాని "షట్కోశమిదం సర్వం" అనీ, "హిరణ్మయే పరేకోశే, విరజం బ్రహ్మనిష్కళం" అనీ శ్రుతులు పల్కుచున్నవి. హిరణ్మయకోశమని పిలువబడే ఆరవకోశమే పరబ్రహ్మమనీ, అది పంచ కోశములను మించి యున్నది అనగా విలక్షణమై యున్నది. అనీ యితరులు చెప్పే అభిప్రాయమును నిరసించుచూ, "కం॥ పంచకోశముల సంచును, మించినదీ ఎరుక యనుట మేలా? బయలం, చెంచినదగు నా ముచ్చట..." అన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు. హిరణ్మయ కోశమే పంచకోశములసంచు, దానిని మించినది పరిపూర్ణ పరబ్రహ్మము. కనుక షట్కోశరహితం పూర్ణం, షడావరణ వర్జితం అని అది అభివర్ణింపబడినది.

# విత్తుముందా? చెట్టుముందా?

ఇది యెంత పాతప్రశ్నో. అంత కొంటె ప్రశ్న. ఎంత కొంటె ప్రశ్నో, అంతకుంటి ప్రశ్న. చిరకాలం నుంచి తరతరాలుగా యీ ప్రశ్న అడుగబడుచునే వుంది గనుక యిది నిజముగా పాతప్రశ్నే, విత్తుముందని జవాబు చెపితే, అంతకు పూర్వం చెట్టు లేకపోతే విత్తనమెక్కడ నుంచి వస్తుంది? అంటాడు. చెట్టు ముందని చెప్పితే విత్తనము లేనిదే చెట్టెక్కడనుంచి వస్తుంది? అంటాడు. కనుక యిది కొంటె ప్రశ్న అనిన్ని అనవచ్చు. జవాబు చెప్పినవాడు దానితో బిత్తరపోయి "ఐతే నీవే చెప్పు" అనటం, అడిగిన వాడు యీ ప్రశ్నకు సరియగు జవాబు తనకు తెలిసినట్లే నటించి, అంత తేలికగా చెపుతానా అంటూ విజయ గర్వంతో వెళ్ళిపోవడం సాధారణంగా చూస్తూంటాము.

ఇక, వేదాంతులను యీ ప్రశ్న అడిగితే, ఇది బీజవృక్ష న్యాయమనీ కార్యకారణ సంబంధమనీ, చెపుతారు. ఒక వస్తువునకు ఏది కారణమై వుందో ఆ కారణ వస్తువునకు మరొకటి కారణమై వుండాలి. యీ కార్యకారణ పరంపరలో మొదటి కారణం ఏది అంటే ఆత్మలేక బ్రహ్మమే అత్యంత మూలకారణము లేక పరమకారణము అంటారు. దానికి మాత్రం కారణ ముండవద్దా? పిల్లకు తల్లికారణం. ఆ తల్లికి తల్లియుండటం సబబుకాదా! అంటే బ్రహ్మము అనాది. అది స్వయంభూ. దానికి కారణంలేదు. ఆ బ్రహ్మమునకు కారణ మడుగరాదు. ఆ కారణానికి మరొక కారణం. ఆ కారణానికి మరల మరొక కారణం వుంటూ వుండాలి. అంటే అనవస్థా దోషం పట్టుతుంది. అంటూ సమాధానాలు చెప్తారు. కాని యీ సమాదానాలు జిజ్ఞాసి తృష్ణ చల్లార్చ లేవు.

మఱ్ఱివిత్తన మెంత చిన్నదైనా దానియందు మఱ్ఱి వృక్షమంతా యిమిడి వున్నట్లే, వృక్షమునందు దాని బీజముల నుత్పత్తి చేసే లక్షణం నిగూఢంగా యిమిడియే వున్నది. కనుక బీజమునందు వృక్షము వృక్షమునందు బీజమూ సూక్ష్మాతి సూక్ష్మంగా యిమిడియే వుండి కాలానుసారంగా ప్రకటమౌతూవుంటాయి. అట్లే యీ మహాసృష్టి అంతయు బ్రహ్మమునందు తొలుత బీజరూపంగా నుండి తరువాత క్రమవికాసము చెందినది. సృష్టి కాబడిన యీ జగజ్జీవేశ్వరుల యందు ఆ బ్రహ్మము (లేక ఆత్మ) సూక్ష్మరూపంలో వ్యాపకమయ్యే వున్నది. ఆత్మనుంచి జగజ్జీవేశ్వర్లు కల్గిరని భావవాదులంటున్నారు. అది సరికాదు, ముందు బిడ్డయొక్క శరీరము స్థూలరూపంగా కల్గినది దానియందు క్రమః తెలివి రూపమగు జ్ఞానము వికాసము చెందినదని భౌతిక వాదులంటున్నారు. కనుక మొదటనున్నది జడరూపమగు ప్రకృతియా? లేక జ్ఞానరూపమగు పురుషుడా? అనే ప్రశ్న కూడా విత్తు ముందా? చెట్టుముందా అనే ప్రశ్న వంటిదే.

ఈ విషయంలో అచల ఋషు లేమనుచున్నారో గమనించవలెను.

1. విత్తే చెట్టై పుట్టును, విత్తే విత్తనము రీతి వెలయును. ధరప్తై విత్తుకు చెట్టుకు వేరే విత్తన మొకటున్నదనినవినగూడదోయీ" అనిన్ని.

2. "మేనెరుకల రెండింటిలో దానిని యిది, దీని నదియు గత సృజించున్" అనిన్ని

3. "జగమువలన సంకల్పము, జగమా సంకల్పమునను జనియించును" అనిన్ని శ్రీకృష్ణ దేశికేంద్రులు తమ కందార్థములలో సెలవిచ్చియున్నారు.

ఐతే యీ రెండింటిలో ఏదిముందు? ఈ ప్రశ్నకు కూడా కందార్థములోనే జవాబున్నది. యీ ప్రశ్న ఎటువంటి దన్నారంటే బెల్లం ముందా? దానియందలి తీపి ముందా? అన్న ప్రశ్న వంటిదే. బెల్లపుగడ్డ లేనిచో తీపినిలుచుట కాధారం లేదు. తీపిలేని బెల్లపుముక్కను బెడ్డముక్క అనే అనాలి గాని బెల్లపుముక్క అని అనముకదా! బెల్లము, తీపి అవినాభావ సంబంధం కలిగి విడదీయరానివై యున్నట్లే ఎరుక జగములు (పురుష ప్రకృతులు) ఓతప్రోతమై (అనగా పడుగుపేకలవలె) వున్నవి. విత్తుముందనీ చెట్టుముందనీ చెప్పరానట్లే యిందేదీ ముందనీ చెప్పరాదు. కనుక కృష్ణదేశి కేంద్రులవారు "గుడమే మధురము, మధురమె గుడము, ఆ గుథమధురములను గొనకొని తొలుతన్ పొడమినదేదన? సరిగ పొడమింది" సరిగా రెండూ ఒకేసారి పుట్టినవి అని అనవలసిందేనన్నారు. తనువెరుకలుగూడ యిట్టి వేనన్నారు. ఇపుడు విత్తుముందా? చెట్టుముందా? అనే ప్రశ్న ఎంత కుంటి ప్రశ్నో, చూడండి! ఏదీ ముందుకాదు. రెండూ ఒకే సారి పుడతాయి.



# దేవుడు మానవుని సృష్టించెనా లేక మానవుడే దేవుని సృష్టించెనా?

దేవుడు మానవుని సృష్టించెనని ఆస్తిక మతము లన్నియు చెప్పుచున్నవి. ఒక్క మానవుడేకాదు. సకల చరాచరము లన్నియు దేవుని సృష్టిలోనివేనని వారందరు అంగీకరించు చున్నారు. అందరూ దేవుడు సృష్టికర్త అని చెప్పుచున్నారేగాని దేవుడెట్టివాడు అని చెప్పుటలో మాత్రము అనేక భేదాభిప్రాయములు కలిగియున్నారు. నిజమైన దేవుడెవరో తెలియకున్నారు.

దేవుడు అనేమాటకు ప్రకాశ స్వరూపుడు అని మాత్రమే అర్థము. ప్రకాశము అనగా జ్ఞానము, కనుక దేవుడు గొప్ప జ్ఞానము లేక తెలివిగలవాడు అని భావము. మరి ఆ ప్రకాశము పుంలిగమా? లేక స్త్రీ లింగమా అని యోచిస్తే యిదమిద్ధమని చెప్పలేము. దానిని స్త్రీలింగముగా యూహించిన వారు సృష్టికర్తను శక్తి స్వరూపముగా నానా నామములచే వ్యవహరిస్తున్నారు. లింగభేదమటుంచితే, వుభయులు కూడా మానవాకారములోనే ఆ దైవ వస్తువును వూహిస్తున్నారు. శ్రీవివేకానందస్వామి ఈ సందర్భములో యీ క్రింది కథ చెప్పినాడు. ఎలుకలన్నియు చేరి దేవుడెవరో నిర్ణయించుటకొక సభ చేసినవట. ఆ సభలో పిల్లియే దేవుడని ఏకగ్రీవముగా ఉద్ఘాటించినవట. ఏలననగా అవి తమ స్థూల శరీర దృష్టి మాత్రమే కల్గి తమ వ్యక్తిత్వ లక్షణమును మరువలేక, తమ శరీరముకంటె బలిష్టము, పెద్దదియగు శరీరమును, తమ అవయముల కంటె పటిష్టములగు అవయవములను గలది పిల్లియనీ, అంతేకాక జాలిగలిగినచో చంపక వదలి వేయును. కోపము వచ్చినచో ఒక్క దెబ్బతో చంపివేయుననీ కనుక పిల్లియే దేవుడని అవి యూహించుట సహజముగానే యున్నది. అట్లే మానవులు దేవుని రూపమును వూహించుటలో తమ స్థూల సూక్ష్మ శరీర దృష్టిని వదలలేక తమకున్న అవయములవంటి వానితో గూడిన పెద్ద శరీరము, కామ క్రోధాదులతో గూడిన అంతఃకరణము, కళత్ర పుత్ర మిత్ర శత్రు బృందము వస్తువాహనములు, ప్రభుత్వము, లోకములతో గూడిన రాజ్యము యిత్యాదులన్నియు నూహించి, చతుర్భుజములు, చతుర్ముఖములు, త్రినేత్రములు యిత్యాదిగా అనేక రూపములు కల్పించి అందుకు తగిన నామములచే వారి వారి దైవముల నర్చించు చున్నారు. తమ తమ వ్యక్తిత్వములను, అభిరుచులను, అభినివేశములను వదలజాలక వీరు ఆ దేవుని సగుణ రూపంలో నూహించి పురుష మూర్తిగానో స్త్రీ మూర్తిగానో నామరూప కల్పన చేసినారు.

దేవుడు మానవుని తన రూపంలోనే సృష్టించినాడని బైబిలు చెప్పుచున్నది. అనగా మానవుని ఆకారంలోనే దేవుడున్నాడనినట్లే గదా! మరిన్ని ఆ దేవుడు నిగ్రహానుగ్రహ సమర్థుడనియు చెప్పుచున్నది. కనుక ఆ దేవుడు జ్ఞానవంతుడని కూడా చెప్పినట్లే. కనుక యీ దేవునికిన్ని తెలివి దేహములున్నట్లే గదా! క్రైస్తవమత మొక్కటియే గాక ప్రపంచ ఆస్థిక(ఈశ్వరాస్థిక్య బుద్ధి గలవారల) మతము లన్నియు తెలివి దేహములున్న దేవుణ్ణే ప్రతిపాదించినవి.

మరికొందరు బుద్ధిమంతులు ఆ సృష్టి కారణ వస్తువునకు స్థూల సూక్ష్మ శరీర అవయములు లేవని, దానికి స్త్రీ పురుష రూపములు లేవని చెప్పుచూ, దానికి సత్, చిత్, ఆనందములే స్వరూప లక్షణమనిన్ని, సృష్టితో సంబంధపడినపుడు దానికి తటస్థ లక్షణం చెప్పవలెననిన్నీ చెప్పి యున్నారు. వీరి దృష్టిలో ఆ దేవుడు దేహములేని విదేహి, అశరీరుడు, ప్రజ్ఞానఘనుడు.

ఇక దేవుడంటూ ఒక వ్యక్తి లేనేలేడు. స్వభావము యదృచ్ఛ, కాలము, నియతి, కర్మ యిత్యాదులే జగత్కారణము అంటూ సృష్టికర్త లేనేలేడని కొందరు వాదింతురు. పైన చెప్పినవన్నీ ఆ సృష్టికర్త యొక్క పరిణామములే, లేక మారుపేర్లే కాని జ్ఞానం లేశమూలేని జడ వస్తువుగాని లేక తత్వముగాన సృష్టి కారణం కాజాలదని యీ వాదమును మొదటివారు పూర్వపక్షం చేస్తున్నారు.

ఈ వాదములన్నిటికి నొక చక్కని పరిష్కారమును అచల ఋషులు ప్రతిపాదించినారు. ఎట్లనగా సృష్టికారణ వస్తువు కేవలం తెలివి రూపమూగాదు. కేవల జడరూపమూ గాదు. ఈ తెలివి దేహములు రెండూ కల వస్తువే సృష్టి కారణ వస్తువు. ఇది మనోవాక్కుల కందేదే. నిర్గుణముగా నున్నట్లు నిరవయవంగాను నిరాకారముగానూ వున్నట్లు గాన వచ్చినా గుణము, స్వభావము, శక్తి, ప్రకాశంలేక, తెలివి మొదలైనవన్ని కల్గియున్నదే. ఇదే సగుణముగా, సాకారముగా, సావయవముగా పరిణమించేది. దేవుడను శబ్దశబ్దార్థములు దీనికే అన్వయించును. ఈ దేవుడు నిజమగు దేవుడెట్లగును? మనస్సునకందేది మనస్సువంటిదేగదా!

నిజమైన దేవునికి, నేతి, నేతి, నేతి అను అతద్వ్యా వృత్తి లక్షణము సరిపోగలదేమో? ఏమో అని యెందుకనవలసి వచ్చినదంటే ఆ నిజమైన దేవుడు సర్వలక్షణ విలక్షణుడు. ఆ నిజమైన దేవుని కేపేరూలేదుగాని పరిపూర్ణ పరబ్రహ్మమని వ్యవహారార్థము మనం పేరుపెట్టు కొన్నాము. ఈ నిజదేవుడు సృష్టికి కర్తగాని కారయితగాని కాడు. సదసత్తులు, చిజ్జడములు మొదలగు సర్వద్వంద్వ రహితుడు. ఈ దేవునికి తెలివి దేహములు రెండూ లేవు. ఈ నిజ దేవుడు మానవుని సృష్టించలేదు. సృష్టి కారణమగు, నకిలీ దేవుని మానవుడే సృష్టించెను. లేక యూహించెను. ఈ నిజదేవుని నుద్దేశించియే, కృష్ణ దేశికేంద్రులవారు "దేవుణ్ని నిన్ను యెరుగవు నీవిప్పటికీ' అంటూ కందార్థాన్ని గానంచేసెను.



# మరణావస్థ

మరణ మనగా ప్రాణుల యొక్క స్థూల శరీరమునుండి బయటకుపోయి తిరగి లోనికి ప్రవేశించకుండా ఏదో ఒక సూక్ష్మవస్తువు బయటకు పోవుటయే మరణము. ఆ విధముగా ప్రాణము బయటకు పోయినదని కొందరు, జీవుడు పోయినాడని కొందరు, తెలివి పోయినదని కొందరు పలువురు పలు విధములుగా చెప్పుచున్నారు. మనఃప్రాణముల యొక్క చేరికలో తెలివి కలుగుచున్నది. కనుక మనఃప్రాణములు రెండునూ కలసి బయటకు పోయెననే చెప్పుట సమంజసము. మరణ శరీరమునందు గుర్తెరిగే తెలివి లేకపోవుట మనము ప్రత్యక్షముగా గమనించుచున్నాముకదా!

బయటకు పోయిన మనఃప్రాణములకు లోనికి ప్రవేశించగల శక్తిన్ని ఉండగలదని చెప్పుట యుక్తము. శరీరము నందు ఈ మనో ప్రాణములు ఎప్పుడు ప్రవేశించినవి? అంతకు పూర్వము ఎక్కడ ఉన్నవి? అని అనేక ప్రశ్నలు సహజముగా కల్గుచున్నవి. గర్భస్థ శిశువునందు 5వ మాసముననో, 7వ మాసముననో తొలిసారిగా ప్రవేశించునని చెప్పబడుచున్నది. ఇట్టి ప్రవేశ నిర్గమనములు ఉండుట చేతనే ప్రాణికి జన్మపరంపర ఉన్నట్లు అంగీకరింపవలసి వచ్చు చున్నది. ఒకే శరీరమునందు ఒకసారి ప్రవేశించిన మనఃప్రాణములు మరణావస్థయందు మాత్రమే శరీరమును వీడి బయటకుపోయి, మరల ఆ శరీరమునందు మాత్రము ప్రవేశించవు. లోనికి ప్రవేశించుట జన్మ, బయటకుపోవుట మరణము.

మనస్సనగా బ్రహ్మాండ మందున్న పంచతన్మాత్రల నుండి పిండాండమందు నిర్మితమై 25 రీతులుగా వ్యవహరించు శక్తిగల సూక్ష్మ పదార్థము. మనస్సనగా సంస్కారముల మూట. సర్వమును గుర్తించుచూ, సర్వసంకల్పములు చేయు తెలివి. అంతఃకరణయొక్క ప్రథమ పరిణామము. ఈ మనస్సులేని జీవుడు లేడు. కనుక మనస్సునందలి పుణ్య పాప సంస్కారముల ననుసరించి జీవుడు వరుసగా వివిధములగు శరీరములయందు ప్రవేశించుచూ, నిర్గమించుచూ ఉన్నాడు. ప్రాణము యొక్క చాలనశక్తిచే ఈ సాంస్కార రూపమగు మనస్సు జన్మాంతరములకు, లోకాంతరములకు లాగుకొని పోబడుచున్నది. ఏ శరీరమునందు, ఏ జీవి, ఎంతకాలముండవలెనో నిర్ణయించునది ఎవరు? ఈశ్వరుడని కొందరందురు. తన సంస్కార ఫలములు అనుభవించు టకు యోగ్యమైన శరీరమును ఎన్నుకొని ఆ కార్మనుభవము పూర్తి అయిన వెంటనే ఆ శరీరమును వదలి మరొక శరీరములో ఈ మనఃప్రాణములు ప్రవేశించును. చినిగిపోయిన వస్త్రమును వదలి మానవుడు నూతన వస్త్రమును ధరించు నట్లుదేహియగు జీవుడు పాత శరీరమును వదలి క్రొత్త శరీరమున ప్రవేశించును అని చెప్పుట పూర్తిగా సరిఅయినది. కాదు. ఏలననగా బలిష్టుడైన ఒకపురుషుడు మంచి యవ్వనములోనే శరీరమును వదలి పోవుటలేదా! వయస్సుతో గాని, బలముతోగాని నిమిత్తము లేకుండా ప్రాణులకు మరణము సంభవించు చున్నది. కనుక మరణ కాలమును నిర్ణయించునది శరీర బలము కాని...

వయస్సుగాని కాదు. కర్మానుభవము పొందుటకు పుట్టినవాడు. కర్మానుభవానంతరము పోవుచున్నాడు. కనుక కర్మయే జనన మరణములకు కారణమనవలెను. "కర్మమున బుట్టు జంతువు కర్మమును వృద్ధిపొందు, కర్మమున చెడున్, కర్మమే జనులకు దైవము, కర్మము సుఖదుఃఖములకు కారణమధిపా" అన్నారు. కనుక కర్మయేదైవము ఈశ్వరుడు సర్వహృదయ క్షేత్రముల యందు ఉన్నాడని, చెప్పినారన్నా, కర్మ సంస్కారములు అంతఃకరణమునందు ఇమిడియున్నాయన్నా ఒకటేనని గుర్తించదగును. కనుక కర్మయే జనన మరణ కాలములను నిర్ణయించును.

మరణకాలమున జరుగునది ఏమి? మరణమెట్లు కలుగుచున్నది? కర్మానుభవము పూర్తి అయినచో శరీరము పడిపోవును. ఏఇంద్రియము ద్వారా చేయబడు కర్మానుభవము పూర్తి అగునో ఆ ఇంద్రియములందలి చైతన్యము ఉపసంహరింపబడి అంతఃకరణకు చేరుట ప్రారంభించును. దేనిపని పూర్తి అయినచో ఆ యింద్రియ చైతన్యము ఒక్కటొక్కటిగా అంతఃకరణ స్థానమునకు చేరిపోవును. ఇక అంతఃకరణ రూపమగు మనస్సు ముఖ్య ప్రాణము మాత్రము శరీరమునందు శేషించియుండును. ఆ సమయమున బయట చేరిన బంధు మిత్రులు ఎంత ఏడ్చి మొత్తుకొన్న బాహ్య ప్రపంచ జ్ఞాన మేమియు లేక అంతరంగమందు మాత్రము భావనా రూపంగా శేషించిన కర్మానుభవము అనుభవించును. అది కూడ పూర్తి అయినప్పుడు ప్రాణము మనస్సును శరీరము నుండి బహిర్గతము చేయును. ఈ అంతిమ కాలము అనగా మరణమున కత్యంత సన్నిహిత కాలము చాలా ముఖ్యమైనది. అపుడు కలిగిన సంకల్పములే ఉత్తర జన్మకు కారణమగుని చెప్పినా,లేక ఉత్తర జన్మను సూచించు భావములు ఆస్థితి యందు సూచించపబడునని చెప్పినా ఒకటే.

ఆ స్థితియందు భగవన్నామస్మరణ చేయవలెను. లేకప్రణవము స్మరించవలెనని అట్లు చేసినవారు పుణ్యలోకములు లేదా మోక్షమును పొందుదురని చెప్పబడుచున్నది. జీవితములో నిరంతర పూర్వాభ్యాసమువలన గాక, అప్పుడు క్రొత్తగా ఇట్టి పారమార్థిక చింత కలగనే కలగదు. కనుకనే జీవితమంతయు అనుష్టానము, అభ్యాసము చేయవలయునని చెప్పుచున్నారు.

పరిపూర్ణ భావజ్ఞునికి లోక భ్రాంతి కాని, ఉత్తమ జన్మ భ్రాంతి కాని, మోక్ష భ్రాంతిగాని లేదుకదా! అతని అంతిమ కాలము ఎట్లుండును? ఇతరుల అంతఃకరణ ప్రవృత్తి ఆ సమయమున ఎట్లుండును? "నేనే బ్రహ్మము, బ్రహ్మయే నేను. మరణానంతరము నేను ఆ బ్రహ్మమునందే ఐక్యమగుదును అనుకొనేవాని స్థితి అప్పట్లో ఎట్లుండును? త్రాచుపాము కరచి ఆ విషము తలకెక్కుచు రాగా క్రమముగా చైతన్యము క్షీణించుచుండిన వాని స్థితి ఎట్లుండునో అట్లుండునని కృష్ణ దేశికేంద్రులు తమ కంద పద్యములలో "నిజగురుబోధ నెరుంగక గుజగుజ శిష్యులకు చెప్పు గురువుల బోధల్ బుజగ విషోపమగు సుమి" అని తెలవిచ్చినారు. కించిజ్ఞత్వముగల తన వ్యష్టీ జ్ఞానము వికాసము చెంది అఖండ జ్ఞానస్వరూపమగు బ్రహ్మము

నందు ఐక్యమగునని ఆశించినవాడు తన జ్ఞానము వికాసము చెందుటకు బదులుగా
క్షీణించిపోవుచున్నదే అని దుఃఖాక్రాంతుడగును అని చెప్పబడినది. గురుకృపచేత
జీవితమునందే పరిపూర్ణ బోధను ఆరూఢము చేసుకొన్న వారు ఏ నిర్ణయమును చేయక నేనన
నీవనక బ్రహ్మమనక, పరమ శాంతితో నుందురు కనుక వారికి ఎట్టి ఆశాభంగమున్ను లేదు
జీవితమునందే గాక మరణావస్థ యందును వారి అంతఃకరణము శాంత స్థితిలోనే ఉండును
భావనారూపముగ చింతించు మనస్సు ఇంకనూ నిలిచియుండిననూ అది నిస్తరంగ
సముద్రమువలె నిస్సంకల్ప స్థితిలోనే ఉండును. జీవితములో కొందరికి ఇట్టి స్థిత్యానుభవవ
కలిగి ప్రారబ్ధ శేషముఇంకనూ మిగిలియుండుటచే తిరిగి మనస్సు యథాస్థితిలోనికి వచ్చుటయ
కలదు. కనుకనే మరణము కూడా ఒక అవస్థయే అనగా స్థితియే అని చెప్పడమైనది. "చచ్చుట
పుట్టుట, మేలుక వచ్చుట, గాఢాసుషుప్తి వచ్చుట యీ నాల్గచ్చముగ సహజయెరుకకు" అన్నారు
కృష్ణదేశికులు. అవస్థాత్రయమని కొందరన్నారు. తురియావస్థతో కల్పి నాల్గవ స్థలని కొందరన్నారు
తురీయాతీయతమని చెబుతూ 5 అవస్థలని కొందరన్నారు. కాని శ్రీ శివరామ దీక్షితీయ
నిర్ణయప్రకారం రెండే అవస్థలు. 1. కల, 2. మేల్కొ ఎరుకే కల, ఎరుకను కలలో ఎన్ని అవస్థలైన
చెప్పవచ్చును. అందు మరణము కూడా ఒకటి. కనుకనే మరణావస్థయని చెప్పడమైనది.
ఇంతేగాక జాగ్రత్తనుండి స్వప్నము, స్వప్నము నుండి సుషుప్తి నిత్యమూ కలుగుచున్నందున
వానికి అవస్థలని పేరు వచ్చినది. అవస్థ అనగా ఒక స్థితి మాత్రమే. మరణము కూడా ఒక స్థిత
వంటిదే. పుట్టినది గిట్టక తప్పదు. గిట్టినది పుట్టక తప్పదు. కనుక జనన మరణములు రెండూ
కూడా అవస్థలనియే అనవలసివచ్చినది. మరణకాలము ఆసన్నమై ఆ అవస్థయందలి
స్థిత్యానుభవమును పొందిననూ శరీరమునుండి ప్రాణముపోక తిరిగి స్వస్థత పొందిన వారున్ను
కలరు. కనుక మరణమన్నది కూడా ఒక అవస్థ మాత్రమే. మరణావస్థ నదిగమించి ప్రాకృతమునకు
వచ్చితివి కదా! అనీ అవసాన దశయందె ట్లున్నది? అని ప్రశ్నిస్తే ఏమి చెప్పవలె? "ఎరుక
ఉండం గానే ఎరుకావిశ్వములు లేవు. ఎరుకకే ఇది చూడ ఎంతోవింతైతోచె" అని సమాధానము
చెప్పవలసినదే.



ఓం

శ్రీ గురుభ్యోనమః

## "పరిపూర్ణ దర్శనాచార్య సదానంద"

## శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు గారి

## రచన గ్రంథముల వివరములు

| | | |
|---|---|---|
| 1. | పరిపూర్ణ దర్శనం | రూ.40-00 |
| 2. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత పరంపరా గురువుల జీవిత చరిత్ర | రూ. 15-00 |
| 3. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాస మంజరి (4వ భాగము) | రూ. 18-00 |
| 4. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము వేదాంత కథలు | రూ. 15-00 |
| 5. | భ్రాంతి రహిత శ్లోకములు - సవ్యాఖ్యానము | రూ. 12-00 |
| 6. | నిఖిల వేదాంతార్థ నివహము | రూ. 12-00 |
| 7. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము జాబులు - జవాబులు | రూ. 20-00 |
| 8. | శ్రీ శివరామ దీక్షితీయ సూక్తి ముక్తావళి | రూ. 20-00 |
| 9. | గురుస్తోత్రము (మొదటి భాగము) | రూ. 25-00 |
| 10. | గురుస్తోత్రము (రెండవ భాగము) | రూ. 25-00 |
| 11. | అచలము - వేమన | రూ. 5-00 |

ఈ గ్రంథములు వలయువారు :

**శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిరము**

డో.నెం. : 10-204/ఏ, యర్రబాలెం - 522 503

మంగళగిరి మండలము, గుంటూరు జిల్లా

---

సూచన : అడ్వాన్సు పంపిన వారికి వి.పి.పి. చేయబడును.